# హోమియో వైద్యం

## ద్వాదశ లవణ చికిత్సలు

(1,2 భాగములు)

(ప్రత్యేక అనుబంధము: హోమియోపతి మెడిసన్స్ డిక్షనరి)


రచన :

డా॥ K.V.N. ప్రసాద్

D.H.M.S. (M.H.S London)

వ్యవస్థాపకులు : హోమియో, ప్రకృతి, యోగపరిషత్;
ఛీఫ్ ఫిజిషియన్, చారిటబుల్ డిస్పెన్సరీ,
తెనాలి.





ప్రకాశకులు : ☎ 246 2565

మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదురుగా
కోటగుమ్మం, రాజమండ్రి -1

కాపీరైట్ 2012 వెల : 100-00




**హోమియోవైద్యం 1,2 భాగములు**

(ప్రత్యేక అనుబంధము: హోమియోపతి మెడిసన్స్ డిక్షనరి)


రచన :

డా॥ K.V.N. ప్రసాద్ D.H.M.S. (M.H.S London)

వ్యవస్థాపకులు : హోమియో, ప్రకృతి,యోగపరిషత్;
ఛీఫ్ ఫిజిషియన్, చారిటబుల్ డిస్పెన్సరీ,
తెనాలి – 522 201.
ఫోన్ : 220832





ప్రకాశకులు :

మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదురుగా, కోటగుమ్మం,
రాజమండ్రి - 533 101.

# హోమియో వైద్యం - 1 విషయ సూచిక

## హోమియో-ప్రథమ చికిత్స

## హోమియో వైద్యం - 2 విషయసూచిక



### చికిత్సా విభాగము



4

## హోమియో వైద్యము-ప్రాథమిక పరిజ్ఞానము

ఈ గ్రంథ ప్రారంభమునకు ముందుగా అతి ముఖ్యమైన ఈ క్రింది సూచనలను ప్రతివారు కడు జాగ్రత్తగా గమనించవలెను.

1. హోమియోపతి మందు సేవించుటకు 'ఒకగంటా', మందు సేవించిన తరువాత 'ఒకగంటా' ఎటువంటి 'ద్రవ', 'ఘన' పదార్థము లను తీసికోరాదు.

2. ఈ గ్రంథములో ప్రతి మందుకూ "30,200,1M" అనియూ, ఇంకా అదే వ్యాధికి, 'రెండు లేదా మూడు' మందులను వ్రాయుట జరిగినది. ఉదా॥ "కుడి చెవిపోటు: బెల్-30,200, 1M; కేమో-30, 200,1M"అని ఉన్నదనుకోండి! ఇప్పుడు మందును సేవించువారు ఈ ప్రకారముగా సేవించాలి. ముందుగా బెల్-30ని ఉదయము 2మాత్రలు, సాయంత్రము-3 మాత్రలు, రాత్రి-3 మాత్రల చొప్పున 4-5 రోజులు వాడాలి. ఇలా వాడినపుడు ఏ మాత్రము 'గుణము' కనిపించని ఎడల ఇదే మందును 200 పవర్‌లో పై విధముగానే రోజుకు మూడుమార్లు చొప్పున 3-4 రోజులు వాడాలి. అప్పటికీ వ్యాధి తగ్గుముఖము పట్టనిచో 1M (వెయ్యి పవర్) లో ఒకడోస్‌వేసి, పదిరోజుల వరకు వేచి చూడాలి. ఐనాసరే వ్యాధి బాధలో మార్పురాని పక్షములో 'కెమో మందును' 'బెల్' మాదిరిగానే వాడాలి. అప్పటికినీ ఏ మార్పురాని పక్షములో వెంటనే అనుభవజ్ఞు డైన హోమియోవైద్యుని సంప్రదించవలెను.

3. పై విధముగా మందులను సేవించు చున్నప్పుడు వ్యాధి తీవ్రత 'పెరిగినా-తరిగినా' వెంటనే హోమియో మందులను సేవిం చుట ఆపవలెను. ఎందుకంటే 'అల్లోపతి', 'ఆయుర్వేదము'లలో వలె 'వ్యాధితగ్గే వరకు' హోమియో మందులను వాడరాదు.

ఉదా: మందు ఉదయము 1డోస్ వేసేసరికి చెవిపోటు తగ్గు ముఖము పట్టినదనుకోండి. మధ్యాహ్నము 2వ డోస్‌ను వేయరాదు. ఇలావేస్తే చెవిపోటు పెరిగే అవకాశము కూడ ఉండవచ్చును.



## తొలిపలుకులు

**"ఎందరో మహానుభావులు! అందరికీ వందనములు!!"**

**అన్నారు -త్యాగయ్య**

శాస్త్రీయ విజ్ఞానరంగములో ఎందరో మహాపురుషులు ఉద్భ వించి, విజ్ఞాన స్థాయిని ఉద్ధరించారు. ఆ విజ్ఞాన మూర్తులకు మనకు ఎంతగానో ఋణపడి ఉన్నాము. ఉత్తమ ఆశయములు శాస్త్రజ్ఞులందరిలో కనిపించే లక్షణమైననూ కొందరు ప్రతికూల పరిస్థితులలో... అసువులను బాసి, **'అమరజీవులు'** అయ్యారు. ఐతే! అదృష్టవంతులు తమ జీవితకాలములోనే ఆశయ సిద్ధితో, కీర్తి, సంపదలచే కటాక్షించ బడ్డారు. ప్రజాక్షేమమునకై వెదజల్లిన విజ్ఞానకాంతులతోటి, సుస్థిరమైన, శాశ్వతమైన మూల సూత్రము లతో నిర్ణయించబడిన **'ఆశాజ్యోతి'** హోమియోపతి! దీనిని 'డా॥శామ్యూల్ హానిమాన్' సిద్ధాంతీకరించారు. వీరు హోమియో పతి శాస్త్రమునకు ఎంతో ఖ్యాతిని సంపాదించి పెట్టిన మహాత్ములు! డా॥ నాష్, కెంట్, బోరిక్, రాబర్ట్, హెలెంట్, హెరింగ్, ఇగ్లింగ్, బోనింగ్‌హాసన్,క్లార్క్, ఫారింగ్టన్ మొదలగు వైద్యుల గ్రంథములను చదివి; అనేక అద్భుత నివారణలను ఈ 30 సంవత్సరములలో చేసిన నేను ఈ వైద్య విధానమునకు నా జీవితమును అంకితముగా చేయదలచితిని. **"పూవులతో కూడిన నారకు వాసన అబ్బినట్లు"** అనేకమంది సోదర సోదరీమణులకు, ప్రతిగృహిణికీ నాచే రచించ బడిన ఈ గ్రంథము వైద్య విజ్ఞానమును పంచి ఇచ్చుటయేగాక ఇదిచదివి, ఆచరించుటవలన వారి కుటుంబము ఆరోగ్యానందా లతో విరాజిల్లుట తథ్యము. మానవసేవయే మాధవ సేవ!" అన్నారు పెద్దలు!! కాబట్టి తోటి వారికి కూడా వైద్య సేవను చేసి,లోకోపకా రులై తరించవలసినదిగా ప్రియపాఠకులను కోరుచూ...

**మీ**

**రచయిత**

## నామాట

కాలానుగుణమైన మార్పులతో, క్రొత్త ప్రయోగముల చేర్పులతో విస్తృతీకరించబడి, ఎక్కడ పడితే అక్కడ విరివిగా లభ్యమవుతున్న 'హోమియోపతి వైద్యము' అత్యాధునిక, నిత్యపరిశోధనా భరితముగా ప్రపంచఖ్యాతిని గాంచినది. పరిపూర్ణ సిద్ధాంతములు గల ఈ వైద్యము మీద-అనేక అపోహలు కలవు. ఉదాహరణ: "పనిచేయుట-నిదానము, పత్యము-పానములు-కఠినములు, తరుణ వ్యాధుల యందు పనిచేయవు" అనిచాల అపోహలు కలవు. దీనికికారణము..... "ఆర్గనాన్, దీర్ఘవ్యాధులు, మెటిరియా మెడికా ప్యూరా" అనుగ్రంథములను ఆకళింపు చేసికో పోవుటయే! వ్యాధిగ్రస్తులనే గాక.... తరతరముల నుండి అనేక మానసిక, శారీరక వ్యాధులు-నేటి ఆధునిక సమాజమును కలుషితము చేయుచున్న పరిస్థితులలో సహజ -శాస్త్రీయమైన హోమియోపతి వైద్యము-ఈ రోగములను నిరోధించి; వ్యక్తిని, ఈ సమాజమును-తద్వారా... రాబోయే తరములను సంపూర్ణ ఆరోగ్య వంతులుగా తయారుచేస్తుంది. ఈ మహత్తరమైన శాస్త్రమును **'గృహ వైద్యము'**గా అందించుట.... సాహసమే ఐనా.... **'చంద్రునికో నూలుపోగు'** వలె.... ప్రియతములైన అఖిలాంధ్ర పాఠక దేవుళ్లకు సవినయముగా సమర్పించుట జరిగినది. ఇతర వైద్యవిధానములతోటి విసిగి, వేసారిన... సోదర-సోదరీమణులు ఆర్థికపరఇబ్బందులకు గురియయ్యే బీద-సాదలు, వైద్య సౌకర్యములేని గ్రామ-పుర జనులు- ఈ గ్రంథము ద్వారా ప్రమాదముల నుండి, సామాన్య వ్యాధుల నుండి రక్షించుకొనుటయే గాక... వీటి కొరకు వెచ్చిస్తున్న అనేక రూప్యములు మిగులుతాయి. కావున.... ఈపుస్తకమును బాగ శ్రద్ధగా చదివి, ఆచరణలో పెట్టుటవలన... హోమియోపతి వైద్యవిశిష్టము, సౌలభ్యములను తెలిసికోగలుగుతారు. ఈ గ్రంథము- **"జిజ్ఞాసగల స్త్రీ-పురుషులను-ఆకర్షించగలద"**నీ, **"వైద్య చికిత్సల కొరకు ప్రదక్షిణములను చేయించనీయకుండా.... అనేకమంది రోగులకు 'ఆశాజ్యోతి'కాగలద"**నీ మా ఆకాంక్ష........





# హోమియోపతి వైద్యము-1

## "హోమియోపతి"అను పదమునకు అర్థమేమిటి...?

గ్రీక్‌భాషయందు **"హోమియో"** అనగా **"సారూప్యము గల విధానము"** యని, లాటిన్ భాషయందు **"పతి"** అనగా **"బాధ"**యని అర్థము. **"హోమియోపతి"** అనగా పూర్తిఅర్థము **"సారూప్యముగల బాధ"** యని!! ఇదే ఈవైద్యమునకు మూలసూత్రము!!



**"సిమిలియా సిమిలిబస్ క్యూరెంటర్** (SIMILIA SIMILIBUS CUREN TUR= LET LIKE BE CURED BY LIKE)" అంటే చాలామంచి ఆరోగ్యముగల మానవునిమీద ఒక ఔషధమును ప్రయోగించినపుడు (తినిపించినపుడు) ఏ లక్షణములైతే కనిపిస్తాయో ఆ లక్షణ సముదాయమును రోగికి కూడా ఉన్నపుడు ఆ ఔషధమే ఆ లక్షణములను తొలగించి, రోగికి స్వస్థతను చేకూర్చును.

పై సూత్రములమీద రుజువు చేయబడిన మందులకు ఐదురకములైన తేడాలు కలవు : 1. విరుగుడు, 2. సహాయకారి, 3. అనుచరి 4. విరుద్ధమైనది, 5. ఒకే కుటుంబమునకు చెందినది.

1. మనము ఒక ఔషధును ఒక రోగికి ప్రయోగించి నపుడు (తినిపించి నపుడు) కలిగే తీవ్రతను తగ్గించుట కొరకు ఇచ్చే ఔషధమును **"విరుగుడు"** అంటారు.

2. మనము ఒక మందును రోగికి ఇచ్చినపుడు అది పూర్తిగా వ్యాధిని నయము చేయలేనప్పుడు లేదా వ్యాధి మరలా తిరిగి వచ్చినప్పుడు ఇచ్చే వేరొక మందును "సహాయకారి" అంటారు.

3. ఒకే వ్యాధి లక్షణములమీద పనిచేసే మందుల ఉత్పత్తి వేరైనా సమానముగా పనిచేయు మందులను **"అనుచరి"** అంటారు. దీనిని మొదట యిచ్చిన మందు తరువాత వాడవచ్చును. దీనిని యిచ్చుట వలన రోగికి త్వరితముగా స్వస్థత చేకూరును.

4. మనము మన విరోధులవద్ద ఉంటే ఎట్లు అపకారము జరుగునో అట్లే మొదట యిచ్చిన మందుకు విరోధి మందును అయిన ఎడల రోగికి అపకారము జరుగును. వీటిని **"విరుద్ధ మందులు"** అంటారు.

5. ఒకటే ఉత్పత్తి, మందుల పోలికఉండి, పేర్లు, గుణములు కొద్దిగా మార్పుచెందుతాయి. ఉదాహరణ: బ్రోమిన్, క్లోరిన్, అయోడిన్ మొదలగునవి. హోమియోపతి నందు వృక్ష, జంతు, ఖనిజములకు సంబంధించిన మూల పదార్థములతో ఔషధములు తయారు చేయబడుచున్నవి.

## హోమియోపతి యందు ఔషధ నిర్ణయమును చేయుటకు తీసికోవలసిన సూచనలు

1. **"రోగములను లక్షణములద్వారా గ్రహించుట"** అంటే రోగులు అనుభవించు చున్నబాధలను లక్షణములద్వారా తెలిసికొని, ఒక కాగితముమీద వ్రాసికోవలయును.

2. లక్షణములకు సరిపోయిన మందులను తెలిసికొని, రోగికి ఇవ్వవలెను. (**'మెటిరీయా మెడికా'**లను చదువుటవలన...రోగులకు సరైనమందును ఎంచి ఇవ్వగలము).

3. **"ఏక వస్తు ప్రయోగము"** అనగా రెండు మందులను కలిపి ఒకేసారి ఇవ్వకూడదు.

4. రోగములను నయముచేయుటకు (వ్యాధినివారణకు)ఎంత సూక్ష్మ మోతాదు అవసరమో? ఎంతపవర్ (పొటెన్సి= Potency అవసరమో! అంతే ఇవ్వవలెను.

5. గాయములకు, కాల్పులకు, మరికొన్ని ప్రమాదకరమైన దెబ్బలకు–బాహ్య చికిత్సను చేయవలెను. (పైపూత మందులనువాడుట హోమియోపతి సిద్ధాంతమునకు వ్యతిరేకము! ఐనా పైనతెలిపిన కొన్నిసందర్భములలో హోమియోపతి బాహ్య చికిత్సను అంగీకరించును.)

హోమియోపతియందు రోగనామముతో పనిలేదు. రోగి అనుభవించే అసహజ బాధాకర లక్షణములను తొలగించుటయే ప్రదానము! అందుకే.... హానిమాన్–TREAT THE PATIENT AND NOT THE DISEASE అన్నారు. కావున రోగికి ఉన్న అనారోగ్య లక్షణములను తొలగించిన ఎడల ఆరోగ్యము చేకూరినట్లే! **"రోగనివారణ"** అంటే రోగలక్షణములు అదృశ్యమగుటయేగాక తిరిగి లోగడ ఉన్న ఆరోగ్య స్థితికిచేరుటయే (శాశ్వత నివారణ అంటే మందులతో పనిలేకుండా ఉండుటయే)!!





**"రోగమును లక్షణముల ద్వారా గ్రహింపవలెన"**ని లోగడ తెలుసు కున్నాము. వాటిని రెండు విధములుగా విభజించవలెను. అవి: 1.మానసిక మైనవి, 2. శారీరక మైనవి.

**మానసికమైన వ్యాధులు:** ఇవి రెండు రకములు 1. స్వభావము, 2. మానసికము

పై రెండింటిని కలిపి లక్షణ సముదాయము అంటారు.

శారీరకమైన వ్యాధులు రెండు రకములు

1. ఏదో ఒకభాగమునకు చెందినవి. 2. శరీరము అంతటికీ చెందినవి. కడుపునొప్పి, కీళ్ళనొప్పులు మొదలగునవి.

2. "శరీరము అంతటికినీ చెందినవి" అనగా శరీరము లోని ఒక భాగమునకు సంబంధించిన దైనప్పటికీ శరీరము మొత్తము, అస్వస్థత చెందును.

**ఉదా:** దాహము, నిద్ర, ఆకలి, కోపము మొదలగునవి.

కావున ఔషధ నిర్ణయములో మానసిక, స్వాభావిక, శారీరక లక్షణము లన్నియు సరిచూచి; రోగికి మందుల నిచ్చినపుడే రోగము శాశ్వతముగా నివారణ యగును.

**చికిత్సలో మనము ఆచరించునవి మూడు రకముల చికిత్సలు :**

1.వ్యాధి నిరోధకము, 2.నివారణ, 3. ఉపశమన చికిత్సలు

పై మూడు రకములు కూడా ఈ పుస్తకమునందు పొందుపరచ బడినవి. ఇవికాక 'అనుభవ వైద్యములు' కూడ కలవు. వీటిని 'ఎమ్పిరిసిజమ్ EMPIRICISM) అంటారు. దీనిలో శాస్త్ర విమర్శనకు సంబంధించిన అంశము ఉండదు.

## హోమియోపతి విధానములోనికి వలస వచ్చిన వైద్యములు

**1. ఐసోపతి (ISOPATHY) :** డా॥ లాక్స్ హెరింగ్ (1823) "టాక్సింగ్‌ను సరియైన పద్ధతిలో తయారు చేసిన రోగనిర్ణయమగున"ని వీరి సిద్ధాంతము.

**2. ద్వాదశ లవణ చికిత్స :** శరీరములోని కొన్ని ధాతువుల లోపమువలన కొన్ని వ్యాధులు వచ్చునని ఆలోపములను పూరించిన రోగనివారణ జరుగునని డా॥ ష్లర్క్ (జర్మనీ దేశస్థులు) సిద్ధాంతీకరించారు.

**3. సీరమ్ థెరాపి (STRUM THERAPY) :** వ్యాధితో బాధపడురోగి నుండిగాని, జంతువులనుండిగాని వ్యాధి పదార్థమును తీసికొని, రసాయనిక సమ్మేళనముతో ఔషధములుగా తయారు చేయుట.

రోగులకు చికిత్సను చేయునపుడు నిర్ణయించిన డోస్‌ను యిచ్చిన తరువాత ఆ ఔషధ కాలపరిమితిని చూచుకునే నిర్గుణ పదార్థముల నివ్వవలెను. దీనిని "పాసెబో (Placebo) ట్రీట్‌మెంట్ అంటారు. (అనగా రోగికి నమ్మకమును కలిగించుటకు ఔషధము కలుపని పంచదారమాత్రలనుమందు మాత్రలు వాడు తున్నట్లు ప్రతిరోజూ ఇచ్చుట దీనివలన **"నేను ప్రతిరోజూ మందులను తీసికొంటు న్నాను గనుక వ్యాధి తగ్గిపోతుంది"** అని వ్యాధిగ్రస్తునకు సంతృప్తి కలుగుతుంది. తరచుగా ఉపయోగ పడే మందులను **"పాలిక్రెస్ట్‌బహుళోపకరమైన ఔషధము"**అని యంటారు.

## మందులు-మోతాదు నిర్ణయము

హెచ్చు పొటెన్సిని తరచుగావాడరాదు. డా॥ కెంట్ **"హెచ్చు పొటెన్సి రెండు ప్రక్కల పదనుగల కత్తి వంటిది"** అని అన్నాడు. పొటెన్సి నిర్ణయములు, మోతాదుల నిర్ణయములు వైద్యుని అనుభవము, నైపుణ్యతలమీద ఆధారపడి ఉన్నది. (నా అనుభవములో నేను అన్ని పొటెన్సిలతోను విజయమును గాంచితిని. ఎక్కువగా ఉపయోగించు పొటెన్సి, మోతాదుల వివరణలను 'చికిత్స భాగము'ల నందుతెలిపి యుంటిని) "అనుభవమే.... దిక్సూచి' అన్నారు పెద్దలు.

అన్ని కేస్‌లయందు ఒకే రకముగా మోతాదు నిర్ణయముండదు. తరుణ వ్యాధులయందు ఆవ్యాధి తీవ్రతలనుబట్టి ప్రతిగంటకు లేదా ప్రతి15 నిమిషములకు మందును ఇవ్వవలసిరావచ్చును. దీర్ఘవ్యాధులయందు ఒక్కటే మోతాదును ఇచ్చి, రోజులతరబడి కూడ వేచియుండవలసి రావచ్చును. మోతాదు ఇచ్చిన తరువాత వ్యాధి ఉద్రేకముగానీ, ఉపశమనములుగానీ కనిపించిన ఎడల మందును ఆపి, పరిశీలించవలెను.

## మోతాదుకు ఇచ్చు హోమియోపతి మాత్రలు

హోమియోపతి మందును వయస్సును బట్టికాక వ్యాధినిబట్టి వారి జీవశక్తిని బట్టి లేదా ప్రతీకారశక్తిని బట్టి ఇవ్వవలసి వుంటుంది. సహజ ముగా 30వ నంబర్ మాత్రలు (హోమియోపతిలో మాత్రల పరిమాణము-నంబర్‌ను బట్టి ఉంటుంది). పెద్దలకు రెండు మాత్రలు, పిల్లలకు మూడు మాత్రలు, పసిపిల్లలకు ఒకమాత్ర చాలును (ఇందులో... సారూప్యమైన పొటెన్సి నిచ్చుట అతిముఖ్యము.)





## పై పూతకు ఇచ్చు హోమియోపతి మందులు

కడుపులోని వాడుమందునే **'మదర్ టించర్'** రూపములో పైపూతగా వాడ వలెను. గాయములు, దెబ్బలు మొదలైనవాటికి క్యాలెండులా పౌడర్‌నుగాని లేదా టించర్‌నుగాని వాడవలెను.

పొటెన్సి : 1,3,6,12 పొటెన్సిలు చిన్నవి. 30, 200 మధ్యమము! 1m (1,000),10m (10,000),50m.(50,000), లక్ష పొటెన్సిలలో కూడ ఔషధ ములు లభిస్తాయి వీటిని "పెద్ద పొటెన్సిలు" అంటారు (వ్యాధుల ననుసరించి "పొటెన్సి" "మోతాదులు" ఈ గ్రంథములో సందర్భానుసారముగా ఇవ్వబడినవి.)

## హోమియోపతి మందులను భద్రపరచు విధానము

హోమియో మందులకు ఎటువంటి సువాసనలు, ఘాటువాసనలు, దుర్వా సనలు తగులకూడదు. సూర్యరశ్మి, వేడి, ఎక్కువ తేమ తగులకూడదు. సిరా, అచ్చు, కార్బన్ చేయబడిన పేపర్స్‌ను మందులు కట్టుటకు ఉపయోగించరాదు. వైట్ పేపర్స్‌నే వాడవలెను. వీటిని భద్రపరచుటకు చెక్కలేదా తోలుపెట్టెలు హోమియోపతి షాప్‌లయందు లభ్యమగును. సీసాలకు బిరడాలు గట్టిగాలేని ఎడల టించర్‌లు ఆవిరి రూపములోహరించుకుపోతాయి. వీటికి చెడిపోవు కాలపరిమితి ఉండదు. వాడుకొనుటకు గాజు, ప్లాస్టిక్ సీసాలయందు డ్రామ్‌లు, ఔన్స్‌లు, పౌన్‌ల రూపములో ఈ మందులు లభించును. మందులను కలుపుటకు (డైల్యూషన్స్) ఉపయోగించు మాత్రలను "గ్లోబుల్స్ (Globules చిన్న గోళాకార మాత్రలు)" అని అంటారు.

## హోమియోపతి మందుల సంకేతములు

1. మాతృ ద్రావకములు - "Q (MOTHER TINCTURES")
2. అరకులు, ద్రావకములు - "Dilu, (DILUTIONS)"
3. పౌడర్స్, చూర్ణములు - "Trit. (TRITURETIONS)"
4. శతాంతపొటెన్సి-1 లేదా 2 అంకెల ప్రక్కన "C" ని పెట్టవలెను.
5. దశాంశ పొటెన్సి-1లేదా 2 అంకెల ప్రక్కన "X" అని పెట్టవలెను.
6. బిళ్ళలు "Tab. (TANLETS)" అని పెట్టవలెను.

ఈ సంకేతములను అన్ని దేశములలలోను ఒకటిగానే వాడతారు.

## ఔషధ సారూప్యము

"ఎ సౌండ్‌మైండ్ ఇన్ ఎ సౌండ్ బాడి (A SOUND MIND IN A SOUND BODY) అనగా "ఆరోగ్యవంతమైన శరీరములో వివేకవంతమైన మనస్సు

ఉండును" అని అర్థము. (దీనిని గురించి పూర్తిగా తెలిసికొనుటకు హోమియో తత్వశాస్త్రములో 'మియాజమ్స్' చదువవలెను.) మానవుని మనస్సు శరీరము కలిసి మనిషి అవుతున్నాడు. శరీరము మనస్సు యొక్క ప్రతిబింబము. కావున మనస్సు ఎట్లుఉండునో శరీరముకూడ అట్లేఉండును. ఔషధములను సారూప్యము చేయునప్పుడు మనస్సు+ శారీరక లక్షణములను సమన్వయ పరచుకోవలెను.

## మనస్సు ఎట్లు వ్యాధి గ్రస్తము అగును ?

"మనస్సు వ్యాధి గ్రస్తము యగుట"అనగా స్థిరతత్వముల నుండి అస్థిరత్వ ములలోనికి సహజతత్వము నుండి అసహజతత్వములోనికి మనసు పయనించుట! ఈ విధముగా మనస్సు కృత్రిమ మార్పుచెందుటకు త్రివిధకారణ ములను 'హనిమాన్' తెలిపారు. వీటికి "సోరా, సైకోసిస్, సిఫిలిస్" అనిపేరుపెట్టి; ఈ మూడింటిని "వ్యాధికారకములు (మియాజమ్స్) అని పిలిచారు.

"గ్రావోగల్" అను డాక్టర్ వ్యాధికారకములను 1. హైడ్రోజనాయిడ్, 2. ఆక్సిజనాయిడ్, 3. కార్బోనైట్రో జనాయిడ్" అని పిలిచారు.

ఆయుర్వేదశాస్త్రము "వాత, పిత్త, శ్లేష్మములు" అని వ్యాధికారకములను మూడు తత్వములుగ విభజించినది.

పైతత్వముల దోషము వలననే స్థిర-సహజతత్వములను కోల్పోయి వ్యభిచారము, దొంగతనము, మోసము, ఆత్మహత్య, హత్యలను చేయుట మొదలగు మానసిక పరిస్థితులకు లొంగిపోయి, సిగ్గులేకుండా సహజ నైతిక నిబంధనలకు వ్యతిరేక మార్గములోనడుచుచున్నారు. ఒక్కొక్కప్పుడు "తప్పు" అని తెలిసీ ఆ దుర్గుణములకు దాసులగుచున్నారు.

## మియాజమ్స్ (MIASMS) (వ్యాధి కారకములు)

### సోరా (PSORA)

'సోరా' మానవులను పీడించు పురాతనమైన వ్యాధి! గజ్జి, చిడుము మొదలగు చర్మవ్యాధులను పైపూత మందులతోటిగాని, ఔషధములను సేవించుటతోగాని అణచిపెట్టుట వలన ఆ తదుపరి కలిగే మానసిక, శారీరక మార్పులనే "సోరా"అని డాక్టర్ హానిమాన్ తెలిపారు.

పై స్థితినే "రోగజనకస్థితి" అంటారు. తరుణవ్యాధులు దీర్ఘవ్యాధులుగా మారుటకు "సోరా'యే పునాది. మానవునకు వ్యాపించు సమస్తవ్యాధులకూ ఈ సోరాయే మూలము. స్త్రీలయందుకలుగు సమస్త ఋతుదోషములకు,



గొడ్రాలితనమునకు; పురుషుల యందు ఏర్పడు నపుంసకత్వమునకు ఇదే ముఖ్యకారణము.

### సోరా మానసిక లక్షణములు

"1. మానసిక స్థిమితము లేకపోవుట, 2. గ్రహింపుశక్తి తగ్గిపోవుట, 3. అన్నిటియందు అసంతృప్తి; 4. కోపము, విసుగు, భయము, కోపము తరువాత పశ్చాత్తాపము" అను ఈ వ్యాధి లక్షణములు అన్నియు అమావాస్య మరియు పూర్ణిమనాడు తారాస్థాయి నందుతాయి. స్త్రీలలో ఈ లక్షణములు ఋతు(బహిస్టు) కాలమునందు కూడా ఉద్రేకమును చెందుతాయి.

### సోరా శారీరక లక్షణములు

తల త్రిప్పుట, శరీరమంతటా నొప్పులు, మెల్లకండ్లు, దృష్టిలోపములు (ఒకటి రెండుగాను లేదా కొన్ని భాగములు మాత్రమే కనిపించుట). చెవుడు, నోటి దుర్వాసన, నిద్రలో దంతములను కొరకుట, నిద్రలోనే కలవరించుట లేదా నడచుట, పిల్లలకు త్వరగా దంతములు రాకపోవుట, త్రేనుపులు, ఎక్కిళ్ళు, మొలలు, గర్భస్రావములు, స్త్రీ-పురుషులకు-రతిని ఎంత సేపుచేసినా శుక్లస్ఖలనము కాకపోవుట, వృషణముల వాపు, స్త్రీ-పురుషుల జననేంద్రియముల మీద వెంట్రుకలు లేకపోవుట, బట్టతల, మృతశిశువులు జన్మించుట, శ్వాసకోశ-జీర్ణాశయవ్యాధులు, సంభోగవాంఛ- అధికమగుట లేదా అసలు లేకపోవుట, ఆకలిలేకపోవుటలేదా అమితమైన ఆకలి, నిద్ర పట్టకపోవుటలేదా నిద్రమత్తు, కలలు (పీడకలలు లేదా భయంకరమైన కలలు) మొదలగు లక్షణములను బట్టి 'సోరా'ను నిర్ణయించ వచ్చును.

### సోరా నిర్మూలనకు ముఖ్యమైన ఔషధములు

ఎనాకార్డియమ్ (Anacardium), కాల్కేరియా కార్బోనికా (Calcarea carbonica), కాస్టికమ్ (Causticum), గ్రాఫైటెస్ (Graphites), లైకోపోడియమ్ (Lycopodium), సోరినమ్ (Psorinum), సెపియా (Sepia), సల్ఫర్ (Sulphur) మున్నగునవి కలవు.

### సైకోసిస్ (PSYCHOSIS)

రోగత్రయ సిద్ధాంతములో సైకోసిస్ రెండవది. "సుఖ వ్యాధులు" అని చెప్పబడే "గనోరియా, సిఫిలిస్" అను వాటిలో గనోరియా వ్యాధిని అణచి పెట్టుటచే కలుగు మానసిక, శారీరకలక్షణములను "సైకోసిస్ మియాజమ్స్" అంటారు. ఇది 1809- 1814 సంవత్సరములలో జరిగిన ఫ్రెంచ్ యుద్ధము

తరువాత స్త్రీ-పురుష రతిసంబంధముల వలన ఒకరినుండి మరొకరికి సంక్రమించినది.



## గనోరియా (GONORRHIEA)

గనోరియా సంభోగానంతరము జననేంద్రియముల నుండి స్రావముతో ప్రారంభమై మంట, పోటుతో కూడి ఉంటుంది. మూత్ర విసర్జన సమయములో చురుకు, మంట వుంటుంది. పురుషులకు జననేంద్రియమును స్తంభింపచేసి, నిద్రాభంగమును కలిగించును. దీని స్రావములు దుర్వాసన (నీచువాసన)ను కలిగియుండును. తెలుపు, పసుపు, ఆకుపచ్చ రంగులతో కలసియుండును.

గనోరియా ముదిరిన తరువాత బాధలుతగ్గి, స్రావము మాత్రము వచ్చు చుండును. ఈ స్థితిలో దీనిని "గ్లీట్ (GLEAT)" అంటారు. అల్లోపతి వైద్యులు "ఇది గనోకోకస్ (GONOCOCCUS) అను క్రిమివలన వ్యాపిస్తున్న"దని చెబుతున్నారు. ఇదిసంభోగానంతరము కొన్నినిమిషములనుండి, 15రోజులలో బయటపడవచ్చును.



## గనోరియా అణచి పెట్టుటచే కలుగు మానసిక లక్షణములు

ఈ వ్యాధిఉన్నవ్యక్తికి అనుమానముహెచ్చు. ప్రతిచిన్న విషయమూ అనుమానమును కలిగిస్తుంది. ప్రతిచిన్న విషయమునూ అతిరహస్యముగా వుంచుతాడు. తగాదాలాడు స్వభావముతో ఎప్పుడూ ఇతరులకు అపకారము చేయు తలంపుతో అబద్ధములాడు చుండును. ఎప్పుడూ సెక్స్ సంబంధమైన ఆలోచనలుండును. జ్ఞాపక శక్తి నశించును.

'సోరా'నందుకూడా జ్ఞాపకశక్తి నశించుట గలదు. ఐతే సోరానందు ఆలోచిస్తే గుర్తుకు వస్తుంది. సైకోసిస్‌నందు గుర్తుకు రాదు. ఐతేదాని అంతట అదియే ఎప్పుడో గుర్తుకు వస్తుంది. సోరాయందు ముఖ్యముగా మనిషి ఊరు, జంతువుల పేరులను మరచిపోతుంటాడు.

## గనోరియా శారీరక లక్షణములు

అండములు, బీజములవాపు; తరచు జలుబు చేయుచుండును. గర్భాశయ దోషములు ఏర్పడును. ఈవ్యాధి ఉన్నవారికి ఏ అవయవమైననూ వాపును కలిగి ఉండవచ్చున. రక్తక్షీణత, దీని స్రావము లన్నియు నీచువాసనతో వుండును. ఊబ శరీరము, మాంసముపడదు, తింటే రోగలక్షణములన్నియు ఉద్రేకము చెందుతాయి. (సోరానందు పాలుపడవు),గుండె, ఊపిరితిత్తుల వ్యాధులు ఎక్కువగా రావచ్చును.దీని బాధలు వానాకాలము నందు అధికము



ఔతాయి. పులిపిరికాయలు పెరుగుతాయి. ఈ మానసిక+శారీరక లక్షణములు నన్నింటినీ కలిపి "సైకోసిస్ మియాజ్‌మ్" అంటారు.

## సైకోసిస్ నివారణ మందులు

'సోరా'కు సల్ఫర్, సైకోసిస్‌కు-తూజ (Tuja) ముఖ్యముగా చెప్పబడుచున్నవి. ఆర్సెనిక్ ఆల్బ్ (Arsenic Alb) అర్సెనికమ్ ఐయోడేటమ్, ఏసిడ్ నైట్రిక్ మొదలగు మందులు సైకోసిస్‌కు నివారణ ఔషధములుగా చెప్పబడుచున్నవి.

## సిఫిలిస్ (SYPHILIS)

హానిమాన్ త్రిదోష సిద్ధాంతములో సిఫిలిస్-మూడవది! సిఫిలిస్ కూడ లైంగిక సంబంధమైన వ్యాధే. స్త్రీ-పురుషుల రతివలన ఒకరినుండి మరొకరికి సంక్రమించుచున్నది. సిఫిలిస్ వ్యాపించుటకు రతికాలము నుండి 15 రోజుల వరకు పట్టవచ్చును.

## సిఫిలిస్ చరిత్ర

ఇది 1493వ సంవత్సరములో తన భయంకరమైన స్వరూపమును ప్రజ్వలింప చేసినది. సంయోగ కాలమునందు ఏ దశయందు వుండునో ఆ దశయందే ఇది ప్రారంభ మౌతుంది. మొదట జననేంద్రియములమీద (అనగా స్త్రీ పురుష మర్మస్థాన ములయందు) చిన్నపొక్కుగానే ప్రారంభించి, బాధతో ఆ పుండు పెద్దది ఔతుంది. దీనిని "షాంకర్" అంటారు. ఇది ఎక్కడ లేచునో అక్కడ మాంసమును తినివేస్తుంది.

పుండు ఉన్ననూ, లేకపోయిననూ కొందరికి గజ్జలయందు గట్టి గడ్డలుగా లేస్తుంది. వీటిని 'ఒడిశగడ్డలు'(BUBO) అంటారు. దీనికి సరియైన చికిత్స జరుగని ఎడల అంతర్గతముగా, బాహ్యముగా సిఫిలిస్ వృద్ధిచెందుతుంది. షాంకర్‌ను అణచి పెట్టుటచే కలుగు మానసిక, శారీరక లక్షణములను సిఫిలిస్ మియాజ్‌మ్ అంటారు.

## సిఫిలిస్ మానసిక లక్షణములు

మందకొడి తనము; ప్రాణస్నేహితులు,బంధువులు, భార్యా, బిడ్డలు మరణించిననూ ఎటువంటి వ్యాకులతను పెట్టుకోదు. ఆత్మహత్య, హత్యచేసే తలంపులు ఎక్కువ. సోరా సైకోసిస్‌లందు ఈ తలంపులు ఉన్నప్పటికీ క్రియ వుండదు. దీనిలో క్రియవుంటుంది. మొండితనము, మూర్ఖత్వము ఎక్కువ. చదివినవి, చెప్పినవి గ్రహించుట చాలకష్టము. జ్ఞాపకశక్తి నశించును. ఉప్పు,

పులుపు, తీపి, చల్లని ఆహారపదార్ధ ములయందు కోరిక వుంటుంది. ఒంటరిగా వుండగోరుతాడు. స్వార్ధము ఎక్కువ.

11

## సిఫిలిస్ శారీరక లక్షణములు

దీని స్రావములు అన్నియు దుర్వాసనగా వుండును. సూర్యాస్తమయ సమ యము నుండి, సూర్యోదయము వరకు దీని వ్యాధి లక్షణములు ఉద్రేకమును చెందుతాయి. వెంట్రుకలున్నంత భాగము వరకే కురుపులు ఉంటాయి.

సిఫిలిస్‌కు ధాతువులను తినివేయుస్వభావము కలదు. నోటియందు పుండ్లు, శరీరమునందెచ్చటైనను లోతైనపుండ్లు ఏర్పడును. క్షయవ్యాధి రావచ్చును. దీనివలన వచ్చేచర్మవ్యాధులన్నీ రాగిరంగులో వుంటాయి. నిద్రలో సొంగకార్చు లక్షణముం టుంది.

## సిఫిలిస్ నివారణ ఔషధములు

సోరాకు-సల్ఫర్, సైకోసిస్‌కు-తూజ; సిఫిలిస్‌కు మెర్క్ సాల్ ప్రధాన ఔషధ ములుగా చెప్పబడినాయి. ఆరమ్‌మెట్ (Arum,Met), లెకెసిస్,స్టాఫిసేగ్రియ, సిఫిలినమ్ (Syphilinum), ట్యూబర్ (Tuber), మొదలగు వాటిని "సిఫిలిస్ మియాజమ్‌కు నివారణ-నిరోధక ఔషధములు"గా చెప్పబడినవి.

## "వ్యాధి" అంటే....?

"రోగులున్నారుగాని రోగములులేవు" అన్నారు డా॥హానిమాన్! "సజీవ శరీరము నందు అనేక అవయవ భాగములు-నియమము తప్పకుండా పనిచేయు చున్నవి. సజీవ మానవ శరీరమునందు "జ్ఞానేంద్రియములు, స్పర్శేంద్రియములు" అను రెండు ఇంద్రియముల వ్యవస్థలున్నాయి. వీటిది సమన్వయ క్రియాశక్తి! ఏ ఒక్కటీ ఏకత్వముగా జరుగుట లేదు.

కన్ను, ముక్కు, నోరు, చెవి, జీర్ణకోశము, గుండె, మెదడు, స్త్రీ-పురుష జననేంద్రియములు మొదలగు అవయవములన్నియూ ఒకదాని కొకటి సంబంధ మును కలిగి నడచుచున్నవి. కావున వీటన్నిటినీ క్రమముగా నడుపు శక్తి ఏదోఒకటి ఉండి ఉండవలయును. ఆశక్తి నశించినఎడల శరీరము చేష్టలుడిగి, చలనములేని ముడి పదార్ధమగుచున్నది. క్రుళ్ళి శిథిలమగుచున్నది. ఇట్లు నశించుటనే "మరణించుట లేదా చనిపోవుట" అనుచున్నారు. శవముగా మారిన తరువాత ఆ శవమునకు ఎన్ని ఔషధములనువాడినా, ఏ ఆధునిక చికిత్సలను చేసినా అది చైతన్యవంతముగామారదు.



"చైతన్యశక్తి (ప్రాణశక్తి లేదా జీవశక్తి)యే మనలను సజీవముగావుంచి; మానసికమైన శారీరకమైన పనులను చేయుటకు సహకరించుచున్నది. ఈ శక్తియే మనము తీసుకొనే ఆహారమును, ఔషధములను సక్రమముగా పనిచేయించి; శరీరమును అందముగాను, ఆరోగ్యముగాను ఉంచుచున్నది. బాక్టీరియా, వైరస్‌ల నుండి కాపాడునదీ ఈ శక్తియే" అని డా॥ హానిమాన్, రుజువుచేసారు. వ్యాధికి మూలకారణములు, లోపములు, నివారణలు ఇవన్నీ తొలుత జీవశక్తి లోనే ప్రారంభిస్తాయి. కావున ప్రకృతిశక్తికి, జీవశక్తికి మధ్య జరిగే సంఘర్షణ ఫలితమేవ్యాధి.

## జీవశక్తి ఎట్లు ఏర్పడును?

మానవులలో స్త్రీ-పురుషుల కలయిక (రతి)తోటి (శుక్ర-శోణితముల కలయిక వలన) పిండముఏర్పడి, అందు ప్రాణశక్తిఆవిర్భావమై, కోట్లాదికణ ములుగా విభజన జరిగి, వృద్ధినిపొంది, శరీరభాగముల నిర్మాణము జరుగు చున్నది. ఇట్లు ఏర్పడిన శరీరము (శిశువు) తల్లి గర్భమునందు ఉండగా తల్లి నుండి పోషక పదార్ధములను గ్రహించి, గర్భస్థకాలము పూర్తికాగానే సజీవముగా గర్భమునుండి బయటకు వస్తున్నది. ఇట్లు వర్తింపంచేయునది కూడ జీవశక్తియే!

## తరుణ, దీర్ఘవ్యాధులు

వ్యాధులు రెండు రకములు : 1.తరుణ వ్యాధి, 2.దీర్ఘవ్యాధి!

**1. తరుణవ్యాధి**

కొద్దికాలములోనే వ్యాధిపెరిగి, త్వరితగతిని రోగిని చంపుట లేదా నివారించు దానినే "తరుణవ్యాధి" అంటారు. ఐతే హోమియో సిద్ధాంతము ప్రకారము మియాజమ్‌ల కలయికలేని వ్యాధులన్నియూ తరుణవ్యాధులే! ఇవి ఆహార-విహార మార్పులవలన, కొద్దిపాటి ఔషధముల సేవన వలన తగ్గిపోయి, ఆరోగ్యము కలుగును. వీటిలో రెండు రకములు కలవు. అవి. 1.స్పోరడిక్,2. ఎపిడెమిక్.

**1. స్పోరడిక్ (SPORADIC)** : ఇవి కొన్ని ప్రాంతములలో ఒకేవిధమైన లక్షణములను కలిగియుండి, కొన్ని గంటలు లేదా రోజులలో రోగినిచంపుటగాని, వాటంతట వియే తగ్గుటగాని జరుగుతుంది. ఉదా: మశూచి, పొంగు, ఆటలమ్మ

**2. ఎపిడెమిక్ (EPIDEMIC)** :యుద్ధసమయములయందు; తుఫాన్‌లు, భూకంపములు, వరదలుమొదలగు ప్రకృతి వైపరీత్యములయందు కొద్ది గంట లలో లేదా రోజులలో వ్యాపించువాటిని "ఎపిడెమిక్స్" అంటారు. ఉదా: కలరా (CHOLERA)

**2. దీర్ఘవ్యాధులు :**

రోగితిరుగుతూ వున్నప్పటికీ చాలకాలము బాధించువ్యాధులను "దీర్ఘవ్యాధులు" అంటారు. వీటికి ఎంత సక్రమమైన ఔషధములను వాడినప్పటికీ తాత్కాలికముగాతగ్గి, మరలా వ్యాధి వృద్ధి చెందుతుంది. రోగులు అనేక వైద్య విధానములను ఆచరిస్తూ వైద్యులచుట్టూ ప్రదక్షిణములను చేస్తూవుంటారు. (ఈదశలో కొందరు మూఢనమ్మకములతో చేయించుకొన్న చికిత్సలకుబలై పోతారు) ఇటువంటి మొండివ్యాధులనే "దీర్ఘవ్యాధులు" అంటారు. ఉదా: బోదకాలు, బొల్లి మొదలగు చర్మవ్యాధులు, ఉబ్బసము, షుగర్ మొదలగు తరుణవ్యాధులు దీర్ఘకాల వ్యాధులుగా మారుటకు "సోరా కారణము"ని దానిని తొలగించిన ఎడల ఎటువంటి దీర్ఘవ్యాధియైనా నివారించబడును"ని హోమియో సిద్ధాంతము.



## శారీరక ఆరోగ్య పరిరక్షణ



కంటికి కనిపించని సూక్ష్మాతి సూక్ష్మమైన జీవశక్తి శరీరమంతటా వ్యాపించి, శరీరక్రియలను నిర్వర్తించును. జీవశక్తియందలి కలతయేవ్యాధి! ఆ వ్యాధిని తొలగించుటకు ఔషధశక్తిని ప్రయోగించుటకు ముందుగా ఆరోగ్య పరిరక్షణకై ప్రకృతి ధర్మములను ఆచరించవలయును. అనగా ఆహారము,నిద్ర, నీరు,గాలి, వెలుతురు, మానసిక ప్రశాంతతలు మున్నగునవి సక్రమముగా ఉన్నప్పుడు జీవశక్తి ఆరోగ్యముగా ఉండును. ముందు వాటిలోపములను క్రమ బద్ధము చేసిన తరువాత ఔషధ ప్రయోగమును చేయవలెను. మనస్సు, గాలి, నీరు, వెలుతురు వీటిని కలుషితము కాకుండ చూచుకోవలెను. అప్పుడే ఆరోగ్య పరిరక్షణను చేయగలము.

## ప్రిస్క్రిప్షన్ (Prescription) వ్రాయు పద్ధతి

రోగికి వైద్యుడు వ్రాయు 'మందుచీటి'ని ఆంగ్లములో 'ప్రిస్క్రిప్షన్" అంటారు. ఈ ప్రిస్క్రిప్షన్ వ్రాయు విధానము నందు వైద్యుడు గ్రహింపవలసి నవి ముఖ్యముగా నాలుగు భాగములు కలవు.

ఈ ప్రిస్రిప్షన్ నందుకొన్ని సాంకేతిక పదములను ఉపయోగించ వలెను. వాటిని అన్నిదేశముల యందును, అన్ని ప్రాంతముల యందును ఒకటిగానే ఉపయోగిస్తారు.

1. ప్రిస్క్రిప్షన్ మొదట "$R_x$" తో మొదలైతుంది. "$R_x$" అనగా "రెసిప్ (RECIPE)" అని అర్థము. ఇది "Take Them" అను ఆజ్ఞగా ఉంటుంది.



2. 'INSCRIPTION (అసలు బాడీ) ఇందులో ప్రధానముగా తీసికో వలసిన ఔషధములపేరులు (పూర్తి పేరులను వ్రాయనవసరము లేదు). ఔషధము యొక్క పొటెన్సీ(శక్తి), పరిమాణము=(Quantity) రకము=(Quality)లను పూర్తిగా తెలియజేయ వలెను.

3. Sign లేదా Signature ప్యాకెట్ మీదగానీ, సీసామీద గానీ మందులను వాడే పద్ధతులను తెలియ జేయుట! ఇది స్పష్టముగా రోగికి బాగా అర్థమయ్యే విధముగా ఉండాలి.

4. 'INTIAL' ఇది చివరిది. ప్రిస్క్రిప్షన్ వ్రాసిన వైద్యుని సంతకము. తేదీ యుండవలెను.

## ఆంధ్రావనిలో హోమియోపతి (చరిత్ర)

**రచన : డా॥ P.R.C.H. సూర్యప్రకాశరావు, విజయవాడ.**

**సేకరణ : డా॥ K.V.N.D. ప్రసాద్, తెనాలి.**

1838వ సంవత్సరములో పంజాబ్‌లోని మహారాజా రంజిత్ సింగ్‌కు చికిత్స చేయు నిమిత్తము జర్మనీ దేశము నందలి సుప్రసిద్ధ హోమియోపతి వైద్యుడై, డా॥ హానిమాన్ విద్యార్థియైన డా॥ 'జాన్ మార్టిన్ హోనింగ్ బర్గర్"ను మనదేశమునకు ఆహ్వానించినప్పుడే భారతదేశమునందు "హోమియోపతి వైద్యవిధానమునకు ప్రారంభ మన"వచ్చును.

డా॥ బర్గర్ కలకత్తా, నగరములో 1860వ సంవత్సరమువరకు వైద్య సేవలను చేసారు. వారి నేతృత్వములో బాబూ రాజేంద్రలాల్‌దత్, డా॥ వి.మహేంద్రలాల్ సర్కార్ మొదలగు మహామహులు ఈ విధాన వ్యాప్తికి నాందిపలికారు. 7 దశాబ్దముల క్రిందట ఆంధ్రదేశములోని కాకినాడ పట్టణ ములో శ్రీ పి.సీతారామయ్య సోదరుడు సుబ్బరాయుడు ఈ విధానములో శిక్షణా తరగతులను, వైద్యశాలను ప్రారంభించారు. వీరికి సహకరించిన వారిలో శ్రీ యనమండ్ర గణపతిరావు, శ్రీలంకా రామారావు ముఖ్యులు. వీరి అనువాద గ్రంథములే ఆంధ్రలో ఈ విధానాభివృద్ధికి నుడికారము.

క్రమముగా తెలుగునాట ప్రసిద్ధ ఆంగ్ల వైద్యులను, విద్యావేత్తలను, న్యాయ వాదులను, హోమియోపతివైద్యము ఇట్టే ఆకర్షించినది. 1930వ సంవత్సర ప్రాంతము నకే తూర్పు గోదావరిజిల్లా, పశ్చిమగోదావరిజిల్లా గుంటూరు జిల్లాల యందలి కొందరు ప్రముఖ వైద్యులచే దీని విశిష్టతా–సౌలభ్యములు బహుళ ప్రచారము కావించ బడ్డాయి. నెల్లూరు జిల్లాయందు డా॥జె.వి.రమణయ్య

మొదలగువారు హోమియోవైద్య విధానముతో అవిశ్రాంత ప్రజాసేవచేసి, విశేష కీర్తి–ప్రతిష్ఠల నార్జించినారు.

1932వ సంవత్సరములో డా॥ లంకా రామారావు అధ్యక్షులుగా **"ది ఆంధ్రా ప్రొవెన్షియల్ హోమియోపతిక్ అసోసియేషన్స్"** అను ఒకవైద్య సంస్థ కాకినాడలో రిజిష్టర్ చేయబడినది. ఇందు... వైద్యులు, అభిమానులు కూడా సభ్యులుగా ఉన్నారు. కావున "కేవలము వైద్యుల కొరకు ఒక సంఘము ఉంటే మంచిద"ని తలంచారు. విజయవాడ వాస్తవ్యులు డా॥ వావిలాల శ్రీనివాసమూర్తి 1937వ సంవత్సర ములో **"ఆంధ్రా ప్రొవెన్షియల్ హోమియోపతిక్ ప్రాక్టీషనర్స్ ఫెడరేషన్"** అను పేరిట మరొక సంస్థను స్థాపించారు. ఆంధ్రజిల్లాలన్నింటిలోను దీనికి అనుబంధ సంఘములను రూపొందించారు.

మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వ వైద్యాధికారి లెఫ్టినెంట్ కల్నల్: డా॥ కె.వి. రమణారావు, ప్రసిద్ధ వైద్యులు : డా॥ జె.ఎస్.మజుందార్ అధ్యక్షతన 1938వ సంవత్సరములో విజయవాడలోని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దుర్గా విలాస్ వనమునందు ఈ ఫెడరేషన్ ఆధ్వర్యములో ఒక సదస్సును ఏర్పాటుచేశారు. అపుడే అమెరికాలో తమ పోస్ట్‌గ్రాడ్యుయేట్‌కోర్స్ పూర్తిచేసి వచ్చిన డా॥ ఎమ్. గురురాజు గారిని ఫెడరేషన్‌కు అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. అనుబంధజిల్లా సంస్థలలో గూడ సభ్యులను, కార్యకర్తలను చేర్చుకొనుట జరిగినది. తూర్పుగోదావరిజిల్లా, శ్రీకాకుళం జిల్లా, పశ్చిమగోదావరిజిల్లా, కృష్ణాజిల్లా, గుంటూరుజిల్లా, చిత్తూరుజిల్లా, నెల్లూరుజిల్లా, అనంతపురం జిల్లాలకు ఎన్నుకొన్న సభ్యులు ఎనలేని సేవచేశారు. (స్థలాభావము వలన వారి అందరి పేరులను ఇవ్వలేక పోవుచున్నాము).

అంతకు ముందు స్థాపించిన 'అసోసియేషన్'ను 'ప్రాక్టీషనర్స్ ఫెడరేషన్' నకు కలిపి నిబంధనావళితో పటిష్టమైన ఒకే సంస్థగా రూపొందించు టతో హోమియోపతి వైద్యవిధానమునకు మన తెలుగునాట స్వర్ణయుగము ప్రారంభించబడినది. దీనని అప్పటి ముఖ్యమంత్రి చక్రవర్తుల రాజగోపాలాచారి గారు ప్రభుత్వసంస్థగా గుర్తిం చుటకు, రిజిస్ట్రేషన్‌లకు ప్రభుత్వ ఉత్తర్వులను జారీచేశారు. కానీ కొన్ని కారణముల వలన ఇది తాత్కాలికముగా నిలుపుదల చేయడమైనది.

1953వ సంవత్సరములో ప్రత్యే రాష్ట్రముగా ఏర్పడిన తరువాత జస్టిస్ సోమయ్యగారి ఆధ్వర్యములో డా॥ ఎమ్. గురురాజు, డా॥కృష్ణారావు (టి.ప్రకాశం పంతులుగారి తమ్ముని అల్లుడు) సభ్యులుగా, ఒక నివేదికను ప్రభుత్వమునకు సమర్పించుట జరిగినది. 1956వ సంవత్సరములో శ్రీకళావెంకట్రావుగారు





(ఆరోగ్య శాఖామాత్యులు) హోమియోపతికి ఏక్టనురూపొందించి, శాసనసభ ఆమోదమును పొందింపచేసి, హోమియోపతికి ఆంధ్రాలో ఉన్నత స్థానమును ఏర్పరచారు.

1940వ సంవత్సరములో డా॥ఎమ్.గురురాజుగారు "ది ఆంధ్రా ప్రొవెన్షియల్ హోమియోపతిక్ మెడికల్ కాలేజ్"ను కృష్ణాజిల్లా, గుడివాడలో స్థాపించి, తెలుగు ప్రజానీకమునకు ఎనలేని మేలును చేశారు.

1968వ సంవత్సరములో ఈ హోమియోకాలేజ్ బాధ్యతలను ప్రభుత్వము స్వీకరించి, 1970వ సంవత్సరములో రజతోత్సవమును వైభవోపేతముగా జరిపి, దాని పేరును డా॥ శ్రీగురురాజు ప్రభుత్వహోమియోపతి వైద్యకళాశాల"గా మార్చడమైనది. దక్షిణభారతావనియందున్న పెద్ద కళాశాలలలో ఇదిఒకటి! దీనికి ప్రిన్సిపల్‌గా రాష్ట్రపతికి గౌరవవైద్యుడు, అనేక సంస్థలలో సభ్యుడు, అన్నిటికంటేమించి సంస్థాపక ముఖ్యులైన గురురాజుగారి కుమారుడు డా॥ఎమ్. కుటుంబరావు నియమింపబడి, ఎనలేని సేవను చేశారు.

ఆంధ్రదేశములో ఇప్పటికినీ నిరుపమానసేవలను చేయుచున్న అనుబంధ జిల్లా సంస్థలతోపాటుగా విశాఖపట్టణము, రాజమండ్రి, కాకినాడ, విజయవాడలో రెండు సంస్థలు; మచిలీపట్టణము, చీరాల, గుంటూరు, పొన్నూరు, చెరుకుపల్లి, మొదలగు ఊరులలో ఉన్న ఇతర సంస్థలు కూడ ఆయాప్రాంతములలో హోమియోపతి విశిష్టతా సౌలభ్యమును ప్రచారము చేయుటకు విశేష కృషిని జరుపుతున్నారు.

ఆంధ్రావనిలో డా॥ వై,గణపతిరావు, డా॥ లంకారామారావు, డా॥ వేమవరపు వేంకటరమణశర్మ మొదలగువారువీరి రచనలతో ముఖ్యమైన ఆంగ్ల గ్రంథములను తెలుగులోనికి అనువాదముచేసి, తెలుగునాట హోమియో పతికి జీవమును పోసారు. ఇవియేకాక కొన్నిపత్రికలు, సంపాదకులు హోమియోపతి వైద్యవిజ్ఞానమును నలు దెసలా వెదజల్లి, అసమానమగు కృషినిచేసి, ఆంధ్రలో హోమియోపతికి ప్రాణప్రతిష్ఠను చేశారు. వీరందరూ నేటిహోమియోపతి అభిమానులకు విద్యార్థులకు నిత్య సంస్మరణీయులు. నిస్వార్థబుద్ధితో ఉచిత వైద్యశిక్షణ మరియు ఉచిత చికిత్సలను జరుపుచున్న సంస్థల నిర్వాహకులు చిరస్మరణీయులు!!

ఎ.పి.లో అనేక ఫార్మసీలు, లేబొరేటరీలు, డిస్పెన్సరీలు, స్టోర్స్ నిర్దిష్టమైన హోమియోపతి ఔషధములను అందించుటలో ప్రశంసా పాత్రమగు కృషిని జరుపుతున్నారు. 1975వ సంవత్సరము నుండి ఎటువంటి ప్రకటనా చేయ కుండా వైద్య రిజిస్ట్రేషన్‌ను ప్రభుత్వమునిలిపి వేసినప్పటికీ హోమియోపతి

అభిమానులు మాత్రము హోమియోపతి ప్రచారమునకు హానిమాన్ ఆశా జ్యోతులై, ఆయనకు ప్రతీకగా నిలుస్తు న్నారు. నిలుస్తారు. కృషితోనాస్తి దుర్భిక్షం! జై హనీమన్!!

## ఆంధ్రప్రదేశ్‌లో-హోమియోపతి మందులను తయారుచేయు ముఖ్యమైన కంపెనీలు (ఫార్మసీలు), కాలేజ్‌లు

### ఫార్మసీలు

1. గణపతి హోమియో స్టోర్స్ అండ్ లేబొరేటరి,మారుటేరు-534 123 W.G.Dt.
2. సుధా హోమియో ఫార్మసీ, రామంతపూర్, హైదరాబాద్-500 991.
3. రామకృష్ణా ఫార్మసీ, శివానంద నగర్, హైదరాబాద్-500 013.

### కాలేజీలు

1. ది హోమియోపతిక్ మెడికల్ కాలేజ్, రాజమండ్రి-533 101
2. డా॥ జయసూర్య గవర్నమెంట్ హోమియోమెడికల్ కాలేజ్, కాచిగూడ, హైదరాబాద్
3. డా॥గురురాజు గవర్నమెంట్ హోమియో కాలేజ్, గుడివాడ-521 301 కృష్ణాజిల్లా.
4. ది హోమియోపతి గవర్నమెంట్ కాలేజ్, కడప-516 007.

### మందులు విక్రయించు స్థలములు (స్టోర్స్)

హైదరాబాద్, విశాఖపట్టణం, తిరుపతి, విజయవాడ, గుంటూరు, తెనాలి, బాపట్ల, చెరుకుపల్లి మున్నగు అనేక ప్రదేశములలో గలవు. వారుమంచి మందు లను అమ్ముచూ హోమియో వైద్యమునకు ఎంతగానో సేవను చేయుచున్నారు.

### మనస్సు (MIND)

"నీ మనస్సులో నడిచే నీ భావములే నీ భవిష్యత్‌ను నిర్ణయిస్తాయి. నీ నుండి కదలే సంకల్పమే నిన్ను మహాత్మునిగానో, మహాపాపిగానో చేస్తుంది" అన్నారు పెద్దలు.

మఱ్ఱివిత్తునుండి మహావృక్షము పుట్టినట్లే మన శరీరము కూడా మనసు నుండే పుట్టినది. వృక్షమునకు ఆధారము వ్రేళ్ళు. అలాగే మానవాభివృద్ధికి ఆధారము మనసు!! పరిపక్వతను కలిగిన మనస్సు-విశ్వరహస్య శోధనా రథసార థియై అనేక వైజ్ఞానిక-ఆధ్యాత్మిక విశేషములను మేధద్వారా వెలికితీసి, సృష్టికి ప్రతిసృష్టిని చేయిస్తున్నది. కాని స్వాధీనము తప్పిన మనసు ఎన్నిఅనర్ధములను





చేయునో స్వానుభవములో మనందరికీ తెలిసినవిషయమే. ఈనాడు పరి పూర్ణమైన మనస్సు కలిగిన మేధావులు దేశమునకు చాలఅవసరము. అందుకే కనీసము 'మానసిక దౌర్భల్యమును' తొలగించు కోవాలి. విజ్ఞానశాస్త్రము మనో వికాసము రెండుమార్గములుగా విభజించినది. అవి

1. **Physialogical Needs** : గాలి, నీరు, ఆహారము, లైంగిక క్రియలు.

2. **Psychogenic Needs** : ప్రేమ, ఆత్మాభిమానము, ఆత్మవిశ్వాసము, ఇతరులచే గుర్తింపబడుట అనునవి.

ప్రతి మనిషిలోనూ ఈరెండుభాగాములూ ఉంటాయి. ఈ రెండింటిలోనూ 2వది మనసుకు సంబంధించినది. ఈ మనస్సుయొక్క సహజ స్థితిని తెలిసికోనిదే చికిత్సను చేయలేము. ఇందుకు మానవుని జీవితమును నాలుగు భాగములుగా విభజించారు.

1. బాల్యము 2. కౌమారము 3. వయోజనదశ 4. వృద్ధాప్యము ఈ నాలుగు దశలలో సహజమైన మానసిక ప్రవృత్తికి విరుద్ధముగా ఉన్నవారిని "మానసిక వ్యాధిగ్రస్తుల"నిగుర్తించాలి. వైద్యుడు ఆయాదశలను గుర్తించి, ఆదశలో మానసిక వైరుధ్యము కలిగియున్న (ఉదా॥ బాల్యములో కామవాంఛ, యౌవనములో కామ వాంఛ లేకపోవుట) లక్షణములను జాగ్రత్తగా గమనించి; ఆయా శారీరక వ్యాధులతో పాటుగా మానసిక లక్షణములను కూడా కలుపుకొని, చికిత్స చేసినచో అద్భుత విజయములను గాంచవచ్చును.

**మానసిక వ్యాధులకు ఔషధములు :** మానసిక లక్షణములను రెండు విధములుగా విభజించ వచ్చును. 1. స్వభావము 2. మానసికము.

### స్వభావ లక్షణములు మందులు

**స్వభావము మారుచుండుట :** ఆరమ్ మెట్ (Arum.Met) - 200ల పవర్‌లో వారమునకు ఒకడోస్ చొప్పున 4వారములు వాడవలెను. తగ్గనిచో బెల్లడోన (Belladonna)-200ను రోజుకు ఒక డోస్‌చొప్పున ఒకవారము రోజులపాటు వాడవలెను. అప్పటికీ మార్పురానిచో పల్సటిల్లా (Pulsatilla)-200ను రోజుకు ఒకడోస్ చొప్పున ఒక వారముపాటు వాడవలెను.

**ఆతురత స్వభావము :** ఆర్సెనికమ్ ఆల్బ్-200ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 వారములపాటు వాడవలెను. అదిపనిచేయని ఎడల రుస్ టాక్స్ (Rhus Tox)- 200ను ఒక వారముపాటువాడవలెను.

**అతిధైర్యము :** ఓపియమ్ (Opium)-200ను ప్రతిరోజు ఒకడోస్ చొప్పున ఒకవారముపాటు వాడవలెను.

**అధైర్యము :** అర్సెనికమ్ ఆల్బ్ 200ను ప్రతిరోజు ఒకడోస్ చొప్పున ఒక వారము రోజులువాడి ఆపవలెను. తగ్గనిపక్షములోన ఆరమ్ మెట్-200ను రోజుకు ఒకడోస్ చొప్పున ఒకవారముపాటు వాడవలెను.

**భయము :** ఆర్సెనికమ్‌ఖ ఆల్బ్ 200ను ఒకవారముపాటు ప్రతిరోజు ఒకడోస్ చొప్పున వాడవలెను. పై మందుకు తగ్గని పక్షములో ఎకోనైటుమ్ నేప్ (Aconitum Nap)-200ను ఒకవారముపాటు వాడవలెను.

**ఉద్రేక స్వభావము :** కెమోమిల్లా-200ను రోజుకు రెండుసారుల చొప్పున ఒక వారముపాటువాడి, తగ్గినట్లు లేని పక్షములో 1ఎమ్‌ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 వారములపాటు వాడవలెను. తరువాత (తగ్గకపోతే) నక్స్‌వామికా (Nux Vomica) ను ప్రతిరాత్రి ఒకడోస్ చొప్పున 3 రాత్రులపాటు వాడవలెను. మార్పు రాకపోతే బ్రైయోనియా-200ను ఒకవారముపాటు రోజుకు 3 సార్లు చొప్పున వాడవలెను.

**సౌమ్య స్వభావము :** పల్సటిల్లా-200ను ఒక వారముపాటు వాడవలెను. మార్పురాని పక్షములో నేట్రమ్‌మూర్-200ను ఒకవారముపాటు వాడవలెను. (రోజుకు 3 సారులు చొప్పున వాడాలి)

**సంతోష స్వభావము:** కాఫీ (Ciffea) 200ను వారమునకు ఒక డోస్ చొప్పున 3 వారములపాటు వాడవలెను. తరువాత లెకెసిస్-200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున వరుసగా 3 రోజులపాటు వాడవలెను.

**చురుకుతనము :** ప్లాటినమ్-200ను రోజుకు 3సార్లుచొప్పున ఒక వారము పాటువాడి మార్పురాని పక్షములో లైకోపోడియమ్ (Lycopodium) 200ను రోజుకు ఒకసారి చొప్పున ఒక వారముపాటు వాడవలెను.

**నిర్లక్ష్యము :** ఏసిడ్ ఫాస్-200ను రోజుకు ఒకసారి చొప్పున ఒక వారముపాటు వాడవలెను. మార్పురాని పక్షములో సెపియా 200ను ఒక వారముపాటు రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**అనుమానము :** మెడోరినమ్ (Medorrhinum) 1M ను వారమునకు ఓడోస్ చొప్పున 4వారములపాటు వాడవలెను. తరువాత తూజా (Tuja) 1M ను వారము నకు ఒకడోస్ చొప్పున 4 వారములపాటు వాడవలెను.

**విచార స్వభావము:** ఇగ్నీషియా 1M ను వారమునకు ఒకడోస్ చొప్పున నాలుగు వారములపాటు వాడవలెను. నేట్రమ్‌మూర్ 200ను ప్రతిరోజు రోజుకు 3 సార్లు చొప్పున ఒకవారముపాటు వాడవలెను.





**పట్టుదల-గర్వము :** ప్లాటినమ్-200ను ఒక వారముపాటు ప్రతిరోజు ఒకడోస్ చొప్పున వాడవలెను. కాక్యులస్-200ను కూడా ఒక వారముపాటు రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

## కోరికలు

**శృంగారమును సంబంధించి : దిగంబరుడుగా నుండుట:** హైయోశ్యామస్ 200ను ఒకవారముపాటు రోజుకు రెండు డోస్‌ల చొప్పున వాడవలెను. తగ్గని పక్షములో ఫాస్ఫరస్ (Phasphorus)-200ను ఒకడోస్ వాడవలెను.

**ప్రార్థన చేయుట :** విరాట్రమ్ ఆల్బ్ 200ను ఒక వారము పాటు రోజుకు రెండుసారులు చొప్పున వాడవలెను.

**హత్యచేయవలెనని కోరిక :** హెపార్ సల్ఫ్- 1m ను 4రోజులకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లను వాడవలెను.

**ఆత్మహత్య :** ఆరమ్ మెట్ 1m ను వారమునకు ఒక్కడోస్ చొప్పున 3 వారములపాటు వాడి; మార్పురాని పక్షములో సిఫిలినమ్ 1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 వారములపాటు వాడవలెను.

**పోట్లాడవలెనను కోరిక :** నక్స్‌వామికా-200ను రాత్రిపూట 3 రోజులపాటు వాడి,తరువాత కెమోమిల్లా-200ను రోజుకు 3 సార్లు చొప్పున ఒకవారముపాటు వాడవలెను.

**ఒంటరిగా ఉండు కోరిక :** ఇగ్నీషియా-200ను ఒకవారముపాటు రోజుకు 2సార్లు చొప్పున వాడవలెను.

**ఉమ్ములు వేయుట :** స్టానమ్-30ని ప్రతిరోజు ఒక్కడోస్ చొప్పున ఒక వారముపాటువాడి, తగ్గకపోతే 200 పవర్‌లో ఒక వారముపాటు వాడవలెను.

**ఏడ్వవలెనని కోరిక:** పల్స్ 200ను ప్రతిరోజు ఒకడోస్ చొప్పున ఒక వారము పాటు వాడవలెను. తగ్గకపోతే 1mను ఒకడోస్‌వాడి; నేట్రమ్‌మూర్ 30ని ప్రతిరోజు రోజుకు రెండుసార్లు చొప్పున ఒకవారముపాటు వాడవలెను. ఇవిగాక ఇగ్నీషియా- 200, ఆరమ్‌మెట్-200లు కూడా పనిచేయును.

## మానసిక అయిష్టత

**సమూహము-సహవాసములమీద :** ఆంబ్రగ్రీసియా-200ను ప్రతిరోజూ రోజుకు రెండుసారుల చొప్పున ఒక వారముపాటు వాడి ఆపవలెను.

**జీవితముమీద :** ఆరమ్‌మెట్-200ను వారమునకు ఒకడోస్‌చొప్పున వాడి, తగ్గనిచో ఆర్సెనికమ్-200ను వారమునకు ఒకడోస్ చొప్పున వేసినచాలును.

**నవ్వుట :** ఆంబ్రాగ్రిసియా-200ను వాడవలెను. రోజుకు ఒక డోస్‌చొప్పున ఒక వారముపాటు వాడవలెను.

**జ్ఞాపకశక్తి లేకపోవుట:** ఎనాకార్డియమ్-30ని రోజుకు ఒక డోస్ చొప్పున 4 రోజులపాటు వాడి,ఆ రోజులపాటు ఆపుతూ మార్పు కనిపించు వరకు అంటే ఒకనెలపాటు వాడవలెను. కాలీఫాస్-30ని ప్రతిరోజు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**జ్ఞాపకశక్తి తక్కువ అగుట :** లెకెసిస్-30ని వారమునకు ఒక డోస్ చొప్పున 4 వారములపాటు వాడవలెను.

**చదివినవి మరచుట :** ఏసిడ్‌ఫాస్-200ను ప్రతిరోజు రోజుకు ఒకడోస్ చొప్పున ఒకవారము పాటువాడి,ఒక వారము పాటు ఆపవలెను. ఇలా ఒకనెల రోజులపాటు వాడి ఆపవలెను.

**జరిగినవి మరచుట :** సల్ఫర్-30ని రోజుకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లు వాడి, ప్రతిరోజు ఒకడోస్ చొప్పున నేట్రమ్‌మూర్-30నివాడవలెను.

**అప్పడే మాట్లాడినవి,చదివినవి, విన్నవి కూడ మరచుట :** హెపార్‌సల్ఫ్-200ను వారమునకు ఒకడోస్ చొప్పున 4 వారములపాటు వాడవలెను.

**పేర్లు మరచుట:** లైకోపోడియమ్-200ను వారమునకు ఒకడోస్ చొప్పున 4వారములపాటు వాడవలెను. ఇలా ఒకనెలరోజుటపాటువాడి, తరువాత 1m ను నెలకు ఒకడోస్ చొప్పున 3 నెలల పాటు వాడవలెను.

**సారా త్రాగుట వలన సంధి వాగుడు:** నక్స్‌వామికా-30ని 3డోస్‌లను ఒక్క రోజులో వాడవలెను.

**బట్టలను ప్రోగు చేసికొనుట :** హైయోశ్యామస్-200ను 3 గంటలకు ఒకడోస్‌ల చొప్పున వాడవలెను.

**అరచుట, కొట్టుట, కరచుట, వస్తువులను పగుటకొట్టుట మొదలగు పనులకు :** కెమోమిల్లా-200, బెల్లడోన-200లలో ఏదో ఒకదానిని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**దాగుట లేదా ప్రక్కనుండి లేచి పోవుట :** హయోశ్యామస్-30, ఓపియమ్ -200, బెల్లడోన-30లలో మొదటిదానిని రోజుకు 3సారుల చొప్పున వాడి; తగ్గనిచో రెండవ దానిని, అంట్లే మూడవదానిని వాడవలెను.

**తీవ్రధోరణిలో గొణుగుట :** హైయోశ్యామస్-200,లెకెసిస్-200లలో ఏదో ఒక దానిని పై విధముగానే వాడవలెను.



**దడుపు వలన వచ్చిన చెడు లక్షణములు, జ్వరముమొదలగు వాటికి:** ఎకోనైట్-30ని ఒకరోజుకు 3 డోస్‌ల చొప్పున మాత్రమే ఒకరోజు వాడవలెను.

**మరణభయము :** కాఫీ-30, ఎకోనైట్-30,ఆర్సెనికమ్-30లలో ముందు ఒకటవ దానిని 3 గంటలకు 1 డోస్ చొప్పున వాడి, మార్పురాని పక్షములో రెండవ దానిని అట్లేవాడి, అప్పటికీగుణము కనిపించని ఎడల మూడవ దానిని వాడవలెను.

**దయ్యములు, భూతములు కనిపించుట, గుండె మీద కూర్చున్నట్లు ఉండుట:** బెల్లడోన-200ను వాడి, తగ్గనిచో కాల్కేరియాకార్బ్-200ను వాడవలెను.

**భర్త,భార్య,పిల్లలు ఎవరైనా చనిపోయినపుడు లేదా ప్రేమ భంగము వలన కలిగిన చెడు లక్షణములకు :** నేట్రమ్‌మూర్-200 లేదా ఇగ్నీషియా-200ను ప్రతిరోజు రోజుకు 3 సారులు చొప్పున తగ్గేవరకు వాడవలెను.

## తల (HEAD)

అన్ని అవయవములలోనూ ప్రధాన మైనదియే-శిరస్సు (తల)! ఏదో కారణముతో తలనొప్పి బాధలను చాలామంది తరచుగా అనుభవిస్తూనే ఉంటారు. ఉదాహరణకు; కొందరికి ఎండలో తిరిగినప్పుడు తలనొప్పి రావచ్చును. ఇంకొందరికి చల్లని ప్రదేశములో ఉన్నప్పుడు తలనొప్పివస్తుంది. ఇలా పరస్పర విరుద్ధమైన కారణముల వలన వచ్చే అన్నితలనొప్పుల నివారణకు లక్షణముల ననుసరించి మందులను వాడవలెను.

**వివిధ తలనొప్పులు-మందులు**

**పగటి తలనొప్పి :** నేట్రమ్‌మూర్-30ని రోజుకు 3సార్లు చొప్పున తగ్గే వరకు వాడవలెను. నొప్పి తీవ్రముగా ఉంటే బెల్లడోన-30ని ప్రతిరోజు రోజుకు 3సారుల చొప్పున తగ్గేవరకు వాడుతూ ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**ఉదయముపూట తలనొప్పి:** రుస్టాక్స్-30ని పై విధముగానే వాడవలెను.

**మధ్యాహ్నముపూటతలనొప్పి :** నేట్రమ్‌మూర్-30ని ప్రతిరోజు రోజుకు 3 సారులచొప్పున తగ్గేవరకు వాడుతూ ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**సాయంకాలము పూట తలనొప్పి :** పల్సటిల్లా-30ని 3డోస్‌లను వాడవలెను. తీవ్రముగా ఉంటే బెల్లడోన-30ని కూడా 3 డోస్‌లు వాడవలెను.

**రాత్రిపూట తలనొప్పి:** లైకోపోడియమ్-30 లేదా 200, సల్ఫర్-30 లేదా 200, బెల్లడోన 200, సైలీషియా-30లలో ఏదో ఒకదానిని రోజుకు 3సార్లు

చొప్పున వాడవలెను. (ముందు సల్ఫర్‌నువాడి, తగ్గకపోతే లైకోపోడియమ్‌ను వాడవలెను. అప్పటికినీ తగ్గకపోతే బెల్లడోన, ఆ తదుపరి సైలీషియాను వాడవలెను. (రోజుకు 3సారుల చొప్పున వాడవలెను)

**తెల్లవారుజాము తలనొప్పి:** నేట్రమ్‌మూర్-200ను రోజుకు 3సార్లువాడి, తగ్గకపోతే కాలిఐయోడ్-30ని 3సార్లువాడవలెను.

**సూర్యోదయముతోటి ప్రారంభించి, సూర్యాస్తమయముతోటి తగ్గుతలనొప్పి:** గ్లోనైన్200, నేట్రమ్‌మూర్-200 లలో ఏదోఒక దానిని తగ్గువరకు 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**ఎండలోవచ్చు తలనొప్పి:** గ్లోనైన్-200, నేట్రమ్‌మూర్-200ను ఏదోఒక దానిని తగ్గువరకు 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**చల్లగాలికి వచ్చు తలనొప్పి :** హెపార్ సల్ఫ్-200నుగానీ, ఎకోనైటుమ్ నేప్స్-200ను గాని వాడవలెను. నీటిలోన తడియుటవలన వస్తే మాత్రము రుస్టాక్స్- 200ను వాడవలెను.

**సారాయి వలన వచ్చుతలనొప్పి :** నక్స్ వామికా-30ని రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.

**వ్రాయుట వలన వచ్చు తలనొప్పి:** నేట్రమ్‌మూర్-200, రూటా-200 అను ఈరెండు మందులను రోజుకు 3సారుల చొప్పునవాడి, తగ్గకపోతే కాల్కేరియా కార్బ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**టీ త్రాగుట వలన వచ్చు తలనొప్పి:** నక్స్‌వామికా-30ని రోజుకు 3సార్లు చొప్పున 3 రోజులపాటు వాడవలెను.

**పొగత్రాగుటవలన వచ్చు తలనొప్పి:** నక్స్‌వామికా-30లేదా బెల్లడోనా-30 ని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**ఐస్‌క్రీమ్ తినుటవలనవచ్చు తలనొప్పి :** బ్రైయోనియా-30ని గంటకు ఒకడోస్ చొప్పున 3 గంటలలో మూడుడోస్‌లు వాడవలెను.

**అజీర్తి వలన వచ్చు తలనొప్పి:** నక్స్ వామికా-30ని ఒకరాత్రికి ఒకడోస్ చొప్పున 3 రాత్రులపాటువాడి, తగ్గకపోతే పల్సటిల్లా-30ని 3డోస్‌లు వాడవలెను.

**కాఫీత్రాగుటవలన వచ్చు తలనొప్పి :** నక్స్‌వామికాను పై విధముగానే వాడవలెను.

**విచారమువలన వచ్చుతలనొప్పి:** ఇగ్నీషియా-200, నేట్రమ్‌మూర్-200 వీటిని రోజుకు 3సార్లు చొప్పున వాడాలి. ఈవిధముగా 3 రోజులపాటు వాడినా



తగ్గకపోతే ఏసిడ్‌ఫాస్-200ను 6 గంటలకు ఒకడోస్ చొప్పున ఒకరోజులో మూడు డోస్‌లు వాడవలెను.

**ప్రయాణమువలన వచ్చు తలనొప్పి:** కాక్యులస్-200 లేదా కాలీఫాస్-30 ని 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

బస్‌లు, ట్రైన్‌లు, విమానములు, ఓడలు మొదలుగు ప్రయాణములు సరిపడక వచ్చుతలనొప్పి: కాక్యులస్-200, పెట్రోలియమ్-200 వీటిని 3 గంటలకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లను వాడవలెను. (ఈరెండు మందులలో ఏదో ఒకదానిని ప్రయాణమునకు ముందు వాడితే చాలమంచిది)

**నిద్రలేకపోవుటవలన వచ్చు తలనొప్పి:** నక్స్‌వామికా-30ని రాత్రిపూట ఒక డోస్‌ను వాడవలెను.

**సంభోగవాంఛ అణచుకొనుట వలన మరియు సంభోగానంతరము వచ్చు తలనొప్పి:** కాలిఫాస్-30ని ప్రతిరోజు3 డోస్‌ల చొప్పున వాడుతూ, కాల్కేరియా కార్బ్-30ని 3డోస్‌లను మాత్రమే వాడవలెను.

**బహిష్టు సమయములో వచ్చు తలనొప్పి:** నేట్రమ్‌మూర్-30, బెల్లడోనా-30, పల్స్-30, సెపియా-200లలో ఏదో ఒకమందును రోజుకు 3సార్లు చొప్పున తగ్గే వరకు వాడవలెను. (ఒకదాని తరువాత ఒకటిగా కూడ వాడవచ్చును)

**గర్భిణీస్త్రీలకు వచ్చు తలనొప్పి:** బెల్లడోన-200, కెమోమిల్లా-200లలో ఏదో ఒకదానిని వాడి; తగ్గకపోతే రెండవ దానిని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**భయము వలన వచ్చు తలనొప్పి :** ఏకోనైట్-30ని ప్రతిరోజూ 3డోస్‌ల చొప్పున తగ్గువరకు వాడవలెను.

**శారీరక శ్రమ వలన వచ్చు తలనొప్పి:** కాలీఫాస్-200ను ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున కొంతకాలము పాటువాడుతూ కాల్కేకార్డ్-30ని 3డోస్‌లను మాత్రమే వాడవలెను.

**దగ్గు-పడిసెము వలన వచ్చు తలనొప్పి:** బెల్-200, ఫెర్రమ్‌ఫాస్-30 లను పై విధముగానే వాడవలెను.

**కుడివైపు వచ్చుతలనొప్పి :** శాంగ్వినేరియా-200, సైలీషియా-200, బెల్-200 అనువాటిలో ఏదో ఒకదానిని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తగ్గకపోతే రెండవ దానిని వాడవలెను.

**ఎడమవైపున వచ్చు తలనొప్పి:** స్పైజెలియా-200, సైలీషియా-200, అను మందులను కొద్ది గంటల తేడాతో3గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**నుదురులో వచ్చుతలనొప్పి:** బ్రైయోనియా-200ను 3పూటలా 3 డోస్‌లు వాడవలెను.

**తలవెనుక వచ్చు తలనొప్పి:** కాల్కేరియాకర్బ్ 200ను 3డోస్‌లు వాడవలెను.

**కణతలమీద వచ్చు తలనొప్పి:** బెల్లడోన-200ను 3 గంటలకు ఒకడోస్ చొప్పున తగ్గువరకు వాడవలెను.

**మాడుపోటు:** కాఫీ-200 మరియు నేట్రమ్‌మూర్200 అనువాటిని ప్రతి 6 గంటలకు ఒకడోస్ చొప్పున రెండు మందులను మార్చిమార్చి వాడవలెను.

**తలనొప్పితో దృష్టి తగ్గుట లేదా అసలు లేకపోవుట :** జెల్సిమియమ్-200, నేట్రమ్‌మూర్-200లను ప్రతిరోజు3డోస్‌ల చొప్పున వాడవలెను.

**చుండ్రు :** కాలీసల్ఫ్-30, సోరినమ్-200లలో సోరినమ్‌ను రోజుకు 1డోస్ చొప్పున; కాలీసల్ఫ్‌ను ప్రతిరోజు 2డోస్‌లచొప్పున వాడవలెను.

**తలలో కురుపులు:** సోరినమ్-200ను ఒకడోస్‌వేసి, తరువాత కాల్కేరియా కార్బ్-200ను ఒకడోస్‌ను వేసిన చాలును.

**తలవెంట్రుకలు ఊడుట:** కాలీసల్ఫ్-30, నేట్రమ్‌మూర్-200లను ప్రతిరోజు వాడుచూ; కాల్కేరియా కార్బ్-200ను వారమునకు ఒకడోస్‌చొప్పున 3 వారముల పాటు వాడవలెను.

ఆర్నికా మదర్‌టించర్ 2ఔన్స్‌ను-100గ్రామ్‌ల మంచి కొబ్బరి నూనెలో కలిపి; ప్రతిరోజూ తలకు వ్రాసికోవలెను.

**వాంతితో కూడిన తలనొప్పి:** శాంగ్వినేరియా-200, నక్స్‌వామికా-30, కాక్యులస్-30లలో ఏదో ఒకదానిని వాడి, తగ్గనిపక్షములో రెండవ దానిని, తరువాత మూడవ దానిని-3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**ఉపాధ్యాయులకు, విద్యార్థులకు,ప్రొఫెసర్స్‌కు, లాయర్స్‌కు వచ్చు తలనొప్పి :** ఐరిన్ వెర్సికలర్-200ను ప్రతిరోజు 3సార్లు చొప్పున వాడవలెను.

**మూత్ర విసర్జన వలన తలనొప్పి తగ్గుట :** జెల్సిమియమ్-30ని 3డోస్‌లు వాడవలెను.

**పొగత్రాగుటవలన, వాసనల వలన వచ్చుతలనొప్పి:** ఇగ్నేషియా 200ను ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.





**తలనొప్పి ప్రారంభించినపుడు చూపుతగ్గి, నొప్పి ఎక్కువైన కొలదీ... చూపు వచ్చుట :** కాలీ బైక్రోమికమ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**స్కూల్ పిల్లలకు చదివినప్పుడు వచ్చే తలనొప్పి :** ఏసిడ్ ఫాస్-200ను ప్రతిరోజు రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

## తలత్రిప్పుట

**మెదడుకు రక్తప్రసరణ తగ్గుట వలన తలత్రిప్పుట :** కోనియమ్-200ను 3 డోస్‌లు వాడవలెను.

**ఎత్తునుండి దిగునప్పుడు తలత్రిప్పుట :** ఫెర్రమ్‌ఫాస్-200ను 3డోస్‌లు వాడవలెను.

**ముందుకు లేదా ప్రక్కలకు పడిపోవునట్లు ఉండుట :** కాస్టికమ్-200ను రోజుకు ఒక డోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను.

**గుండెవ్యాధితో తలత్రిప్పుట,మెదడుకు రక్తము అందకపోవుటచే తలత్రి ప్పుట :** డిజిటాలిస్-200ను రోజుకు 3డోస్‌లచొప్పున వాడవలెను.



## నేత్రములు (EYES)

**"సర్వేంద్రియానాం నయనం ప్రధానమ్"** అన్నారు పెద్దవారు. మన శరీర ములో అతి సున్నితమైన అణువులతోటి నిర్మితమైన నేత్రములను అత్యంత జాగ్రత్తగా కాపాడు కొనుట ఎంతైనా అవసరము. అలాగే చిన్నచిన్న నేత్రవ్యాధుల నైనాసరే అశ్రద్ధచేయక తక్షణమే చికిత్సను పొందవలెను.

## వివిధ నేత్రవ్యాధులు-ఔషధములు

**వ్రాయునపుడు కన్నీరు కారుట :** రూటా-200,కాల్కేరియాకార్బ్-200లను ప్రతిరోజు 3డోస్‌లు చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**చదువునపుడు కన్నీరు కారుట :** అమ్మోనియమ్ కార్బ్-200ను రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**తలనొప్పితో కన్నీరు కారుట :** పల్సటిల్ల-200ను రోజుకు 3డోస్‌లు చొప్పున వాడవలెను.

**రొంపతో కన్నీరు కారుట :** ఎల్లియమ్ సేపా-200ను ప్రతి 3 గంటలకు 1డోస్ చొప్పున వాడవలెను.

**నేత్రములు ఎఱ్ఱబడుట :** బెల్లడోనా-200 మరియు ఫెర్రమ్‌ఫాస్-200లను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున మందుకు మందుకు 1గంట తేడాతో రెండు మందులను వాడవలెను.

**గ్యాస్‌లైట్స్, కృత్రిమ కాంతులను చూచుట వలన నేత్రములు ఎఱ్ఱబడుట:** బెల్లడోన-200, యూఫ్రేషియా-200లను రోజుకు 3డోస్‌ల చొప్పున మార్చి మార్చి వాడవలెను.

**సూర్యుని కాంతివలన నేత్రములు ఎఱ్ఱబడుట:** ఎకోనైట్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**శస్త్ర చికిత్సకు తరువాత లేదా దెబ్బలు తగిలిన తరువాత నేత్రములుఎఱ్ఱ బడుట:** ఆర్నికా-200ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పునవాడి, తగ్గకపోతే వారము తరువాత 1m ను ఒకడోస్ వాడవలెను.

**కనురెప్పలకు పక్షవాతము :** కాస్టికమ్-1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను.

**కంటి దురదలు :** సల్ఫర్-30ని ఓ 3డోస్‌లు వాడి, నేట్రమ్‌సల్ఫ్-16X ని ప్రతిరోజు పౌడర్ లేదా టాబ్లెట్స్ రూపములో రోజుకు 3సార్లు వాడవలెను.

**కను రెప్పల మీద కొయ్య కండలు :** కోనియమ్-200, సైలీషియా-200, కాల్కేరియాఫోర్-200లను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కనురెప్పలు అంటుకొనుట :** సోరినమ్ 200ను ఓ 3డోస్‌లు వాడిన తరువాత గ్రాఫైటీస్-30ని 3డోస్‌లు వాడవలెను.

**నేత్రములనుండి రక్తము కారుట:** ఫెర్రమ్‌ఫాస్-30ని ప్రతిరోజు 3 గంటలకు 1డోస్ చొప్పున, బెల్లడోనా-200ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పున 4 రోజులపాటు వాడి; తగ్గకపోతే ఫాస్ఫరస్-200ను రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**దృష్టి లోపము :** 1.నేట్రమ్‌మూర్-30 2.కాల్కేరియాకార్బ్-200, 3. సల్ఫర్- 200లలో ముందు 1వ నంబర్ మందును ఒక వారముపాటు వాడి, తరువాత 2వ నెంబర్ మందును ఒక వారముపాటు వాడి; తదుపరి 3వ నెంబర్ మందును ఒక్క 3డోస్‌లు వాడవలెను.

## కంటి బాధలు

**చదువుటచే కంటి బాధలు :** రూటా-200ను ప్రతిరోజు రోజుకు 3డోసులు చొప్పున వాడవలెను.





**వ్రాయుటచే కంటి బాధలు :** సెలెనియమ్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కుట్టుటచే (టైలర్స్‌కు) కంటిబాధలు :** రూటా-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**గ్యాస్‌లైట్, కృత్రిమ కాంతుల వలన కంటి బాధలు :** బెల్లడోన-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తగ్గకపోతే కాల్కేకార్బ్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కన్నులు మంట :** యూఫ్రేషియా-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున 2రోజులపాటువాడి, ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 4డోస్‌ల చొప్పున వాడవలెను.

### వస్తువులను చూచుటలో భిన్న నేత్ర దృష్టులు :

**దృష్టి దూరముగా ఉన్నట్లు ఉండుట :** ప్లంబమ్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప4న వాడవలెను.

**దృష్టి తలక్రిందులుగా ఉన్నట్లు కనుపించుట:** కాలీకార్బ్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**దృష్టిఎడమ వైపు సగమే కనిపించుట :** కాల్కేరియాకార్బ్-200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**దృష్టిపై వైపు సగమే కనుపించక పోవుట :** ఆరమ్‌మెట్-200ను రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**దృష్టి క్రింది సగము వరకే కనుపించక పోవుట:** ఆరమ్‌మెట్-200ను ఒకరోజు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**దృష్టిక్రింది సగము మాత్రమే కనుపించుట (లాంగ్ సైట్):** సల్ఫర్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పునవాడి, తరువాత పెట్రోలియమ్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**దగ్గరి వస్తువులు మాత్రమే కనుపించుట (షార్ట్‌సైట్) :** సల్ఫర్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తరువాత పెట్రోలియమ్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**రేచీకటి :** లైకోపోడియమ్-200 మరియు కాలీఫాస్-200లను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**గ్లాకోమా:** సల్ఫర్-30, స్పైజీలియా-200లను ఒక్కరోజుకు 3డోస్‌ల చొప్పున వాడి తరువాత ఫాస్ఫరస్-200ను 3డోస్‌లు వాడవలెను.

**పగటి దృష్టి సరిగా కనుపించకపోవుట:** స్ట్రెమోనియమ్-200ను 3డోస్‌లు వాడి తరువాత ఫాస్ఫరస్-200లను 3 డోస్‌లు వాడవలెను.

**కండ్ల కలక:** 1.యూఫ్రేషియా-30; 2.బెల్లడోనా-30; 3.ఫెర్రమ్ ఫాస్-30; 4.నేట్రమ్‌మూర్-30 ఈ నాలుగు మందులను 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**కన్నులక్రింద ఉబ్బి, నీరు పట్టుట:** ఏపిస్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తరువాత రుస్టాక్స్-200ను 3డోస్‌లు వాడవలెను.

**సిఫిలిస్ వలన కంటిలోని ఐరిస్‌పొర కార్నియా వాపు:** ఆరమ్ మెట్-200ను 3డోస్‌లు వాడవలెను.

**కనురెప్పలకు పక్షవాతము:** కాస్టికమ్-1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను.

**కనుపాప పెద్దది యగుట:** బెల్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**ముక్కులనుండి కారు స్రావముల వలన నేత్రములకు ఒరిపిడి కలుగుట:** యుఫ్రే షియా -200ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కన్నులనుండి కారు స్రావముల వలన ఒరిపొడి కలుగుట:** యుఫ్రేషియా-200ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కనురెప్పల యందు పుండ్లు:** కాలీసల్ఫ్-30, సైలీషియా-30 వీటిని ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**పురిటిలోని శిశువుకు కండ్లకలక:** కాలీసల్ఫ్-30ని 3డోస్‌లు వాడవలెను.

**అక్షరములు కలిసిపోయినట్లుగా కనుపించుట:** నేట్రవ్‌మూర్-30ని ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కన్నీరు వేడిగా ఉండుట:** నేట్రమ్‌మూర్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కను రెప్పలు దురద, కనురెప్పల అంచుల యందు కురుపులు:** స్టాఫేసేగ్రియా-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కంటిలో-నలకపడి బాధ:** ఎకోనైట్-200ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.





**దెబ్బవలన కన్నుకుదుపు కట్టుట, కొయ్యకండలు, ఎఱ్ఱనివాపు:** ఆర్నికా 200ను 3డోస్‌లు వాడవలెను.

(ఈ గ్రంథములో వ్యాధిలక్షణములను తెలుపుతూ లక్షణమునకు 2-3 మందులను వ్రాసినాము. మందులన్నీ కూడా ముందుగా ఒకమందునువాడి, తగ్గనిచో రెండవ మందునువాడి చూడవలెను. దానికినీ తగ్గకపోతే మూడవ మందును వాడవలెను. ఈవిషయములను పాఠకులు పదేపదే గుర్తుంచుకోవాలి.)

**మోతాదులు:** హోమియోపతి మందును వయస్సును బట్టికాక వ్యాధినిబట్టి వారి జీవశక్తినిబట్టి లేదా ప్రతీకారశక్తిని బట్టి ఇవ్వవలసి వుంటుంది. సహజముగా 30వ నంబర్‌మాత్రలు (హోమియోపతిలో మాత్రల పరిమాణము-నంబర్‌ను బట్టి ఉంటుంది). పెద్దలకు రెండు మాత్రలు, పిల్లలకు మూడు మాత్రలు,పసి పిల్లలకు ఒక మాత్ర చాలును (ఇందులో... సారూప్యమైన పొటెన్సి నిచ్చుట అతిముఖ్యము.)

## చెవులు (EARS)



నేత్రముల తరువాత సున్నితమైన పొరలతోనిర్మింపబడినవి చెవులు. ఐతే దురదృష్టవశాత్తు వీటిని చాలామంది ఖాతరు చేయరు. అంతేకాక చెవులలో నానారకముల వస్తువులను దూర్చి కెలుకుతుంటారు. ఇది చాలా అనర్ధదాయకము. చెవికి సంబంధించిన వ్యాధులను అశ్రద్ధ చేయకుండా చికిత్సను వెంటనే చేయించు కోవలెను.

## చెవివ్యాధులు-మందులు

**చెవిపోటు:**

**కుడివైపు చెవిపోటు:** బెల్-200ను గంటకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను.తగ్గనిచో కెమోమిల్లా-200ను గంటకు ఓ 3డోస్‌లచొప్పున వాడవలెను.

ఎడమవైపు చెవిపోటు : కమోమిల్లా-200ను పైవిధముగానే వాడవలెను.

జలుబుతో చెవిపోటు : పల్సటిల్లా-200ను పై విధముగానే వాడవలెను

**పంటి సలుపుతో చెవిపోటు:** ప్లాంటాగో-200ను పైవిధముగా వాడవలెను.

గుటక వేయుటవలన చెవిపోటు : ఎలోస్-200, సైలీషియా-200లలో ఏదో ఒక మందును రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**చీముకారుట :**

కుడిచెవినుండి చీముకారుట : సైలీషియా–200, కాల్కేసల్ఫ్–200 లలో మొదటిమందును రోజుకు 3సార్లువాడి, తగ్గనిచో రెండవ దానిని వాడవలెను. ఒక్క వారము తరువాత 1m రెండు మందులను ఒక్కడోస్ చొప్పున వాడవలెను.

**ఎడమ చెవినుండిచీము కారుట:** సోరినమ్ 1m ను ఒక్కడోస్‌వాడి, తరువాత కాల్కేసల్ఫ్–200, సైలీషియా–200లను పైవిధముగానే వాడ వలెను.

రక్తజీరతో చీము కారుట: మెర్క్‌కర్–200ను పై విధముగానే వాడ వలెను.

**దుర్వాసనతో చీము కారుట :** మెర్క్‌సోల్–200ను 3డోస్‌లు వాడి, తరువాత సల్ఫర్–200ను, సోరినమ్–1m ను ఒకడోస్ చొప్పున వాడవలెను.

**చెవులలో రక్తస్రావము :** బెల్–200ను ప్రతిరోజు రోజుకు డోస్‌ల చొప్పున 4 రోజులపాటు వాడి, తరువాత ఫాస్ఫరస్–200ను ఒక్కడోస్ చొప్పున వాడవలెను.

**చెవుడు :** పై ద్రావకములలో ఏదో ఒకదానిని 1/2 ఔన్స్ నీటిలో 10 బొట్లు లను కలిపి వాడవలెను. ఆగ్రఫిస్ న్యూటాన్–Q, కాలీమూర్–30 వీటిని ప్రతిరోజు రోజుకు 3సార్లు చొప్పున రెండు మందులనూ వాడవలెను.

**జలుబు వలన చెవుడు :** కాల్కే కార్బ్–30, తరువాత పల్స్–30లను పై విధముగానే వాడవలెను.

**మసూచి-పొంగు తరువాత చెవుడు:** మెర్క్యురియస్–200లను ప్రతిరోజు రోజుకు 3సారుల చొప్పున 3డోస్‌లు

**చర్మ వ్యాధులను అణచుట వలన చెవుడు :** కాస్టికమ్–1m ఒక్కడోస్‌ను పై విధముగానే వాడవలెను.

**నీటిలో నానుట వలన చెవుడు :** రుస్టాక్–200, కాల్కేకార్బ్–200లను పై విధముగానే వాడవలెను.

**దిబ్బడ వేయుట వలన చెవుడు :** పల్స్–30ని ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, ఆతరువాత నేట్రమ్‌సల్ఫ్–30, సల్ఫర్–200లను ప్రతిరోజు రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.



**చెవులలో దురద :** సల్ఫర్–30ని 3 డోస్‌లు వాడవలెను.

**చెవి వెనుక కురుపులు, మంత్రపు కురుపులు :** ఏసిడ్ నైట్రిక్–200ను 3డోస్‌లు వాడవలెను. సైలీషియా–200ను ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున వాడవలెను.

## ముక్కు (NOSE)

నాసికయొక్క ఉపయోగమును గురించి ఎంత చెప్పినా తక్కువగానే వుంటుంది. మనలో చాలామంది జలుబు, పడిసెమువంటి బాధలను అనుభవించే ఉంటారు. వర్ణనాతీతమైన ఆ చికాకులను ఏమని చెప్పాలి? కాని ఆ బాధల నివారణకు చక్కని మందులు హోమియోపతిలో అనేకము లున్నవి.

## ముక్కు వ్యాధులు-మందులు

**జలుబు:** వేసవిలో కలుగు జలుబులకు నేట్రమ్‌మూర్–30 పవర్ లోనూ; వర్షా కాలము, శీతాకాలము జలుబుకు నేట్రమ్ సల్ఫ్–30 పవర్ లోనూ; రోజుకు 3 లేదా 4 సారులు వాడవలెను.

**చలిగాలి వలన జలుబు వచ్చిన :** ఎకోనైట్–30ని పై విధముగానే వాడవలెను.

**చలిగాలి తగిలిన తరువాత నిదానముగా జలుబు వచ్చిన :** హెపార్ సల్ఫ్–30, స్పాంజియా–30లని రోజుకు 3–4 సార్లు చొప్పున వాడవలెను. జలుబుతో పాటుగా జ్వరము ఉన్నచో; లైకో–30ని 3 డోస్‌లు వేసి, ఫెర్రమ్ పాస్–30ని గంటకు ఒకడోస్ చొప్పున వాడితే బాగుగా పనిచేయును.

**ముక్కులు దురద :** సల్ఫర్–30,సినా–200లలో మొదటి దానిని ఒకరోజు 3 డోస్‌లువాడి; తగ్గనిచో రెండవ దానిని 3డోస్‌లు వాడవలెను.

**ముక్కులు జీటలు తీయుట:** గ్రాఫైటీస్–30ని రోజుకు 3–4 సారుల చొప్పున వాడవలెను.

**ముక్కులనుండి రక్త స్రావము :** ఫెర్రమ్‌పాస్–30, బెల్లాడోనా–30 వీటిలో ఏదో ఒకదానిని దినమునకు 3–4డోస్‌లచొప్పున వాడవచ్చును. తరువాత మిల్లిఫోలియమ్ –Q ను 1/2 ఔన్స్‌నీటిలో ఒకసారికి 10 బొట్లు చొప్పునవేసి వాడవలెను.

**ముక్కురంధ్రముల యందు పొక్కులు కట్టుట :** కాల్కేసల్ఫ్-200, హెపార్‌సల్ఫ్- 200 వీటిని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**ముక్కులు దిబ్బడ వేయుట :** కాలీఐయోడ్-30, కెమోమిల్లా-30లను పై విధముగానే వాడవలెను.

**ఒకసారి ఒక నాసికా రంధ్రము, మరొకసారి రెండవ నాసికా రంధ్రము ఇలా మార్చి మార్చి ముక్కు దిబ్బడ వేయుట:** అమోనియమ్ కార్బ్-30 పవర్‌లో రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**నాసా రంధ్రములు వాసన వేయుట:** సల్ఫర్-30ని 3డోస్‌లు వాడి తరువాత సోరినమ్-200ని 3డోస్‌లు వాడవలెను.

## తుమ్ములు

**జలుబు:** నేట్రమ్‌సల్ఫ్-30, ఎల్లియమ్ సెపా-30 వీటిలో మందును రోజుకు 3-4సారులు వాడి, తగ్గనిచో రెండవ మందును మొదటి దానివలెనే వాడవలెను.

**ఎలర్జీ వలన తుమ్ములు :** సల్ఫర్-30, హెపార్‌సల్ఫ్-30, మెర్క్‌సోల్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**వాసనలు తెలియక పోవుట:** నేట్రమ్‌మూర్-30, కాల్కేరియా కార్బ్-200, పల్సటిల్లా-200 వీటిని పై విధముగానే వాడవలెను.

**ఒరిపిడి కలిగించు స్రావముతో తుమ్ములు :** మెర్క్‌సోల్-30, యూఫ్రేషియా-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**చిక్కని స్రావముతో తుమ్ములు :** పల్స్-30ని తగ్గేంతవరకు దినమునకు 3 లేదా 4 డోస్‌ల చొప్పున వాడవలెను.

**తడుచుటవలన జలుబు :** రుస్టాక్స్-30ని పై విధముగానే వాడవలెను.

**గొంతు బొంగురుతో జలుబు :** కాలీకార్బ్- 30ని పై విధముగానే వాడవలెను.

ముక్కునందు పుండ్లు : కాల్కేసల్ఫ్-30ని పై విధముగానే వాడవలెను.

ఐస్‌క్రీమ్ తినుటవలన తుమ్ములు : బ్రై-30ని పై విధముగానే వాడవలెను.

వర్షాకాలమునందు-జలుబు, జ్వరము,దగ్గులు : దల్కమారా-200ను పై విధముగానే వాడవలెను.





## నోరు (MOUTH) వ్యాధులు-మందులు

**"సమస్త వ్యాధులకు సింహద్వారము వంటిది నోరు"** అంటే నోటి ద్వారానే చాలావ్యాధులు వస్తాయి. నోటిని పరిశుభ్రముగా ఉంచుకొంటే దరిదాపు చాలా వ్యాధులను అరికట్టవచ్చును.

**నోటిలో నీరు ఊరు చుండుట:** ఏసిడ్ మూర్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**నోటినుండి రక్తస్రావము :** ఫెర్రమ్‌ఫాస్-30ని గంటకు ఒకడోస్ చొప్పున వాడవలెను. అలాగే జిరానియమ్ మెక్కులేటుమ్-Q ను 1/2 ఔన్స్ నీటిలో 10 బొట్లు చొప్పునవేసి గంటకు ఒకసారి వాడవలెను.

**నోరు ఎఱ్ఱబడుట :** ఫెర్రమ్‌ఫాస్-30, మెర్క్‌సోల్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**నోరు ఆర్చుకు పోవుట:** నేట్రమ్‌మూర్-30, బ్రైయోనియా-30, ఆర్సెనికమ్ ఆల్బ్-30 వీటిలో ఏదో ఒకదానిని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను. తగ్గకపోతే మిగతా మందులను అదే విధముగా వాడవలెను.

**నోటినుండి దుర్వాసన:** కాలీఫాస్-30, ఏసిడ్ నైట్రికమ్-200, నక్స్‌వామికా- 30 వీటిని పైవిధముగానే వాడవలెను.

**నోటిలోన పుండు (పూత), నోటి మూలలు పగిలినట్లు ఉండుట:** కాల్కేరియా ఫ్లోర్-30, తరువాత ఏసిడ్ నైట్రిక్-30ని పైవిధముగానే వాడవలెను.

**నోటిలోపల పుండ్లుపడుట:** మెర్క్‌సోల్-30ని పైవిధముగానేవాడవలెను.

**నోరంతా పుండుగా మారుట:** బోరాక్స్-30ని రోజుకు 3-4 డోస్‌ల చొప్పున తగ్గువరకు వాడవలెను.

**నత్తి :** స్ట్రామోనియమ్-200, కెన్నబిస్‌ఇండికా-30లలో మొదటి మందును రోజుకు 3డోస్‌లచొప్పున వాడినా తగ్గనిచో రెండవ మందును మొదటి మందు వలెనే వాడవలెను.

**కంఠధ్వనికి సంబంధించిన అవయవములకు పక్షవాతము :** కాస్టికమ్-200ను 3డోస్‌లు వాడి, వారము తరువాత 1m లో 1డోస్‌ను వేయవలెను. ఆ తదుపరి మెర్క్‌సోల్-200ను వారమునకు 1డోస్ చొప్పున వేయవలెను. రెండు మందులను మార్చిమార్చి వాడవలెను. ఈ విధముగా 3 వారముల పాటు వాడితే చాలును.

**నోటికి గాంగ్రేన్ :** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని తగ్గేంతవరకు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను. ఎఖినేషియాను కూడ ప్రతిరోజు 3సార్లు వాడవలెను.



**గాయకులకు, ఉపన్యాసకులకు, టీచర్స్‌కు లాయర్స్‌కు, బిగ్గరగా (అధికముగా) మాట్లాడుట వలన వచ్చు గొంతు బొంగురు :** కోకా-200ను వాడవలెను.

**నీటితో తడియుట వలన వచ్చిన గొంతు బొంగురు :** రుస్టాక్స్-30ని పై విధముగానే వాడవలెను.

**టాన్సిల్స్ కరగుటకు :** ఫైటోలక్కా-Q ని-లేదా 30ని-గానీ, బెరిటాకార్బ్ 30ని గానీ రోజుకు 3-4 సారుల చొప్పున వాడితే ఆపరేషన్ అవసరము ఉండదు.

**నోరు ఉబ్బిన, వాచిన, నొప్పి, వాపు, ఎరుపుఉన్న; జ్వరము ఉన్న:** బెల్-200 లేదా ఫెర్రమ్‌ఫాస్-30ని రోజుకు 3 సార్లు చొప్పున వాడవలెను. బాధతగ్గిన తరువాత కరగుటకు పై మందులనే వాడవలెను.

## ముఖ (FACE) లోపములు-నివారణ

**ముఖమునకు పక్షవాతము :** కాలీఫాస్-30, మెగ్నీషియాఫాస్-30 వీటిని ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను. కాస్టికమ్ 1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లు వాడవలెను.

**అంకిళ్ళు దగ్గరకు వచ్చుట :** సిక్యుటా విరోసా-200, హైపెరికమ్-200 వీటిలో ఏదో ఒకదానిని రోజుకు 3డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచో రెండవ దానిని వాడవలెను.

**కుడి ప్రక్క ముఖమునకు పక్ష వాతము :** కాస్టికమ్-200ను రోజుకు 3-4 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**ఎడమ ప్రక్క ముఖమునకు పక్షవాతము :** రుస్టాక్స్-200ను పైవిధముగానే వాడవలెను.

**నాలుకకు పక్షవాతము :** జెల్సిమియమ్-200ను పై విధముగానే వాడవలెను.

**ముఖము నిండా తెల్లని కుసుమ లేదా బాధ గల మొటిమలు :** కాల్కేరియా కార్బ్-200 ను 3డోస్‌లు వాడి, బెర్బరిస్ యాక్విఫోలియా-Q ని ప్రతిరోజు ఉదయము 10 బొట్లు, సాయంత్రము 10 బొట్లు చొప్పున ఔన్స్ నీటిలో



కలిపి వాడుకోవాలి. ఇదే టించర్‌ను పైపూతకు కూడా వాడితే మొటిమలు మాయ మగును.

## నాలుక (TONGUE) రుచి-బాధ మందులు

**నాలుక-బీటలు తీయుట:** గ్రాఫైటీస్-30నిగాని, ఏసిడ్ నైట్రిక్-30ని గాని ఒకరోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు ప్రతిరోజూ వాడవలెను. కాల్కేరియాఫ్లోర్- 6×ని పౌడర్‌గాగాని టాబ్లెట్స్‌గాగాని 3-4 సార్లు వాడవలెను.

**నాలుకమీద పొక్కులు:** మెర్క్‌సోల్-30, ఏసిడ్‌నైట్రికమ్-30 వీటిని రోజుకు 3డోస్‌ల చొప్పున మార్చిమార్చి వాడవలెను.

**నాలుకమీద నీటి పొక్కులు :** నేట్రమ్‌మూర్-30, రుస్టాక్స్-30 వీటిని పై విధము గానే వాడవలెను.

**నాలుక తిమ్మిరి లేదా మొద్దుబారుట:** మెగ్నీషియా ఫాస్-6×,కాలిఫాస్-6× వీటిని ప్రతిరోజు రోజుకు 3-4 సారుల చొప్పున వాడవలెను.



**నిద్రలో నాలుకను కొరకు కొనుట :** ఏసిడ్‌ఫాస్-30, సిక్యుటావిరోసా-30 వీటిని పైవిధముగానే వాడవలెను.

### నాలుక రుచి భేదములు

**నీరుమాత్రమే చేదుగా నుండుట:** ఎకోనైట్-30ని పై విధముగానే వాడవలెను.

**ఏపదార్థమైనా సరే చేదుగా నుండుట:** చైనా-30ని పైవిధముగానే వాడవలెను.

**నోటి దుర్వాసనతో నాలుకకు ఏరుచీ తెలియక పోవుట:** సల్ఫర్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**చేదురుచి :** నేట్రమ్‌సల్ఫ్-30, నక్స్‌వామికా-30లలో ఒకదానిని రోజుకు 3డోస్‌లు వాడి, తగ్గనిచో రెండవ దానిని వాడవలెను.

**తీయని పదార్థములు చేదుగా నుండుట :** శాంగ్విన్వేరియా-30ని రోజుకు 3-4 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**పుల్లని రుచి :** నక్స్-30, కాల్కేరియా కార్బ్-30లలోఒకదానిని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడి, తగ్గనిచో రెండవ దానిని మొదటి దానివలెనే వాడవలెను.

**నాలుకకు రుచితెలియకపోవుట:** నేట్రమ్మూర్30, పల్సటిల్లా-30 వీటిని పైవిధముగానే వాడవలెను.

**నాలుక-తియ్యగా నుండుట:** కుప్రమ్ మెట్-30, మెర్క్ సోల్-30 ఈ మందులను పై విధముగానే వాడవలెను.

## దంతముల చి(ఇ)గుళ్ళు (GUMS)

**ఇగుళ్ళనుండి రక్తము స్రవించుట:** కాల్కేరియా ఫ్లోర్-6×లేదా 30 పవర్‌ను రోజుకు 3 డోస్‌లచొప్పున వాడి, తగ్గనిచో ఫాస్ఫరస్-30ని ఒక్కడోస్ వేస్తే చాలును. నేట్రమ్మూర్-6×, కాల్కేరియా ఫ్లోర్-6×ఈ మందులు రెండింటినీ కలిపి ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**దంతములను పీకిన తరువాత చిగుళ్ళకు బాధ:** స్టాఫిసేగ్రియా-30ని ప్రతి 3 గంటలకొకడోస్ చొప్పున వాడవలెను.

**చిగుళ్ళకు పట్టులేకపోవుట:** కాల్కేరియాఫ్లోర్-6×ను రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తగ్గనిచో మెర్క్యూరియస్ ఐయాడ్-30ని తగ్గేవరకు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**చిగుళ్ళకు పుండ్లు పడుట లేదా చిగుళ్ళనుండి చీము కారుట (పయోరియా):** సైలీషియా-200, మెర్క్‌సోల్-200, కాల్కేరియా సల్ఫ్-200 వీటిలోమొదటి మందును రోజుకు 3-4 డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచో వరుస క్రమములో తరువాతి మందులను మొదటి మందులనే వాడవలెను.

## దంత (TOOTH) బాధలు - మందులు

**పంటిసలుపు:** క్రియోసోటమ్-30, ప్లాంటాగో-30లలో ఒకదానిని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తగ్గనిచో రెండవ దానిని వాడవలెను.

**పండ్లు డొల్లలు పడుటవలన వచ్చుబాధ:** మెర్క్యురియస్-30, క్రియోసోటమ్ 30, స్టాఫిసేగ్రియా-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**దంతములను పీకుటకు ముందు, పీకిన తరువాత:** ఆర్నికా-30 లేదా 200ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**చల్లనిగాలి వలన దంతములకు బాధ:** ఎకోనైట్-30ని రోజుకు 3సార్లు వాడవలెను.



**బహిష్టు సమయములో దంతములకు బాధ :** స్టాఫిసేగ్రియాను-పై విధముగానే వాడవలెను.

**గర్భిణీ స్త్రీలకు దంతముల బాధలు:** మెర్క్‌సోల్-200ను పై విధముగానే వాడవలెను.

**టీ వలన దంతములకు బాధలు:** సెలీనియమ్-30ని పైవిధముగానే వాడవలెను.

**కాఫీ వలన దంతములకు బాధ:** కెమోమిల్లా-30ని పై విధముగానే వాడవలెను.

**వెచ్చని ఆహారము తినుటవలన దంతములకు బాధ :** కాలీకార్బ్-30,కాఫీ 30లలో మొదటిమందును రోజుకు3డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచో రెండో దానిని వాడవలెను.

**వెచ్చని పానీయముల వలన దంతములకు బాధ :** కెమోమిల్లా-200, మెర్క్ సోల్-200 వీటిని పై విధముగానే వాడవలెను.

**చన్నీటి వలన దంతములకు బాధ :** కాఫీ-30, ఫెర్రమ్‌ఫాస్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**దంతములు-పుచ్చుట, డొల్లగా యగుట:** మెర్క్‌సోల్-200ను రోజుకు 3లేదా 4 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**పండ్లు కదలుట వలన బాధ :** కాల్కేరియా ఫ్లోర్-6×ను ప్రతిరోజు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**జ్ఞానదంతము వచ్చుటవలన బాధ :** మెగ్నీషియా కార్బ్-30, కాల్కేరియా కార్బ్ 30లలో మొదటి దానిని రోజుకు 3డోస్‌లు వాడి,తగ్గనిచో రెండవ దానిని వాడవలెను.

## కంఠము లేదా గొంతుక (THROAT or NECK) వ్యాధులు-మందులు

కంఠము నుండి రక్తము స్రవించుట: ఆర్నికా-200, బెల్లడోన-30, ఇంకా ఫెర్రమ్‌ఫాస్-30 ఈ మందులను ఒకదాని తరువాత ఒకటిగా ప్రతి 3 గంటలకు 1డోస్ చొప్పున వాడి,తగ్గనిచో మిల్లిఫోలియమ్-Q ను-అర ఔన్స్ నీటిలో 10బొట్లు చొప్పున కలిపి వాడవలెను.

**తరచూ గొంతు సవరించు కొనుట (సకిలించుట):** ఏంగ్రిషియా-30, కాస్టికమ్- 30లలో ముందుగా ఏదో ఒకదానిని 3 డోస్‌లువాడి, తరువాత రెండవ దానిని 3 డోస్‌లు వాడవలెను.

**గొంతు ఆర్చుకు పోవుట:** నేట్రమ్‌మూర్ 30ని రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**అర్ధరాత్రికి గొంతుఆర్చుకు పోవుట:** కాలీ బై క్రోమికమ్-30ని పై విధము గానే వాడవలెను.

**దాహము లేకుండా గొంతు ఆర్చుకు పోవుట:** ఏపిస్-30ని ఒక రోజులో 5 సారులు మాత్రమే వాడి, తగ్గనిచో పల్స్-30ని ఏపిస్ వలెనే వాడవలెను.

## గవద బిళ్ళలు

**గవదబిళ్ళల నుండి రక్తస్రావము:** ఫాస్ఫరస్-200ను 3డోస్‌లు వాడవలెను.

**గవదబిళ్ళలమీద పూత :** మెర్క్‌సోల్-200ను 3డోస్‌లు వాడవలెను.

**గవదబిళ్ళలు వాచుటలేదా పెద్దవి అగుట:** బెరిటాకార్బ్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచో అదేవిధముగా ఫైటోలక్క-30ని, కాల్కే కార్బ్-30 ని వాడవలెను.

**గవదబిళ్ళలు వాచి, ఎఱ్ఱబడి, వెచ్చగాను, బాధగాను ఉండుట:** బెల్-30, ఫెర్రమ్ ఫాస్-30లలో ఏదో ఒకదానిని రోజుకు 3డోస్‌ల చొప్పునవాడి తగ్గనిచో రెండవ దానిని వాడవలెను.

**గవదబిళ్ళలకు చీముపట్టుట:** హెపార్ సల్ఫ్-30, సైలీషియా-200, మెర్క్యురియస్-200 వీటిని పై విధముగానే వాడవలెను.

**గవద బిళ్ళలకు పుండ్లు పడుట :** నేట్రమ్‌మూర్-30, కాల్కేరియా ఫ్లోర్-30, ఎమోనియమ్ కాస్టికమ్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**గవద బిళ్ళలు గాంగ్రేన్ (కుళ్ళుట) :** ఆర్శెనికమ్ ఆల్బ్-200ను 3డోస్‌లు వాడి, తరువాత లెకెసిస్-200ను 3డోస్‌లు వాడవలెను.

**మెడకు-పక్షవాతము వచ్చుట:** కాస్టికమ్-200ను రోజుకు 3డోస్‌ల చొప్పున ఒకవారము పాటువాడి, తగ్గకపోతే జెల్సిమియమ్-200ను కాస్టికమ్‌వలెనే వాడవలెను.





**మెడ-కొయ్య బారుట:** బ్రైయోనియా-200ను రోజుకు 2డోస్‌ల చొప్పున తగ్గేంతవరకు వాడవలెను.

## జీర్ణ కోశము (STOMACH) వ్యాధియందు

**ఆకలి మందగించుట :** పిక్రిక్ ఏసిడ్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడి, తగ్గనిచో కోలోసింథిస్-30ని వాడవలెను.

**ఆకలి అధికమగుట :** నేట్రమ్‌మూర్ 30ని వాడి, తగ్గనిచో కాల్కేరియా కార్బ్-30, పల్సటిల్లా-30, కాలీఫాస్-30 ఈ మందులను ఒకదాని తరువాత ఒకటిగా పైవిధముగానే వాడవలెను.

## కొన్ని పదార్థములను - సహించకపోవుట

**పుల్లని పదార్థములు :** సల్ఫర్-30ని 3డోస్‌లు వాడవలెను.

**వెన్నలేదా నెయ్యి :** పల్స్-30ని పై విధముగానే వాడవలెను.

**చేపలు :** కొల్చికమ్-30ని పై విధముగానే వాడవలెను.

**గ్రుడ్లు:** కాలీసల్ఫ్-30ని పై విధముగానే వాడవలెను.

**కాఫీ :** నక్స్-30, నేట్రమ్ కార్బ్-30 వీటిని మార్చిమార్చి పై విధముగా వాడవలెను.

**పాలు:** నేట్రమ్ కార్బ్-30 తరువాత నేట్రమ్ సల్ఫ్-30 తరువాత పల్స్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**మాంసము :** నక్స్-30, తరువాత కాల్కేరియాకార్బ్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**ఏ ఆహారము సహించకపోవుట:** ఆర్శెనికమ్ ఆల్బ్-30, ఇపికాక్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**వైన్,బ్రాంది :** ఇగ్నీషియా-30, తరువాత నక్స్-30 వీటిని పైవిధము గానే వాడవలెను.

**కాయగూరలు:** మెగ్నీషియమ్ కార్బ్-30ని ఓరోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

## కొన్ని పదార్థముల యందే అమిత ఇష్టము కలుగుట

**ఆల్కోహాల్ :** అర్సెనికమ్ ఆల్బ్ 30ని రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**సుద్ద, పలకముక్కలు, పుల్లలు, మన్ను, పెన్సిల్స్,సున్నము తినుటయందు ఇష్టము :** కాల్కేరియా కార్బ్ 200ను రోజుకు 3-4 డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచో అల్యూమినా 30ని వాడవలెను.

**బియ్యమునుతినుకోరిక:** అల్యూమినా-200ను పైవిధముగానే వాడవలెను.

**బూడిదను తినుట యందు కోరిక :** టారన్ట్యులా-200ను పైవిధముగానే వాడవలెను.

**గుడ్డ పీలికలు :** అల్యూమినా-200ను పై విధముగానే వాడవలెను.

**గుడ్లు :** కాల్కేరియా కార్బ్-200ను ఒకరోజులో 3డోస్‌లు వాడి, తగ్గనిచో నేట్రమ్‌ఫాస్-30 లేదా 200ను వాడవలెను.

**పాలు :** బ్రై-30ని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**చల్లనిపాలు :** ఫాస్పరస్-200ను 3డోస్‌లు వాడవలెను.

**తీపివస్తువులు :** సల్ఫర్-200ను 3డోస్‌లు వాడవలెను.

**టీ:** కాల్కేసల్ఫ్-200ను పై విధముగానే వాడవలెను.

**కాఫీ :** ఆరమ్ మోటాలికమ్-200ను పై విధముగానే వాడవలెను.

**పుల్లని వస్తువులు :** విరాట్రుమ్ ఆల్బ్-200ను పై విధముగానే వాడవలెను.

త్రేపులు

**రాత్రిపూట వచ్చు త్రేపులు :** కార్బోవేజ్-30లేదా 200లలో రోజుకు 3-4 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**ఎక్కిళ్ళు, త్రేపులు కలిసి వస్తుంటే :** లైకోపోడియమ్-200ను పై విధముగానే వాడవలెను.

**భోజనము తరువాత త్రేపులు:** కార్బోవేజ్-30 లేదా 200ను ఒకరోజులో 3డోస్‌లువాడి, తగ్గనిచో పల్స్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.





**పానీయములు త్రాగిన పిదప త్రేపులు :** కాలీకార్బ్-30ని 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**చేదుత్రేపులు :** నేట్రమ్‌సల్ఫ్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**వగరు త్రేపులు :** ఏసిడ్ ఫ్లోరిక్-30 లేదా 200ను, పై విధముగానే వాడవలెను.

**తినిన ఆహార రుచితో వచ్చు త్రేపులు :** బ్రైయోనియా-30ని పై విధముగానే వాడవలెను.

**దుర్వాసనతో త్రేపులు :** సోరినమ్-200ను పై విధముగానే వాడవలెను.

**పుల్లని రుచితో త్రేపులు :** నేట్రమ్ ఫాస్-30ని ఒకరోజులో 3సార్లు వాడి,తగ్గనిచో నక్స్-30 లేదా 200ను వాడవలెను.

**ఉప్పని రుచితో త్రేపులు :** ప్లంబమ్ మెట్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**తియ్యని రుచితో త్రేపులు :** ప్లంబమ్‌మెట్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**త్రేపినపుడు... ఆహారము-నోటిలోనికి వచ్చుట:** ఫెర్రమ్‌ఫాస్-30 లేదా 200ను ఒకరోజు 3సారులు వాడి, తగ్గనిచో నేట్రమ్ కార్బ్-30 లేదా 200ను వాడవలెను.

**ఎక్కిళ్ళు :** జిన్సెంగ్-200ను ఒకరోజు 3సార్లు వాడి, తగ్గనిచో మెగ్నీషియమ్ ఫాస్-200ను వాడవలెను. (వేడినీటితో వాడవలెను)

**భోజనాంతరము ఎక్కిళ్ళు:** నక్స్-30ని ఒకరోజు 3 సారులు వాడవలెను.

**అజీర్తివలన ఎక్కిళ్ళు :** నక్స్-30ని ఒకరోజులో 3డోస్‌లువాడి, తగ్గనిచో పల్స్- 30ని వాడవలెను.

**కాఫీ త్రాగుటవలన ఎక్కిళ్ళు :** కెమోమిల్లా-30 లేదా 200ను తగ్గేవరకు రోజుకు 3 డోస్‌లు చొప్పున వాడవలెను.

**మందులను అత్యధికముగా వాడుట వలన ఎక్కిళ్ళు :** నక్స్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**ఉల్లిపాయలు, మాంసము, పాలు వీటిని స్వీకరించిన తరువాత ఎక్కిళ్ళు :** పల్స్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పునవాడి, తగ్గనిచోఫెర్రమ్‌ఫాస్-30నిగానీ, ఏసిడ్ నైట్రిక్-30నిగానీ వాడవలెను.

**మానసిక పరిశ్రమల తరువాత ఎక్కిళ్ళు :** ఆర్నికా-30 లేదా 200, నక్స్-30 లేదా 200ను ఒకరోజులో 3 డోస్‌లు మొదటిదానిని వాడి తగ్గనిచో రెండవదానిని వాడవలెను.

**అతిదాహము వలన ఎక్కిళ్ళు :** నేట్రమ్‌మూర్-30 లేదా 200ను రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**తలనొప్పితో ఎక్కిళ్ళు :** నేట్రమ్‌మూర్-30లేదా 200ను రోజుకు 3డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**దాహములేకపోవుటవలన ఎక్కిళ్ళు :** ఏపిస్-30ని ఒకరోజు 3 సార్లువాడి, తగ్గనిచో పల్స్-30ని వాడవలెను.

**జీర్ణకోశములో పుండ్లు :** అర్జెంటిమ్ నైట్రికమ్-30, హైడ్రాస్టినమ్-30 వీటిని పై విధముగానే వాడవలెను.

**వమనములు (వాంతులు):** అర్సెనికమ్ ఆల్బ్-30 లేదా 200, ఇపికాక్-30 లేదా 200లనువాడి, తగ్గకపోతే ఫెర్రమ్‌ఫాస్-30, నేట్రమ్ ఫాస్-30లను పై విధము గానే వాడవలెను.

**ఉదర కుహరము-వాయు పూరితము అగుట(పొట్ట ఉబ్బుట):** ఉత్తేజ పదార్థములు, ఆల్కాహాల్, వాడు వారికి నక్స్-30ని 3డోస్‌లు వాడవలెను.

**బీరు త్రాగువారికి కలుగు అజీర్తి, గ్యాస్ ట్రబుల్ :** కాలీబైక్రోమికమ్-30 లేదా 200ను పై విధముగా వాడవలెను.

**కొలది ముద్దలు తినగానే కడుపు నిండినట్లు ఉండుట, కడుపు బరువుగా ఉండుట, త్రేపుల వలన ఉపశమనము కలుగుట:** కార్బోవేజ్-30 లేదా 200ను పై విధముగా వాడవలెను.

**పొట్టఉబ్బి, త్రేపుల వలనను ఉపశమనము లేకపోవుట :** చైనా-30లేదా 200ని పై విధముగానే వాడవలెను.

**పొట్టఉబ్బి, అపానవాయువు వెడలుట వలన ఉపశమనము :** లైకో-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**కడుపులోని మంట-వీపుకు వ్యాపించుట, భుక్తాయాసము :** కార్బో వేజ్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.





**కడుపులో తీవ్రమైన మంట :** అర్సెనికమ్ ఆల్బ్-30ని 3 డోస్‌లు వాడవలెను.

**భోజనము చేయునపుడు బట్టలను వదులుగా చేసికొనుట :** కార్బోవేజ్-200ను పై విధముగానే వాడవలెను.

**క్రొవ్వు పదార్థములను తిన్నప్పుడు వచ్చే అజీర్తి విరేచనములకు :** పల్స్30ని మూడు డోస్‌లు వాడవలెను.

**భోజనము తరువాత 2 గంటలకు వచ్చే కడుపునొప్పికి :** నక్స్-30 లేదా 200, నక్స్-30 లేదా 200లను వాడవలెను.

**కడుపు ఖాళీగా ఉన్నప్పుడు వచ్చు కడుపునొప్పి:** ఎనాకార్డియమ్-30 లేదా 200ను 3డోస్‌లు వాడవలెను.

**ఆహారమును తీసికొనుట వలన ఉపశాంతి కలుగు కడుపు నొప్పి :** ఎనాకార్డినమ్-30 లేదా 200ను గానీ, ఐయోడియమ్-30 లేదా 200ను గానీ 3డోస్‌లు వాడవలెను.



**ఆకలికి-ఏమాత్రము ఆగలేక పోవుట, తినుట ఆలస్యము ఐనచో శోషిల్లుట:** సల్ఫర్-30ని 3డోస్‌లు వాడవలెను.

**సోడా ఉప్పును తినువారికి వచ్చు కడుపునొప్పి:** నేట్రమ్‌కార్బ్-30 లేదా 200ను 3 డోస్‌లు వాడవలెను.

**తినిన పదార్థములన్నీ వాయు పూరితమైనట్లు ఉండుట :** నేట్రమ్‌కార్బ్-30 లేదా 200ను 3డోస్‌లు వాడవలెను.

**వికారము, వాంతులు :** ఇపికాక్-30 లేదా 200ను 3గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**ప్రత్యేకముగా తీపిపదార్థమువలన లేదా పంచదారను తిన్నప్పుడు వచ్చు విరేచనములు లేదా జీర్ణకోశ లక్షణములు ఉద్రేకించుట :** అర్జెంటిమ్ నైట్రికమ్-30 లేదా 200ను పై విధముగా వాడుటవలన మంచిఫలితములు కలుగును. ఇది కడుపు అంతటా ఉన్న నొప్పిని తగ్గించును.

**దంతములు పులియునంతటి పుల్లని వాంతులు :** కాల్కేరియాకార్బ్-30 లేదా 200ను 3డోస్‌లు వాడవలెను. దీనితో కడుపుబోర్లించిన పళ్ళెరమువలె ఉన్నా తగ్గును.

**బంగాళాదుంపలను తినుట వలన జీర్ణకోశ లక్షణములు ఉద్రేకించుట:** అల్యూమినా - 200ను 3 డోస్‌లు వాడితే చాలును .

**పుల్లని వాంతులు, పుల్లని వాసన గల విరేచనములు, పుల్లటి త్రేపులు ఇట్టి పుల్లని లక్షణములు :** నేట్రమ్‌ఫాస్-6× లేదా 30ని ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**అజీర్తితో పై లక్షణములు :** కాలీమూర్ 6×లేదా 30ని మార్చి మార్చి పై విధముగానే వాడవలెను.

## పొత్తికడుపు లోపములు-మందులు

**కాలేయము పెద్దది యగుట:** మెర్క్‌సాల్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున ఒక వారముపాటువాడి, తగ్గనిచో సల్ఫర్-30ని 3డోస్‌లు వాడి, నేట్రమ్‌సల్ఫ్ 6×లేదా 12×,బెల్లడోనా-Q ను-10బొట్లు ఔన్స్‌నీటిలో కలుపుకొని త్రాగవలెను. వరుస క్రమములో మెర్క్‌సాల్‌వలెనే వాడవలెను.

**ప్లీహము పెద్దది యగుట:** సల్ఫర్-30ని 3డోస్‌లు వాడిన తరువాత కార్డ్యూస్ మెరియనస్-Q ను 10 చుక్కలు ఔన్స్ ఈనీటిలో కలిపి త్రాగవలెను.

**జలోదరము :** ఏపిస్-30 లేదా 200నుగాని, అర్సెనికమ్ ఆల్బ్-200ను గాని పై విధముగానే వాడవలెను.

**ప్రేగులకు బలములేక పోవుట :** బ్రైయోనియా-30 లేదా 200ను మూడు డోస్‌లు వాడవలెను.

### పొత్తి కడుపు బాధలు

**శరీరమును వంచుట వలన పొత్తి కడుపు బాధలు :** కోలోసింథిస్-30లేదా 200 ను రోజుకు 3డోస్‌ల చొప్పున 2 రోజులపాటు వాడవలెను.

**సంభోగానంతరము పొత్తి కడుపు బాధలు :** కాస్టికమ్-30 లేదా 200ను మూడు డోస్‌లు వాడవలెను.

**బహిస్టును అణచిపెట్టుట వలన పొత్తి కడుపు బాధలు :** పల్స్-30 లేదా 200ను పైవిధముగానే వాడవలెను.

**గర్భిణీస్త్రీలకు పొత్తికడుపు బాధ:** కెమోమిల్లా-30 లేదా 200ను పై విధముగా వాడవలెను.



**బొడ్డువద్ద బాధ :** కోలోసింథిస్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**నీరసము వలన పొత్తికడుపు బాధ :** కాల్కేరియాఫాస్-6× లేదా 12×ను ప్రతిరోజు రోజుకు 3సార్లు వాడవలెను.

**గాలిచేరుటవలన పొత్తి కడుపు నొప్పి :** కెమోమిల్లా-30 లేదా 200ను 3 డోస్‌లు వాడవలెను.

**గాలిపోక తీవ్రమైన పొత్తికడుపు నొప్పి:** కెమోమిల్లా-200ను ప్రతి గంటకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**జీవ పదార్థములు పోవుటచే కలుగు నిస్త్రాణమువలన పొత్తి కడుపు నొప్పి:** చైనా-30ని పై మాదిరిగానే వాడవలెను.

**పొట్టలో గాలిచేరుట వలన పొత్తు కడుపు నొప్పి:** చైనా-30ని పై విధముగానే వాడవలెను.

**చల్లని పానీయములు లేదా ఐస్ వాటర్ త్రాగుట వలన పొత్తికడుపు నొప్పి :** బ్రైయోనియా-30 లేదా 200ను ఒకరోజులో మూడు మోతాదులు వాడవలెను. తగ్గనిచో రుస్టాక్స్-30 లేదా 200నుపైమాదిరిగానే వాడవలెను.

**కాఫీత్రాగిన తరువాత పొత్తి కడుపు నొప్పి:** నక్స్-30 లేదా 200ను గాని, కెమోమిల్లా-30 లేదా 200ను గాని పై మాదిరిగానే వాడవలెను.

**నీళ్ళ విరేచనముల వలన పొత్తికడుపు నొప్పి:** పోడోఫైలమ్-30 లేదా 200, మెర్క్‌సాల్-200ను పైవిధముగానే వాడవలెను.

**విరేచనమునకు ముందుగా పొత్తి కడుపు నొప్పి:** పల్స్-30 లేదా 200, కోలో సింథిస్-30 లేదా 200ను పై మోస్తరుగానే వాడవలెను.

**విరేచనము ఐన తరువాత పొత్తి కడుపు నొప్పి :** ఏసిడ్ నైట్రిక్-30 లేదా 200ను రోజుకు 3-4 మోతాదులు వాడవలెను.

**పసరు రాళ్ళ వలన పొత్తికడుపునొప్పి:** బెర్బెరిస్ వల్గారిస్-30 లేదా 200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున ఒకవారము పాటువడి, తగ్గనిచో కెమోమిల్లా-30 లేదా నేట్రమ్‌సల్ఫ్-30 లేదా 200ల పవర్‌లో వాడవలెను.

**సవాయి బిళ్ళల వలన పొత్తికడుపు నొప్పి :** హెపార్ సల్ఫ్-30 లేదా 200ను గానీ, ఏసిడ్‌నైట్రిక్-200నుగానీ, మెర్క్‌సాల్-200నుగానీ పైవిధము గానే వాడవలెను.

**సెగవ్యాధి జీర్ణించుటవలన పొత్తికడుపు నొప్పి:** గనోరియమ్ (మెడోరినమ్) 1mను ఒకడోస్ వేసి, తరువాత ఆరమ్ మెటాలికమ్ 1mను ఒకడోస్ వాడవలెను.

**కామెరల వ్యాధితో-పొత్తి కడుపు నొప్పి:** చైనా-30, కాలిమూర్-30, ఫెర్రమ్‌ఫాస్-30లను ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

## మలము-మలాశయము; వ్యాధులు-మందులు

**ఆసనములో పుండ్లు:** సైలీషియా-200 పవర్‌లో రోజుకు మూడు మోతాదుల చొప్పున ఒకవారము వాడి, తగ్గనిచో కాల్కేరియా సల్ఫ్-200ను వాడవలెను. వీటితో హైడ్రాస్టిస్-Q నుకూడా 10 చుక్కలు-ఔన్స్ నీటిలో కలిపి, రోజుకు 3 సార్లు వాడవలెను.

**ఆసనములో దురద:** సినా-20ను గాని, నేట్రమ్‌ఫాస్-200ను గాని ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**ఆసన చర్మము పగిలి మంటలు:** గ్రాఫైటీస్-30లేదా 200, ఏసిడ్ నైట్రిక్-200లలో మొదటి దానిని 3 డోస్‌లువాడి, తరువాత రెండవ దానిని వాడవలెను.

**పురీష నాళమునకు పక్షవాతము:** కాస్టికమ్-200ను రోజుకు మూడు డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**చర్మవ్యాధులను-అణచి పెట్టుట వలన పురీష నాళము బయటకు వచ్చుట:** పోడో ఫైలమ్-200, డల్కమారా-30 లేదా 200ను పై మాదిరిగానే వాడవలెను.

**ఆసనములో-వాపు, బాధ:** ఏసిడ్ నైట్రిక్-200 పవర్‌లో బాధ ననుసరించి రోజుకు మూడు నాలుగు డోస్‌ల చొప్పున వాడవలెను.

**ఆసనములో-మంట:** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని పైవిధముగానే వాడవలెను.

**భగందరము(పిస్టులా) వలన బాధ:** సైలీషియా-1m పవర్‌లో రోజుకు మూడు మోతాదుల చొప్పున ఒకవారము పాటువాడి, తగ్గనిచో కాల్కేరియా సల్ఫ్ 1mను వారమునకు మూడు డోస్‌లు; తరువాత మెర్క్‌సోల్ 1mను 3డోస్‌లు వాడవలెను.

**ఆసనములో-వెచ్చదనముతో కూడిన పోట్లు:** బెల్-30ని వాడవలెను.



**ఆసనములో-మంటతో కూడిన పోట్లు:** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని వాడవలెను. ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లను వాడవలెను.

**ఆసనము నుండి రక్తస్రావము:** హెమా మెలిస్-Q 10 చుక్కలను ఔన్స్ నీటిలో కలుపుకొని, రోజుకు-మూడు డోస్‌లచొప్పున వాడి, తగ్గనిచో ఫాస్పరస్-200, కాల్కేరియా ఫ్లోర్-30, ఫెర్రమ్‌ఫాస్-200 వీటిని ప్రతిరోజు 3 సారుల చొప్పున వాడవలెను.

**ఆసనము బయటకు వచ్చుట:** పోడో ఫైలమ్-30 లేదా 200లను రోజుకు మూడు మోతాదులచొప్పున వాడవలెను. కాల్కేరియా ఫ్లోర్-6×ను ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

## జీర్ణాశయ క్రిమి దోషములు

**ఏక్రిమి దోషములకైనా:** ట్యుక్రియమ్ మారమ్ వీరమ్-30 లేదా 200 పవర్‌లో రోజుకు 3 డోస్‌ల చొప్పున ఒకవారముపాటువాడి, తగ్గనిచో ఇదే విధముగా "నేట్రమ్‌ఫాస్-30, కాల్కేరియా కార్బ్-30 లేదా 200లను" మందులను వరుస క్రమములో వాడవలెను.

**నులి పురుగు:** సినా-200ను ప్రతిరోజు 3 డోస్‌ల చొప్పున ఒక వారము పాటువాడి, తగ్గనిచో తరువాత నేట్రమ్‌ఫాస్-30 లేదా 200ల పవర్‌లో ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**ఏలిక పాములు:** సెబాడిల్లా-200ను ప్రతిరోజు వాడవలెను. తరువాత ట్యుక్రియమ్ మారమ్ వీరమ్-200, సినా-20లను పై విధముగానే వాడవలెను.

**బద్దె పెరుగులు:** సినా1ల పవర్‌లో వారమునకు 1డోస్ చొప్పున మూడు వారములు వాడవలెను. ప్రతిరోజు నేట్రమ్‌ఫాస్-6×ను రోజుకు 3డోస్‌ల చొప్పున ఒక్కనెలరోజులు వాడవలెను. మధ్యమధ్యలో సల్ఫర్-200ను ఒకడోస్ వేస్తూ ఉండవలెను.

## మొలలు (మూలశంక)

ఎస్క్యులస్ హిప్-200ల పవర్‌లో రోజుకు 3-4 డోస్‌ల చొప్పున ఒక వారముపాటువాడి, గుణము కనిపించని పక్షములో ఈ క్రింది మందులను కూడా ఇదేవిధముగా వాడవలెను. కాల్కేరియా ఫ్లోర్-30ని ప్రతిరోజు రోజుకు 3 సారుల చొప్పున ఒక నెలరోజులు వాడవలెను. తరువాత

రాత్రి ఒకడోస్ నక్స్-200ను, ఆ తరువాత సల్ఫర్-30ని 3 డోస్‌లు వాడవలెను.

**లోపలి మొలలు :** ఎస్క్యులస్ హిప్-30 లేదా200, కాల్కేరియా ఫ్లోర్-30 లేదా 200ను ప్రతిరోజు రోజుకు 3 సారులు నీటిలో కలిపి వాడవలెను.

**రక్తమొలలు :** "హెమా మెలిస్-Q కాల్కేరియాఫ్లోర్-6× లేదా 30; ఫెర్రమ్‌ఫాస్ 6×లేదా 30" అను మందులను ప్రతిరోజు రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**మొలలు-వాచి బాధలు :** బెల్లడోనా-30 లేదా 200, రటానియా-30 లేదా 200ను బాధ తగ్గేవరకు ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున రెండింటిని కలిపి వాడవలెను.

**మొలల దురద:** సల్ఫర్-30ని 3 డోస్‌లు వాడి, తరువాత నేట్రమ్ సల్ఫ్-30ని ప్రతిరోజు రోజుకు 3 సారులు చొప్పున వాడవలెను.

**మొలలు-ద్రాక్షగుత్తివలె బయటకు వచ్చుట :** ఎలోస్-30 లేదా 200, ఎస్క్యులస్ హిప్-30 లేదా 200ను ప్రతిరోజు రోజుకు 3 సారులు వాడవలెను.

**మూత్ర విసర్జన సమయములో మొలలు బయటకు వచ్చుట:** ఏసిడ్‌మూర్-30 లేదా 200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**మొలలు-భరించ రాని బాధగా ఉన్నప్పుడు :** కెమోమిల్లా-200 పవర్‌లో రోజుకు 3 డోస్‌ల చొప్పున తగ్గేవరకు వాడుచూ,నెగుండియమ్ అమెరికానమ్-Q ని-20 చుక్కలు ఔన్స్‌నీటిలోకలిపి కడుపులోనికి త్రాగవలెను.

## విరేచనములు-మందులు

**జిగట విరేచనములు :** మెర్క్‌సాల్ 200ల పవర్‌లో రోజుకు 3 డోస్‌లు వాడి, తగ్గనిచో వరుసక్రమములో ఈమందులను వాడవలెను. కాలిమూర్-30 లేదా 200, నక్స్-200, సల్ఫర్-30లను రోజుకు3డోస్‌ల చొప్పున వాడవలెను.

**కొన్ని రోజుల వరకు విరేచనము కాని ఎడల :** ఓపియమ్-30 లేదా 200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున సక్రమముగా విరేచనము లయ్యేవరకు వాడవలెను.



**రంగు మారు విరేచనములకు:** పల్సటిల్లా-30ని 3డోస్‌లు వాడవలెను.

**దంతములు వచ్చునప్పుడు కలిగే విరేచనములకు :** కెమోమిల్లా-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**క్రమములేని విరేచనములకు :** బ్రైయోనియా-30 లేదా 200 పవర్‌లో రోజుకు 3 డోస్‌ల చొప్పునవాడి, గుణములు కనిపించని పక్షములో నక్స్-30ని 3 డోస్‌లు వాడవలెను.

**దడుపు విరేచనములకు:** ఎకోనైట్-30 లేదా 200, అర్జంటమ్ నైట్రికమ్ -30 లేదా 200ను పై మాదిరిగానే వాడవలెను.

**రక్త విరేచనములకు :** మెర్క్‌కర్-30 లేదా 200ను రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.

**ఆకుపచ్చ విరేచనములకు :** పోడో ఫైలమ్-30 లేదా 200ను రోజుకు 3 డోస్‌లు వాడి తగ్గనిచో నేట్రమ్‌ఫాస్-30 లేదా 200ను-3డోస్‌లు వాడవలెను.

**తరచుగా విరేచనములౌతుంటే:** పోడో ఫైలమ్-30 లేదా 200ను గానీ ఆర్సెని కమ్ ఆల్బ్-30ని గానీ పై విధముగానే వాడవలెను.

**అప్రయత్న విరేచనములకు :** సల్ఫర్-30 లేదా 200, కార్బోవేజ్-30 లేదా 200ను పైమాదిరిగానే వాడవలెను.

**కుళ్ళి దుర్వాసనతో కూడిన విరేచనములకు :** కాలీఫాస్-30ని ప్రతిరోజు ఒకరోజుకు 3 డోస్‌ల చొప్పునవాడుతూ సోరినమ్-200ను 1 డోస్‌వాడి, తరువాత సల్ఫర్-30ని 3డోస్‌లువాడి, ఆ తరువాత పోడో ఫైలమ్-30 లేదా 200ను 3 డోస్‌లు వాడవలెను.

**నీళ్ళ విరేచనములకు :** ఆర్సెనికమ్ ఆల్బ్-30 లేదా 200లను 3 డోస్‌లు, తరువాత విరాట్రమ్ ఆల్బ్-30 లేదా 200ను 3డోస్‌లు, తరువాత సల్ఫర్-30 లేదా 200ను 3 డోస్‌లు; నేట్రమ్‌మూర్-30 లేదా 200ను గంటకు ఒక డోస్ చొప్పున వాడవలెను.

**అజీర్ణ విరేచనములకు :** పల్స్-30 లేదా 200ను వాడవలెను.

**విరేచనములు అధికముగా అవుతుంటే :** 2 గంటలకు ఒకసారి చొప్పున నక్స్-30 లేదా 200ను 3డోస్‌లు వాడవలెను.

**తెలుపుతో కూడిన విరేచనములకు :** కాలీ మూర్-30 లేదా 200ల పవర్‌లో ఒకరోజు 3 డోస్‌లు వాడవలెను. గుణము కనిపించని పక్షములో కాల్కేరియా కార్బ్-30లేదా 200 పవర్‌లో వాడవలెను.

**చీము వంటి విరేచనములు:** మెర్క్‌సాల్-200ను 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడుతూనే; సైలీషియా-200,కాల్కేరియా సల్ఫ్-200లను ఒక్కొక్క దానిని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**కొంచెము కొంచెముగా విరేచనము లౌతుంటే:** నక్స్-30 లేదా 200ను రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**విరేచనము లధికముగా అవుతుంటే:** పోడో ఫైలమ్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**పాలుత్రాగుట వలన విరేచనము లౌతుంటే:** మెగ్నీషియాకార్బ్-30 లేదా 200ను పై విధాముగానే వాడవలెను.

**వేసవి విరేచనములకు :** బ్రైయోనియమ్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**గట్టిగా అర్చుకుపోయినట్లున్న విరేచనములకు:** బ్రైయోనియమ్-30 లేదా 200ను పై విధముగానే వాడవలెను.

**గమనిక :** ఈ అధ్యాయములోని "3డోస్‌లు" అంటే డోస్‌కు మధ్యన 8 గంటల వ్యవధి ఉండవలెను. "3 గంటలకు 2డోస్" అంటే రోజుకు 8 సారులు వాడవలెను.

**ఆపుకోలేని త్వరితవిరేచనములకు :** విరాట్రమ్ ఆల్బ్-30 లేదా 200ను దినమునకు మూడుడోస్‌ల చొప్పునవాడి, తగ్గని పక్షములో సల్ఫర్-30 లేదా 200ను 3డోస్‌లు వాడి, దీనికీ తగ్గని ఎడల నేట్రమ్‌మూర్-30ని ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**జిగట లేదా ఆమ్ల విరేచనములకు:** మెర్క్‌సాల్-200ను3గంటలకు ఒక డోస్‌చొప్పునవాడి, తరువాత మెర్క్‌కర్-200ను3డోస్‌లువాడి, తరువాత కాలీమూర్- 30 లేదా 200ను ప్రతిరోజు రోజుకు 3సారుల చొప్పున వాడవలెను. అంటే 8 గంటలకు 1డోస్ చొప్పున వాడవలెను.





**గాలి మార్పువలన అయ్యే విరేచనములు :** డల్కమారా-30 లేదా 200ను 3 డోస్‌లువాడి, నేట్రమ్‌సల్ఫ్-30 లేదా 200ను ప్రతిరోజు రోజుకు 3 సారులు చొప్పున వాడవలెను.

**పండ్లు తినుట వలన విరేచనములైతే :** ఆర్సెనికమ్ ఆల్బ్-30 లేదా 200ను గాని, కేంఫర్-30ని గాని పైమాదిరిగానే వాడవలెను.

## కలరా

సల్ఫర్-30 లేదా 200ను ఒకరోజునే 3 గంటలకు ఒకడోస్‌చొప్పున వాడి, తరువాత కూడా నీరసముగానే ఉంటేవిరాట్రమ్ ఆల్బ్-30 లేదా 200ను 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను. కార్బోవేజ్-200ను గానీ, ఆర్సెనికమ్ ఆల్బ్-200ను గానీ 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**కలరాను-నిరోధించుటకు :** సల్ఫర్-30 లేదా 200ను 3డోస్‌లు వాడి, తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3డోస్‌లు వేయవలెను.



**కలరాలో-నిస్త్రాణమునకు:** ఆర్సెనికమ్ ఆల్బ్-30 లేదా 200ను 3 గంటలకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడి, తరువాత నేట్రమ్‌మూర్-30ని గంటకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**మలబద్ధకము :** మల బద్ధకమునకు రాత్రిపూట నక్స్-30ని 1డోస్‌వేసి, ఉదయముపూట సల్ఫర్-30ని 1డోస్ వేయాలి. ఇలా మలబద్ధకము తగ్గే వరకు వాడుతూనే ఉండవలెను. శరీరములో మార్పు తెలిసినచో ఆపాలి. ఇంకా సైలీషియా-6×లేదా 30, అల్యూమినా-30 లేదా 200,బ్రైయోనియా-30 లేదా 200లను కూడా వాడవచ్చును. (ఈమందులను వరుస క్రమములో రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.)

## మూత్రావయవ మండలము-బాధలు

### మూత్రకోశము

**బ్లాడర్ నిండిననూ మూత్రము విడుచు కోరిక ఉండదు:** కాస్టికమ్-30ని ప్రతి రెండు గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**పిల్లలు మూత్రమును అణచి పెట్టుట :** అప్పుడే పుట్టిన పిల్లలకు ఎకోనైట్-30ని గంటకు 2 మాత్రల చొప్పున 3డోస్‌లు వాడవలెను.

**పెద్దలు మూత్రమును అణచి పెట్టుట:** ఏపిస్-30ని ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**ముసలివారు మూత్రమును అణచిపెట్టుట :** సాలిడాగో-30ని ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**ప్రసవించిన తరువాతమూత్రమును అణచిపెట్టుట :** ఆర్నికా-200ను ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడి, మూత్రమురాని ఎడల కాస్టికమ్-200ను పై విధముగానే వాడవలెను.

**హిస్టీరియా బాధతో మూత్రమును అణచిపెట్టుట:** జింకమ్‌మెట్-30ని మూడు డోస్‌లు వాడవలెను. కేంథారిస్-30ని ప్రతి 6 గంటలకు మూడు మాత్రలు చొప్పున వాడవలెను. అప్పటికీ సరిగాకపోతే కాస్టికమ్-200ను మూడు డోస్‌లు వాడవలెను.

**శరీర పరిశ్రమ వలన మూత్రమును అణచి పెట్టుట :** ఆర్నికా-200ను ఉదయము-మూడుమాత్రలు, మధ్యాహ్నము మూడుమాత్రలు, రాత్రి మూడు మాత్రల చొప్పున మూడు రోజులపాటు వాడవలెను.

**వాపు,తీపు, వెచ్చదనము వలన మూత్రమును అణచిపెట్టుట :** కేంథారిస్ 30లేదా 200ను ప్రతి ఆరు గంటలకు ఒకడోస్ చొప్పున బాధ తగ్గేవరకు వాడవలెను. దానికీ మూత్రము రాకపోతే ఆర్సెనికమ్ ఆల్బ్-30ని పై విధ ముగా 3 రోజులుపాటు వాడి ఆపవలెను.

**బహిష్టువలన మూత్రమును అణచిపెట్టుట :** టూరెంట్యులా క్యూబెన్‌సిస్ 30ని రోజుకు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**మల విసర్జన యందు బాధ వలన మూత్రమును అణచిపెట్టుట:** రాత్రిపూట నక్స్-30 పవర్‌లో 3రోజులు వాడి, తగ్గనిచో ఏసిడ్‌ఫాస్-30ని 3డోస్‌లు వాడవలెను.

## మూత్ర విసర్జనలో మార్పులు

**అప్రయత్నముగా మూత్రము వచ్చుట:** సోరినమ్ 1m లో ఒకడోస్‌ను వేసి నేట్రమ్‌మూర్-30ని ప్రతిరోజు 3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**రాత్రిపూట అప్రయత్నముగా మూత్రము వచ్చుట:** మెగ్నీషియా ఫాస్-30, నేట్రమ్‌మూర్-30లను, ప్రతిరోజు రోజుకు 3డోస్‌ల చొప్పున వాడవలెను.





**బహిష్టులో అప్రయత్నముగా మూత్రము వచ్చుట:** కేంథారిస్-30ని ప్రతిరోజు 3సార్లు వాడవలెను.

**తుమ్మినా, దగ్గినా మూత్రము పడుచున్న :** డ్రోసెరా-30ని ప్రతిరోజు రోజుకు 3 డోస్‌లువాడుతూ, కాస్టికమ్-1m ను ఒకడోస్ వేయవలెను.

**రక్తమూత్రము :** ఫెర్రమ్‌ఫాస్-30ని ప్రతిరోజు రోజుకు 3 సార్లుచొప్పున వాడుతూ, బెల్లడోనను రోజుకు2సారుల చొప్పున 200 పవర్‌లో వాడవలెను.

**తొలిసారి గర్భము ధరించిన స్త్రీలకు అప్రయత్నముగా మూత్రము వచ్చుట:** స్టాఫి సేగ్రియా-30ని ప్రతిరోజూ రోజుకు 3సారులు వాడవలెను.

**సుగర్ వ్యాధిలో అప్రయత్నముగా మూత్రము వచ్చుట :** సిజీజియమ్-Qని ప్రతిరోజూ ఒకఅర ఔన్స్ నీటిలో పదిబొట్లు కలిపి రెండుసారులుగా త్రాగవలెను. యురేనియమ్ నైట్రికమ్-30ని ప్రతిరోజు రోజుకు 2 సారులు వాడవలెను. ఈ రెండు మందులనువాడుతూ నేట్రమ్‌మూర్-6×ను రోజుకు 3సారులు వాడిన మేలు కలుగును.



**మూత్ర విసర్జన తరచుగా జరుగుట:** నేట్రమ్‌మూర్-6×ను ప్రతిరోజు రోజుకు 2సార్లు చొప్పున వాడవలెను. కాల్కేరియా కార్బ్-30ని వారమునకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను.

**త్వరితముగా మూత్ర విసర్జన జరుగుట:** పల్సటిల్లా-30ని ఓ రోజుకు మూడు సారుల చొప్పున 3 రోజులువాడి, గుణము కనిపించని ఎడల తూజా 30ని 3రోజులు పై విధముగానే వాడవలెను. నేట్రమ్‌మూర్-6×ను ఒకనెల రోజులపాటు దినమునకు 3 సారుల చొప్పున వాడవలెను.

**రాత్రిపూట త్వరితముగా మూత్ర విసర్జన జరుగుట:** సల్ఫర్-30ని 3సార్లు సారికి 3 మాత్రల చొప్పున ఒకరోజులో వాడవలెను.

**సంభోగ అనంతరము త్వరితముగా మూత్ర విసర్జన జరుగుట:** నేట్రమ్ ఫాస్- 12×ను ప్రతిరోజూ రోజుకు 3సారుల చొప్పున ఒక నెలపాటు వాడవలెను.

**ప్రొస్టేట్ గ్రంథివాపు వలన త్వరితముగా మూత్ర విసర్జన జరుగుట:** కాల్కేరియాకార్బ్ 200ను ఒకరోజులో 3సార్లు వాడవలెను. తరువాత బెర్బరిస్ వల్గారిస్-30ని ఒక వారముపాటు రోజుకు 3సారుల చొప్పున వాడవలెను.

**స్త్రీలతో మాట్లాడినపుడు ప్రొస్టేట్ గ్రంథినుండి స్రావము :** నేట్రమ్‌మూర్ 200ను ప్రతిరోజు రోజుకు 3 సారులచొప్పున ఒకనెల రోజులు వాడవలెను. తగ్గితే ఆపవలెను.

**సెగవ్యాధి వలన ప్రొస్టేట్ గ్రంథివాపు :** మెడోరినమ్ 1m ను ఒకడోస్, మెర్క్యూరియస్-1m ను ఒకడోస్ వాడవలెను. (రోజుమార్చి రోజు వేయండి)

**సంభోగ సమయములో మూత్ర ద్వారము మంట :** కేంథారిస్-30ని ప్రతిరోజు రోజుకు 3సార్లు వాడవలెను.

**మూత్ర ద్వారము దురద :** సల్ఫర్-200ను 3డోస్‌లను వాడవలెను. ఎఖిలే షియా-Q ను ప్రతిరోజు రోజుకు పది బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి త్రాగించవలెను.

**మూత్ర విసర్జన తరువాత నిస్త్రాణ :** ఏసిడ్ ఎసిటిక్-30ని రోజుకు 3 మాత్రల చొప్పున 3 రోజులు వాడవలెను.

**మూత్రము నవాసాగరము (అమ్మోనియమ్) వలె వాసన:** మెర్క్యూరియస్ 30 లేదా 200ను ప్రతిరోజు రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.



**మూత్రము వాసన మారు చుండుట :** పల్స్-30 లేదా 200ను ఒకరోజు 3సార్లు వాడవలెను. లేదా ఏసిడ్ బెంజాయిన్-30ని రోజుకు 3 డోస్‌ల చొప్పున 3రోజులు వాడవలెను.

**గుబ్బపు మూత్ర వాసన :** ఏసిడ్ నైట్రిక్-200ను రోజుకు 3 సారులు 3మాత్రల చొప్పున 3దినములు వాడవలెను.

**మూత్రము దుర్వాసన :** సల్ఫర్-30ని 3డోస్‌లు వాడవలెను.

## మూత్రము యొక్క తారతమ్య సాంద్రత (స్పెసిఫిక్‌గ్రేవిటి)

**అధికమగుట:** కాల్కేరియా ఫాస్-6×ను ప్రతిరోజు రోజుకు 3సార్లు చొప్పున ఒకనెలరోజులు వాడవలెను.

**తగ్గుట:** కాఫీ-30ని గానీ, ప్లంబమ్ మెట్-30నిగానీ ఒకరోజు 3 డోస్‌లు మాత్రమే వాడవలెను.

**పిల్లలు-నిద్రలో మూత్రమును పోయుట:** కాలీఫాస్-30ని దినమును మూడుపూటలా పూటకు మూడు మాత్రలచొప్పున ఒకనెలరోజులు వాడవలెను. బెల్లడోనా-200ను వారమునకు 3 రోజులు రోజుకు 3 పూటలా వాడవలెను.



**మూత్రములో ఎల్లని పదార్థము ఉన్నఎడల :** సెపియా-200ను ఒకరోజు 3 పూటలా పూటకు 3 మాత్రలచొప్పున వాడవలెను.

**మూత్రము పోసినచోట డాగు (మరక)పడుచున్న:** లైకో పోడియమ్-200 ను ప్రతిరోజు 3పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**కలలో మూత్ర విసర్జన:** క్రియోసోటమ్-200ను రోజుకు 3 మాత్రల చొప్పున 3 దినములపాటు వాడవలెను. గుణము కనిపించకపోతే 1mను ఒక మోతాదువాడితే చాలును.

**గమనిక :** నేట్రమ్‌మూర్ శరీరములోని నీటిని క్రమపరచి, శరీరములో ఎక్కడైనా నీరు పట్టిన దానిని సరిచేయును. నేట్రమ్‌సల్ఫ్-నీటిని క్రమపరచి అధికముగా ఉన్న నీటిని మూత్రము ద్వారా (లేదా చెమటద్వారా) బయటకు పంపును.

## పురుష మర్మావయవ మండలము వ్యాధులు-నివారణలు

**అండములు ఎండిపోవుట:** స్టాఫిసేగ్రియా-30ని 3పూటలా పూటకు 3 మాత్రల చొప్పున ఒక వారము రోజులు వాడవలెను.

**అంగము ఎండిపోవుట :** లైకోపోడియ్ 200ను 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున 3 రోజులు వాడి, వారము ఆగి మరల 3 రోజులు వాడవలెను. తరువాత 1m ను వారమునకు ఒకడోస్ చొప్పున వేయవలెను. దీనితరువాత కెన్నబిస్ ఇండికా-200, అర్జెంటుమ్ నైట్రికమ్-200లను పై విధముగానే వాడవలెను.

**రాత్రి అంగస్తంభన జరిగినపుడు బాధ:** ఏసిడ్ పిక్రిక్-200ను 3 పూటలా పూటకు 3 మాత్రలచొప్పున ఒకవారముపాటు వాడవలెను. **ఉదయము:** ఏగ్నస్ కెస్టస్-Q, ఏసిడ్‌ఫాస్-30; **మధ్యాహ్నము:** నక్స్ వామికా-30, **సాయంకాలము:** ఫాస్ఫరస్-30 పూటకు 3 మాత్రల చొప్పున 3 దినములు వాడవలెను.

**వీర్య స్ఖలనము తరువాత బాధ లేక నీరసము :** ఏసిడ్ ఫాస్-200ను 3 పూటలా మూడు మాత్రల చొప్పున ఒకవారము వాడవలెను. ప్రతిరోజు నేట్రమ్‌మూర్-6×ను ఒకనెలరోజులు వాడవలెను. (కాలీఫాస్-6×ను కూడా వాడవచ్చును)

**సంభోగమునందు అయిష్టత:** కెన్నబిస్ సతివా-30ని ప్రతిరోజు 3 పూటలా పూటకు మూడు మాత్రల చొప్పున వాడవలెను.

**సంభోగ తృప్తి లేకపోవుట:** కెలిడోనియమ్ మేజుస్-Q ను ఒక అర ఔన్స నీటిలో పదిబొట్లు కలిపి మూడు పూటలా వాడవలెను. నేట్రమ్ మూర్-200ను రోజుకు రెండుసార్లు సారికి మూడు మాత్రల చొప్పున ఒక నెలరోజులు వాడవలెను.

**అంగముమీద పొక్కులు :** మెర్క్ సోల్-200ను 4 రోజులకు ఒక రోజు రోజుకు 3-4 మాత్రలచొప్పున వాడవలెను. గుణము కనిపించకపోతే వెయ్యి పవర్‌లో ఒకడోస్‌ను వేయాలి. తరువాత సిఫిలినమ్ 1mను ఒకడోస్ వాడవలెను.

**అంగము మీద దురద పొక్కులు :** పెట్రోలినమ్-30ని 4 రోజులకు ఒక్కడోస్ చొప్పున వాడవలెను.

**వృషణములమీద పొక్కులు :** గ్రాఫైటిస్-30ని 3 పూటల 3 మాత్రల చొప్పున ఒకరోజువాడితే చాలును.

**మర్మావయవమును తరచు ముట్టుకొనుచుండుట:** హైయోశ్యామస్-30ని ఒక వారము రోజులు రోజుకు రెండుపూటలవాడి, తరువాత 1m ను 1డోస్ వేస్తేచాలును.

## నపుంసకత్వము

**నరముల బలహీనత వలన నపుంసకత్వము :** 1. అవిన సతివా-g, 2.డామియాన-g, 3.బొట్లుచొప్పున కలిపి, రోజూ రెండుపూటలా ఒకనెలరోజులు వాడ వలెను. 3వ మందును రోజుకు 3 పూటలా ఒకనెల దినములపాటు వాడవలెను.

**సెగవ్యాధి వలన నపుంసకత్వము:** తూజా-200 పవర్‌లో ప్రతిరోజు రోజుకు 3 పూటలా 4రోజులువాడి, 4రోజలు ఆగి, మరల-1mను ఒకడోస్ వాడితే చాలును.

**సవాయి వలన నపుంసకత్వము :** మెర్క్యూరియస్-200ను తూజా వలెనే వాడవలెను.

**ఒరిపిడి పుండ్లవలన నపుంసకత్వము :** గ్రాఫైటిస్-30ని 3 పూటల 3డోస్‌లు వాడి, పైకి క్యాలెండులా పౌడర్‌ను చల్లవలెను.



**అతి సంభోగము వలన నపుంసకత్వము :** ఏగ్నస్ కెస్టస్-g ను ప్రతిరోజు రోజుకు 3 సారులు అర ఔన్స్ నీటిలో 10 బొట్లు చొప్పున కలిపి, కొంత కాలము వాడవలెను. లైకోపోడియమ్-200ను 4 రోజులకు 1డోస్ (3మాత్రలు) చొప్పున కొన్ని మోతాదులు వాడవలెను.

**యువకులకు కలుగు-నపుంసకత్వము మరియు వృద్ధులకు కలుగు నపుంసకత్వము:** కోరిక విపరీతముగా ఉన్నా అంగస్తంభన సరిగా లేనపుడు లైకోపోడియమ్-200ను కొన్ని రోజులపాటు పూటకు 3 మాత్రల చొప్పున 3 పూటలా వాడవలెను. దీనితో మెగ్నిషియా ఫాస్-6×,కాలీఫాస్6×లను కొన్ని రోజులపాటు వాడవలెను.

**బుడ్డతో (BydroCell) నపుంసకత్వము :** స్పాంజియా-30, ఏసిడ్ ఫ్లోర్-30లను ఒకరోజు ఒకదానిని, రెండవరోజు రెండవదానిని మార్చుతూ రెండుపూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.



## హస్త ప్రయోగము వలన వచ్చుదోషములు - మందులు

**బలహీనత, నపుంసకత్వము, నిద్రలేమి, ఆకలిలేమి:** ఏసిడ్‌ఫాస్-30ని 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున కొన్ని రోజులూ; ఏసిడ్ పిక్రిక్-30ని 3పూటలా పూటకు 3 మాత్రలచొప్పున కొన్ని రోజులూ వాడవలెను.

**వృషణములు గట్టిపడుట :** కాల్కేరియా ఫ్లోర్-6×ను రోజుకు2పూటలా కొన్ని రోజులువాడుచూ, కోనియమ్-200ను 3 డోస్‌లు వాడవలెను. ఉమ్మెత్త ఆకులను నీటిలో ఉడకపెట్టి పైనవేసి కట్టుకట్టుట లేదా తడిగుడ్డను గోచీగాపెట్టుట ఇలా కొంతకాలము చేయుటమంచిది.

**స్వప్నములు లేకుండా స్ఖలన మగుట :** ఏసిడ్ పిక్రిక్-30,ఏసిడ్‌ఫాస్-30 లను రోజు కొకటిగా మార్చుతూ రోజూ 2 పూటలు వాడవలెను.

**స్వప్న స్ఖలనము :** ఏసిడ్ ఫాస్-30, కాలీఫాస్-30లను రోజుకొకటిగా మార్చి మార్చి రోజుకు 3 పూటల 3 మాత్రలచొప్పున వాడవలెను.

**సంభోగవాంఛ తగ్గుట:** ఏగ్నస్ కెస్టస్-g కొన్ని రోజులపాటు రోజూ 2 పూటలా అర ఔన్స్‌నీటిలో 2పదిబొట్లు చొప్పున కలిపి వాడవలెను. నేట్రమ్ మూర్-30ని రోజుకు ఒకసారి సారికి 3 మాత్రల చొప్పున కొన్ని రోజులపాటు వాడవలెను.

**సంభోగవాంఛ హెచ్చుట:** నక్స్ వామికా-30ని రాత్రిపూట 3 మాత్రల చొప్పున 3 రోజులు పాటువాడి, తరువాత 200 పవర్‌లో 3 రాత్రులు వాడవలెను. నేట్రమ్ మూర్-30ని ప్రతిదినము 3 పూటలా 3మాత్రల వంతున కొన్ని రోజులు వాడవలెను.

**సెగవ్యాధి అణగారుటవలన వృషణములవాపు** : క్లెమటిస్-30ని ప్రతి దినము 3 పూటలా3 మాత్రల చొప్పున వాడవలెను. ఈ వాపు మెత్తగా ఉంటే పల్స్30ని వాడవలెను.

**దెబ్బతగులుట వలన వృషణములు వాచుట:** రాడోడెన్‌డ్రాన్-30 పవర్‌లో 3 పూటలా 3 మాత్రల చొప్పున కొన్నిదినములు వాడవలెను. తగ్గని పక్షములో స్పాంజియా- 30ని వాడవలెను.

**సంభోగానంతరముమూర్ఛవస్తే** : బ్యూఫో-200ను 3పూటల 3డోస్‌లు వాడవలెను.

**శుక్లనష్టము** : కెడ్మియమ్‌ఫాస్పేట్-g, మెగ్నీషియాఫాస్-30లను మార్చిమార్చి వాడవలెను. ప్రతిదినము మొదటిదానిని అరఔన్స్‌నీటిలో పదిబొట్లు చొప్పునకలిపి వాడవలెను. రెండవదానిని రెండుపూటల 3మాత్రల చొప్పున వాడవలెను. అల్యూమిన ఫాస్ఫారిక పదార్థములు మూత్రముద్వారా పోయిగానీ, శుక్లము ద్వారాపోయిగానీ నరములశక్తి తగ్గి క్షీణించుచున్న ఎడల ఏసిడ్ పిక్రిక్- 30ని రెండుపూటలా 3 మాత్రల చొప్పున కొన్ని దినములు వాడవలెను.

**నిద్రలో-శుక్లనష్టము, సంభోగము మధ్యలో జననేంద్రియ పటుత్వము తగ్గుట; సంభోగానంతరము-వృషణములులాగుచుండుట;వీపు, కాళ్ళ యందు నొప్పి:** ఏసిడ్ ఫాస్- 200ను కొన్ని దినములపాటువాడి, గుణము కనిపించకపోతే 1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడిన చాలును.

**త్రాగుబోతులకు, మత్తుమందులను వాడువారికి, నిద్రలేమి ఉన్నవారికి, అల్లోపతి మందులను ఎక్కువగా వాడిన వారికి కలుగు నపుంసకత్వము :** నక్స్-200ను రాత్రిపూట 3 మాత్రలచొప్పున కొన్ని రాత్రులపాటు వాడవలెను.

**కన్నులకు క్రింద-నల్లని వృత్తములు ఏర్పడుట, అతిగా సంభోగము చేయుట, ఎప్పుడూ మనసు జననేంద్రియముల మీద కేంద్రీకరించబడుట,వీటి వలన కలిగిన చికాకుతో మానసికముగా క్రుంగుట:** స్టాఫిసేగ్రియా-30ని ప్రతిదినము 2సార్లు





చొప్పున వాడవలెను. ఒక నెలతరువాత గుణము కనిపించని ఎడల 200ను పై విధముగానే వాడవలెను.

**సవాయి దోషము పూర్తిగా పోవుటకు :** మెర్క్‌సోల్, సిఫిలినమ్ నైట్రిక్- ఏసిడ్ మరియు జకరాండా కరోబా మదర్ టించర్స్‌ను దినమునకు 2సార్లు సారికి అరఔన్స్ నీటిలో 10బొట్లు కలిపి ఒకనెలరోజులు వాడవలెను.

**పురుష జననేంద్రియముమీదగల చర్మము-ముందుకు-వెనుకకు రాక పోవుట:** మెర్క్‌సోల్-200ను దినమునకు 3సారులు వాడవలెను. ఒక 15దినములు వాడి, గుణము కనిపించని ఎడల మెర్క్యూరియస్ ప్రోటో ఐయొ దేటస్-200ను ఒక్క 15 దినములు రెండుపూటల వాడవలెను. దీని తరువాత ఏసిడ్ నూట్రిక్-200ను వాడవలెను. కొంతమందికి శిశ్నాగ్ర భాగముమీద గలచర్మము (Fore Skin) వెనుకకు రాదు. దీనిని "PHIMOSIS" అంటారు. ముందుకు రాకపోవుటను "PARAPHIMOSIS" అంటారు. ఈ రెండింటికీ పై మందులు పనిచేయును.

**సవాయి సెగ వలన రక్తముచెడి, చర్మము మీద మచ్చలు వచ్చుట:** జకరాండా -g మరియు ఎఖినేషియా-gలను కొన్ని నెలలపాటు వాడవలెను. ఈ రెండును మదర్ టించర్ రూపములో బాగాపనిచేయును. (10బొట్లు అరఔన్స్ నీటిలోకలిపి త్రాగవలెను).

**జననేంద్రియములమీద వచ్చు పులిపిర్లు :** తూజా-200ను ప్రతిదినము రెండు పూటలా పూటకు మూడు మాత్రల చొప్పున కొంతకాలము వాడవలెను.

**సెగస్రావము ఉన్న :** పై దానితో మెడోరినమ్-1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లు వాడవలెను. పై వ్యాధులన్నిటిలోను అప్పు డప్పుడు సల్ఫర్ 30ని 3 మోతాదులు వేయుట మంచిది.

## స్త్రీ మర్మావయవ మండలము వ్యాధులు-ఔషధములు

### గర్భాశయము బయటకు వచ్చుట

**బహిష్టు సమయములో :** పల్సటిల్లా-200ను 3 పూటల రోజు మార్చి రోజు ఒకవారమువాడి, ఒకవారము ఆపవలెను. గుణము కనిపించకపోతే 1mను ఒక్క మోతాదు వేయవలెను. దీనితరువాత సెపియాను పైవిధము గానే వాడవలెను. కాల్కేరియా ఫాస్-6×, కాల్కేరియా ఫ్లోర్-6×లను

ప్రతిదినమూ రెండుపూటల రెండింటినీ కలిపి ఒకనెలపాటు వాడవలెను.

**మలవిసర్జన సమయములో :** పోడోఫైలమ్-200ను రోజూ రెండు పూటలా ఒక వారము దినములు వాడవలెను.

**మూత్ర విసర్జనసమయములో :** కాల్కేరియా ఫాస్-12×ను రెండు పూటల ఒక నెలరోజులు వాడవలెను.

**ప్రసవించిన పిమ్మట :** పోడోఫైలమ్-200+పల్స్-200లనుగానీ లేదా ఒకదాని తరువాత వేరొకదానిని గాని దినమునకు ఒకసారి చొప్పున ఒక నెల రోజులు వాడవలెను.

**బరువులు ఎత్తునపుడు:** పైవిధముగానే రుస్టాక్స్-200, పోడో ఫైలమ్-200, కాల్కేరియా కార్బ్-200 అను మందులను వరుసక్రమములో దినమునకు 2 పూటలా వాడవలెను.

## సంతానము కలుగక పోవుట



దీనినే "వంధ్యత్వము లేదా గొడ్రాలితనము" అంటారు. ప్రథమములో సల్ఫర్-30ని మూడుపూటల 3 మాత్రలచొప్పున 3 దినములు వాడి, ఆపిన తరువాత ఒకనెల దినములు చూడవలెను. అంటే ఋతుస్రావము అవకుండా ఉంటే (నెలసరి లేకపోతే) వేరే మందు అక్కరలేదు. బహిష్టుఐతే మాత్రము స్రావము ఆగినతరువాత కాల్కేరియా కార్బ్-200ను 3 పూటలు వాడి, నెల ఆగి, మరల ఋతువును చూచుకొని నేట్రమ్‌కార్బ్-200ను 3 మోతాదులు వాడవలెను. ఈ మధ్య కాలములో నేట్రమ్ మూర్-12×ను దినమునకు 2సారులు చొప్పున వాడుతూనే ఉండవలెను.

**గర్భసంచి బలహీనత వలన :** ఎలట్రిస్ ఫెరినొసా మదర్ టించర్‌ను 2పూటల ఒక అరఔన్స్ నీటిలో 5 బొట్లు కలిపి వాడవలెను.

## గర్భాశయము నుండి రక్తస్రావము

**బహిష్టుకు బహిష్టుకుమధ్య :** సల్ఫర్-30ని 3మోతాదులువాడి, ఒక వారము తరువాత కాల్కేరియా కార్బ్-30ని 3 పూటల 3డోస్‌లు వాడవలెను.

**వృద్ధురాండ్రకు :** కాల్కేరియా కార్బ్-30ని 3డోస్‌లు వాడి, ఫెర్రమ్‌ఫాస్-30ని రోజుకు 3 పూటలా ఒక నెలరోజులపాటు వాడవలెను.



**గర్భాశయము నుండి ఎఱ్ఱని రక్తస్రావములు:** బెల్లడోన-30ని రోజూ 3 పూటలా 3మాత్రల చొప్పున తగ్గేవరకు వాడవలెను. దీనితో మిల్లి ఫోలియమ్ మదర్ టించర్‌ను 10బొట్లు ఒక అర ఔన్స్ నీటిలో కలిపి వాడవలెను.

**ముట్లుడుగు కాలములో గర్భాశయము నుండి రక్తస్రావము :** ముందుగా సెపియా-200ను 3 పూటలా 3డోస్‌లు వాడి, తరువాత సల్ఫర్-30ని 3పూటలా 3 డోస్‌లు వాడవలెను.

**సంభోగానంతరము గర్భాశయము నుండి రక్తస్రావము :** క్రియోసోటమ్-200ను 3పూటల 3డోస్‌లు వాడి, తగ్గకపోతే ఒక 10 దినముల తరువాత 1m ను ఒకడోస్ వాడవలెను.

**అన్ని విధము లైన గర్భాశయ రక్త స్రావములు :** లూజుగా, విస్తారముగా అవుచున్నచో ఫాస్ఫరస్-200ను ఒకడోస్‌వేసి చూడవలెను. తరువాత 1m ను ఒకడోస్ వాడవలెను. స్రావము అధికముగా ఉంటే ఫెరమ్‌ఫాస్-30ని గంటకు 3మాత్రల చొప్పునగానీ లేదా 3 పూటలాగానీ తగ్గే వరకు వాడవలెను.

**ముద్దలు ముద్దలుగా గర్భాశయము నుండి రక్తస్రావము :** బెల్లడోనా-200ను 3 పూటల 3డోస్‌ల చొప్పున 3 దినములు వాడవలెను. ఆగకపోతే సెబినా- 200ను 3పూటల 3 దినములు వాడవలెను. వీటితోపాటు కాల్కేరియాఫ్లోర్-30ని 3పూటలా వాడుతూనేఉండవలెను. బిడ్డకుస్తన్యము నిచ్చునపుడు సైలీషియా- 200ను 3 పూటలు వాడవలెను.

## బహిష్టు లోపములు

**బహిష్టు ఆలస్యముగా అగుట :** సెపియా-30 లేదా 200ను పూటకు 3 మాత్రల చొప్పున 3రోజులువాడి ఆపవలెను. ఒక వారము ఆగి, 1mను ఒక డోస్ వేయవలెను. దీనికి తరువాత పల్స్-200 మరియు 1m లను పైవిధముగానే వాడవలెను. మధ్యమధ్య సల్ఫర్-200ను ఒకడోస్ వేయవలెను.

**బహిష్టు ముందుగానేఅగుట:** సల్ఫర్-200ను ఒకడోస్‌వేసి, తరువాత కాల్కేరియా కార్బ్-200ను ఒక్క వారము రోజులు 3 పూటల 3డోస్‌లను వేయ వలెను.

**గర్భసంచి బలహీనత వలన బహిష్టు ముందుగా అగుట:** ఎలట్రిస్‌ఫెరినోసా మదర్ టించర్‌ను రెండుపూటల అర ఔన్స్‌నీటిలో 10బొట్లు చొప్పున కలిపి వాడవలెను.

**బహిష్టు అణగి ఉండుట:** పల్స్-1m ను వారమునకు ఒకడోస్ చొప్పున 3 వారములు వాడవలెను. దీనితరువాత సెపియా-1m పై విధముగానే వాడవలెను.

**భయమువలన అణగియుండుట:** ఎకోనైట్-200ను 3మోతాదులు వాడవలెను.

**ఋతుస్రావము-ఆగుట-వెడలుట :** క్రియోసోటమ్-200ను3పూటలు వాడ వలెను.

**పరుండినపుడు ఋతుస్రావము అగుట:** లిలియమ్ టిగ్రినమ్-200ను 3పూటలు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**దుర్వాసనతో, కుళ్ళిన, వాసనతో, పుల్లని వాసనలతో బహిష్టు స్రావమగుట:** సల్ఫర్-1mను ఒక్క మోతాదు వేయవలెను. ఋతుస్రావము అసహజముగా మరొక ద్వారము నుండి (ముక్కు,ఆసనము, చెవిమున్నగు ద్వారముల నుండి రక్తస్రావము) ఐతే బ్రైయోనియా-200ను 3 పూటలా 3 డోస్‌లువాడి, 15 దినములు తరువాత 1mను ఒకమోతాదు వాడవలెను. రక్తస్రావము నోటినుండిఐతే ఫాస్ఫరస్-200ను దినమునకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లు వాడి ఆపవలెను.

**బహిష్టు స్రావము-పగలు ఆగి, రాత్రి యగుట:** పల్స్-200ను 3పూటలా 3డోస్‌లు వాడవలెను.

**బహిష్టు స్రావము-పగలు ఆడి, రాత్రి యగుట:** పల్స్-200ను 3పూటలా 3డోస్‌లు వాడవలెను.

**బహిష్టు స్రావము రాత్రిపూట యగుట:** అమోనియమ్ కార్బ్-200ను 3 పూటల 3డోస్‌లు వాడవలెను.

**నల్లని ఋతుస్రావము :** సెకెల్ కోర్నుటమ్-30ని పూటకు 3 మాత్రల చొప్పున 3 పూటలు వాడి ఆపవలెను. తరువాత గుణము కనిపించని పక్షములో 1m ను ఒకడోస్ వాడవలెను.





**ఎఱ్ఱని ఋతుస్రావము :** బెల్లడోనా-30ని రోజూ 3 పూటలా 3మాత్రల చొప్పున ఋతుస్రావము తగ్గువరకు వాడవలెను. దీనితోపాటు ఫెర్రమ్ ఫాస్30ని కూడా వాడవచ్చును.

**బహిష్టు స్రావము విస్తారముగా యగుట:** ఫాస్ఫరస్-200ను ఒకడోస్ వేసి, ఫెర్రమ్ ఫాస్-6×ను ప్రతిదినము 3 పూటలా వాడవలెను.

**ఋతుశూల :** ఋతుశూలకు మెగ్నీషియాఫాస్-30 లేదా 200 ప్రధానమైన మందు. మెగ్నీషియా ఫాస్-30లేదా 200ను గంటకు 3మాత్రల చొప్పున నొప్పి తగ్గువరకు వాడవలెను. నొప్పి తీవ్రముగా ఉన్నచో 15 నిమిషలములకు ఒకసారి వాడవచ్చును. దీనితో గుణము కనిపించిని ఎడల జాంతో జైలమ్-30లేదా 200ను పై విధముగానే వాడవలెను. నొప్పి-తెరలు తెరలుగా వస్తూ ఉన్నా, శరీరమును వేడిగా ఉన్నా బెల్లడోనా-30ని లేదా 200ను పైవిధముగానే వాడవలెను.

**ఋతుశూల ప్రసవ నొప్పుల వలె వచ్చుట:** సిమిసి ఫ్యూగా-30ని పూటకు 3మాత్రల చొప్పున4 పూటలు వాడవలెను. కాలోఫైలమ్-30, వైబర్నమ్-Q లను కూడా వాడవచ్చును. (వైబర్నమ్-Q ను నీటిలో కలిపి వాడవలెను).

**ప్రథమరజస్వల ఆలస్యముగా అగుట:** పల్స్-1mను వారమునకు ఒక మోతాదుల చొప్పున 3 వారములు వాడవలెను. ప్రతిదినము కాల్కేరియా ఫాస్6×ను ఒక నెలవాడవలెను. మధ్యలో ఒక్కసారి సల్ఫర్-1mను ఒకడోస్ వేయవలెను.

**హస్త ప్రయోగాది అలవాట్ల వలన ఋతుశూల:** ఒరిగానమ్-200ను పూటకు 3మాత్రల చొప్పున వాడవలెను.

## వైట్ డిశ్చార్జ్ (కుసుమ)

**బట్టలు చిల్లులు పడే కుసుమ :** ఐయోడియమ్-200ను ఓ 3డోస్‌లు వాడవలెను.

**తెల్లగా పాలవలె కుసుమ స్రావము:** పల్సటిల్లా-30ని పూటకు 3 మాత్రల చొప్పున 3 పూటలు వాడి, కాల్కేరియాఫాస్-6×ను ప్రతిదినము 2సార్లు చొప్పున ఒక నెలపాటు వాడవలెను. దీనితరువాత సల్ఫర్-200ను 1 మోతాదువాడి, తరువాత కాల్కేరియా కార్బ్-30ని 3పూటలా 3మాత్రల చొప్పున వాడవలెను.

**మాంసము కడిగిన నీరువలె కుసుమ స్రావము :** నైట్రిక్ ఏసిడ్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున 3 రోజులు వాడవలెను.

**చిక్కని కుసుమ స్రావము :** అల్యూమినా-30 లేదా 200ను 3 పూటలా 3మాత్రల చొప్పున వాడవలెను. ఒక వారము ఆగి 1m ను ఒకడోస్ వేసిన తగ్గిపోవును.

## కుసుమ స్రావము వివిధ రంగులలో యగుట

**ఆకుపచ్చ :** నేట్రమ్ సల్ఫ్-30
**పసుపుపచ్చ:** హైడ్రాస్టిస్-30. ఇది ముద్దగా ఐతే: ఏంటిమ్ క్రూడ్-30.
**రక్తకుసుమ:** సెపియా-30 లేదా 200,
కాల్కేరియాసల్ఫ్-30 లేదా 200.
**చీమువలె స్రావము :** కాలీసల్ఫ్-30
**సెగ సంబంధమైన స్రావము:** పల్సటిల్లా-30.
**చిక్కగా తీగవలె స్రావము :** ఎసారమ్ యూరోపియమ్-30.

పై మందులనువాటి లక్షణములను బట్టి పూటకు 3 మాత్రల చొప్పున రోజూ 3 పూటలా 3రోజులు వాడితే కుసుమలుతగ్గి పోవును. వీటితో బార్లీనీరు, గ్లూకోజ్‌వాటర్, మజ్జిగ, కొబ్బరినీరు మొదలగు చలువ పదార్థములనువాడుతూ, మసాలాదినుసులు, పచ్చళ్ళు, వేడిచేయు పదార్థములను మానివేయవలెను. డెట్టాల్ లోషన్‌తో వజైనా(Vagina)ను శుభ్ర పరుస్తుండవలెను. చిన్నపిల్లలకు కూడా ఈ కుసుమ వ్యాధి ఉంటుంది. వారికి పై మందులను పై విధముగానే వాడవలెను.

## మర్మావయవము దురద

**బహిష్టుకు ముందు:** సల్ఫర్-30ని పూటకు 3 మాత్రల చొప్పున 3 దినములు వాడవలెను.

**బహిష్టులో దురద :** పెట్రోలియమ్-30ని వాడవలెను.

**బహిష్టుకుపిమ్మట దురద:** ఏసిడ్ నైట్రిక్-30ని పై విధముగానే వాడవలెను.

**ఆపుకోలేనంతటి దురద :** ఏమ్బ్రా గ్రీషియా-30, ఎగేరికస్-30లను పై విధము గానే 3 పూటలా 3డోస్‌లు వాడవలెను. పైమందులతో పాటుగా ప్రతిరోజు 3పూటలా 10బొట్లుచొప్పున ఒక అరఔన్స్ నీటిలో కలిపి ఎఖినేషియా మదర్ టించర్‌ను వాడవలెను.





**తొడల మధ్య భాగము(గజ్జల)లో ఒరిపిడి:** గ్రాఫైటిస్-30ని 3డోస్‌లు వాడవలెను. పైకి క్యాలెండులా పౌడర్‌ను చల్లుకోవలెను.

**గర్భాశయమువాచుట లేదా పెద్దది యగుట :** కాలీఐయోడ్-30ని 3 డోస్‌లు వాడవలెను. గుణము కనిపించని ఎడల సెపియా-30 లేదా 200ను 3డోస్‌లు వాడవలెను.

**గర్భాశయము స్వస్థానము తప్పుట:** సిమిసిఫ్యూగా-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పున 3రోజులు వాడవలెను. దీనితో నేట్రమ్‌మూర్-30ని 2 పూటలా వారము రోజులు వాడవలెను.

**యోనిలోపల గరుకు పొక్కులు :** ఏసిడ్ నైట్రిక్-30ని 3డోస్‌లు వాడవలెను.

**యోనిలోపల వెచ్చగా వుంటే:** బెల్లడోనా-30ని 3 పూటలా వాడవలెను.

**మర్మావయవముమీది వెంట్రుకలు ఊడిపోవుట:** ఏసిడ్ నైట్రిక్-1m ను ఒకడోస్ వేయవలెను.

## సంభోగేచ్ఛ

**రాత్రిపూట ఎక్కువ :** మూడు మాత్రల చొప్పున నక్స్-30ని 3రోజులు వాడ వలెను. తరువాత ఒరిగానమ్-30ని ఒక వారముపాటు 2 పూటలు 3మాత్రల చొప్పున వాడవలెను.

**బహిష్టు ముందు ఎక్కువ:** కాల్కేరియాఫాస్-30ని ప్రతిరోజు 2 పూటలా 3మాత్రల చొప్పున ఒక వారము వాడవలెను.

**బహిష్టులో ఎక్కువ :** ఒరిగానమ్-200ను 3 పూటల 3 డోస్‌లు వాడవలెను.

**ముసలివారికి ఎక్కువ:** మోస్కస్-30ని ప్రతిరోజు 2పూటలా మూడు మాత్రల చొప్పున కొన్ని రోజులు వాడవలెను.

**కన్యలకు (పెండ్లికాని యుక్తవయస్సు వారికి)ఎక్కువ:** కోనియమ్-200ను 3 రోజులు రోజూ 2 పూటలా వాడవలెను. దీని తరువాత ప్లాటినమ్30ని3 రోజులు రోజూ 2పూటలా వాడవలెను.

**వితంతువులకు ఎక్కువ:** ఒరిగానమ్-200ను పై విధముగానే వాడ వలెను.

**సంభోగవాంఛ తగ్గుట:** ఏగ్నస్ కెస్టస్-Q ను ప్రతిరోజు ఉదయము 10 బొట్లు, రాత్రి 10బొట్లుచొప్పున అర ఔన్సునీటిలో కలిపి, కొంతకాలము వాడవలెను. దీనితో నేట్రమ్‌మూర్-30ని రోజుకు ఒకసారి వాడవలెను.

**గర్భాశయము ముడుచుకొని పోవుట:** పల్స్-200ను ఒకరోజు 3 పూటలా 3 డోస్‌లు వాడవలెను.

**సంభోగము బాధాకరముగా నుండుట:** ప్లాటినమ్-30ని 2 పూటలా పూటకు 3మాత్రల చొప్పున కొంతకాలము వాడవలెను.

**సంభోగము సుఖముగా ఉండకపోవుట:** ఫెర్రమ్‌మెట్-6×ను ప్రతిరోజు 3సార్లు వాడవలెను. దీనితో నేట్రమ్‌మూర్-12×ను 2 పూటల కొంత కాలముపాటు వాడవలెను.

## గర్భిణి-ప్రసవ వేదన-ప్రసవము బాధలు-మందులు

**బిడ్డ అడ్డము తిరుగుట:** ఈ సమయములో ప్రసవ నొప్పులు ఆగితే పల్స్ 30ని-ప్రతి 15 నిమిషముల కొకసారి వాడవలెను. అప్పుడు నొప్పులు ప్రారంభ మగును. తరువాత కాలోఫైలమ్-200ను ప్రతి 15 నిమిషలము లకు ఒకడోస్ చొప్పున 3 డోస్‌లువాడి, M.P-30, K.P. లను ప్రతి 15 నిమిషలములకు ఒక్కడోస్ చొప్పున వాడుతూ విస్కమ్ ఆల్బమ్ మదర్ టించర్‌ను ప్రతి 15 నిమిషముల కొకసారి 10 బొట్లు అరఔన్సునీటిలో కలిపి వాడుతుంటే అడ్డము తిరిగిన శిశువు యథావిధిగావచ్చి ప్రసవము జరుగును. దీనికి చాలానిపుణత, అనుభవము కావలెను.

**గర్భాశయము ముడుచు కొనుట లేదా విస్తరించక పోవుటచే ప్రసవ వేదన అధిక మగుట:** కాలోఫైలమ్-200ను ప్రతి15 నిమిషములకు 1డోస్‌వేస్తూ మార్పు కనిపించినా లేదా కనిపించకపోయినా పల్స్-200ను ప్రతి15 నిమిషములకు 1డోస్ వేస్తూ ఉండవలెను. ఒక గంటలో సుగుణము కనిపించకపోతే అనుభవము గల వైద్యునికి చూపించవలెను.

**మాయ వెడలక పోవుట:** పల్స్-200ను ప్రతి 15 నిమిషములకు ఒకడోస్ చొప్పున కొన్ని డోస్‌లు వాడవలెను. దీనితో సైలీషియా-30ని కూడా వాడవలెను.

**నడుములో-విడిచి విడిచి ప్రసవనొప్పులు వచ్చుట:** సెపియా-30ని ప్రతి 15నిమిషములకు 1డోస్ చొప్పున వాడుతుండవలెను.



**ప్రసవపు నొప్పులు ఆగి ఆగి వచ్చుట:** సిమిసి ఫ్యూగా రెసెమోసా (ఏక్టియ రెసెమోసా)-30ని ప్రతి 15 నిమిషములకు 1డోస్ చొప్పున వాడుతూ తరువాత పల్స్-200ను 15 నిమిషలములకు ఒక డోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను. వీటిమీద కాలోఫైలమ్-30 కూడా పనిచేయును. M.P-30, K.P-30 లను కూడా వాడుతూనే ఉండవలెను. 1

**భరించరాని ప్రసవ నొప్పులు:** కెమోమిల్లా-200ను ప్రతి 10 నిమిషము లకు 3 మాత్రలచొప్పున వాడవలెను. నీరసముఉన్న నేట్రమ్‌మూర్-30ని అరగంటకు 3 మాత్రల చొప్పున వాడుతూ ఉండవలెను.

**దొంగ ప్రసవ నొప్పులు:** అంటే నొప్పులు ఉంటాయి. కాని వాటివలన ప్రసవ సంబంధమైన గర్భసంచి విచ్చుకొనుట,శిశువు బయటకు నెట్టబడుట జరుగదు. వీటినే "వేడినొప్పులు" అంటారు. అప్పుడు గ్లూకోజ్‌నీరు, కొబ్బరి నీరు, పంచదారకలిపిన నీటినిగాని త్రాగించి, విశ్రాంతినిచ్చినపుడు నొప్పులు ఆగితే... వీటిని 'వేడి నొప్పులు' అనుకొనవలెను. ఈ టైమ్‌లో 'ఎనిమా'ను చేయించుట కూడా చాలాఅవసరము. ఎనిమానుచేయించినను, పై ఉప చర్యలు చేసినను గుణము కనిపించని ఎడల బెల్లడోనా-30ని, ప్రతి 15 నిమిషములకు ఒక డోస్ చొప్పున కొన్ని మోతాదులు వాడి చూడవలెను. దీనితోపాటుగా కాలిఫాస్ 6×, మెగ్నీషియమ్ ఫాస్-6×లను 2 గిద్దలనీటిలో కలిపి, ప్రతి 5 నిమిషలములకు ఒకసారి త్రాగించు చుండవలెను. కాలో ఫైలమ్-30 కూడా పనిచేయును.

**గర్భిణికి సంభోగవాంఛ పెరుగుట (ప్రసవానంతరము కూడా ఇదే పనిచే యును):** ప్లాటినమ్-200ను రోజుకు 3డోస్‌ల చొప్పున కొంత కాలము వాడవలెను.

**ప్రసవానంతరము రక్తస్రావము:** కాల్కేరియా ఫ్లోర్-30ని ప్రతి 3 గంటలకు 3 మాత్రలు వాడవలెను. ఎక్కువ స్రావము అయితే మిల్లి ఫోలియమ్ మదర్ టించర్‌ను ప్రతి 15 నిమిషములకు అర ఔన్స్ నీటిలో 10 బొట్లు చొప్పున కలిపివాడవలెను. రక్తస్రావము ఆగనిచో నైపుణ్యముగల వైద్యుని సంప్రదించ వలెను. ప్రసవించిన తరువాత వెంటనే మాయ పడితే నీరసము లేకుండా ద్రవ పదార్థములను ఇవ్వాలి. (వేడినీటిలోపటిక బెల్లమును, కొద్దిగా తేనెను కలిపి త్రాగించాలి). కాఫీ, టీలను వేడివేడిగా ఇవ్వవచ్చును. నేట్రమ్‌మూర్6× పౌడర్‌ను ఒకగిద్ద నీటిలో కొద్దిగావేసి త్రాగించవలెను. ఆర్నికా-200ను 4రోజులు 3పూటలా 3మాత్రల చొప్పున వాడ వలెను. అసఫోటెడా-200ను

4రోజులు 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను. శక్తి వచ్చుటకు 5ఫాస్-6×, ఆల్ఫాల్ ఫాలను రోజుకు 1 టాబ్లెట్ చొప్పున ఒక నెలపాటు వాడవలెను.

**ప్రసవము తరువాత జ్వరము :** ఫెర్రంఫాస్-200 మరియు బెల్లడోనా-30 వీటిని గూర్చి మార్చి ప్రతి 3గంటలకు 3 మాత్రల చొప్పున జ్వరము తగ్గువరకు వాడవలెను.

**గర్భిణిలో మర్మావయవము దురద:** సెపియా-200ను 3డోస్‌లు 3పూటలా వాడి, తగ్గకపోతే ఏసిడ్ నైట్రిక్-200ను 3డోస్‌లు పై విధముగానే వాడవలెను.

## వివిధ రకముల గర్భస్రావములు

**భయము వలన:** ఎకోనైట్-30ని 3 పూటల 3 మాత్రల చొప్పున వాడవలెను.

**దుఃఖమువలన :** ఇగ్నేషియా-30ని 3 పూటల 3 మాత్రల చొప్పున వాడవలెను. వీటితో నేట్రమ్‌మూర్-30ని, ప్రతి 3గంటలకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**దెబ్బతగులుట వలన :** ఆర్నికా-200ను ప్రతి 3 గంటలకు 3 మాత్రల చొప్పున 4డోస్‌లను వేయవలెను. ఆగునట్లు లేకపోతే, 1m ను ఒకడోస్ వాడవలెను.

**అధిక పరిశ్రమ వలన :** రుస్టాక్-200ను ఓ 3 పూటలు 3 మాత్రల చొప్పున వాడవలెను. దీనితో M.P-30, K.P-30, N.S-30 లను రోజూ 3 పూటలా 4 రోజులు వాడవలెను.

**సంతోషము వలన :** కాఫీ-200ను 3డోస్‌లు వాడవలెను.

**చివరి నెలలో కలుగు రక్తస్రావము, గర్భస్రావము :** సెకెల్-30,

**రివాజుగు గర్భస్రావము (గర్భము పోతున్న) :** సెపియా-30ని-3 పూటలా 3డోస్‌లు చొప్పున 4 రోజులకు ఒకసారివాడి; నెలతప్పిన దగ్గర నుండి 5 Phos-6×ను ప్రతిరోజు 3 పూటలా వేడినీటితో వాడవలెను. దీనితో G.F.-6×, N.M.-6× లను కూడా వాడవలెను.

**గర్భకోశము విస్తరించక గర్భస్రావము :** ప్లమ్‌బమ్-30ని రెండు పూటలా పూటకు మూడు మాత్రల చొప్పున నాలుగు రోజులు వాడవలెను. తరువాత కాల్కేరియా ఫ్లోర్-6×ను 4వ నెలవరకు ప్రతిరోజూ రెండుపూటలా వాడవలెను.



**ఋతుస్రావము-అధికముగా కనిపించి; గర్భస్రావము జరుగుట:** కాల్కేరియా కార్బ్-30ని 3పూటలా 3డోస్‌లు వాడవలెను.

## గర్భస్రావమును-నివారించు ప్రక్రియలు

**మొదటినెల:** వెబర్నమ్ ఓప్యులస్-Q ను ఉదయము 10 బొట్లు, రాత్రి 10 బొట్లు చొప్పున అర ఔన్స్‌నీటిలో కలిపి, రోజూ త్రాగుతూ ఉండవలెను.

**రెండు-మూడు మాసములు :** సెబినా-30ని రోజూ రెండుపూటలా పూట కు 3 మాత్రల చొప్పున 4 రోజులు వాడాలి. సిమిసి ఫ్యూగా-30ని 3 పూటలా 3 మాత్రలచొప్పున రోజూ వాడవలెను.

**నాలుగవ మాసము :** సల్ఫర్-200, కాల్కేరియా కార్బ్-200లను ఒకరోజే 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**ఐదు మొదలు ఏడవ మాసము వరకు :** సెపియా-200ను ఒకరోజే 3 పూటలా 3డోస్‌లు వేసి ఆపవలెను.మధ్యమధ్య రూటా-200ను కొన్ని మోతాదులు వాడవలెను.

**ఆఖరి మాసము :** ఓపియమ్-200నుఒక్కరోజే 3 పూటలా 3డోస్‌లు వాడ వలెను. ఈవిధముగా నెలతప్పిన దగ్గఅనుండి వాడవలెను. ఇలా వాడుటవలన ఎటువంటి అవాంతరపరిస్థితులు ఏర్పడకుండా సుఖప్రసవము జరుగును. 6వ మాసము వరకు Five Phos 6×,K.P -6×, M.P. 6×లను మాత్రమే ప్రసవించు వరకు వాడవలెను. (కాల్కేరియా ఫాస్‌ను 6వనెల తరువాత వాడరాదు)

**గమనిక :** ప్రసవానంతరము గర్భకోశము పూర్వస్థితికి ముడుచు కొనుటకు, రక్తపు కుదుపులను, మాయను బయటకు వెడలించుటకై ప్రకృతిచేయు యత్నము వలన నొప్పులు ఉంటాయి. కనుక వాటిని వెంటనే ఆపరాదు. బాలింతను గాలి, వెలుతురువచ్చు ప్రదేశములలో ఉంచవలెను. వేడినీటితో రోజూ స్నానమును చేయించవలెను. బలమునకు మంచి ఆహార మును వాడవలెను. నడుమునకు, పొత్తికడుపుకు గట్టిగా కట్టుకట్టిన పొట్ట త్వరిత గతిని లోపలకుపోయి, పొట్ట పెరుగదు.

## స్తనముల లోపములు మందులు

శిశువు చనిపోయినా లేదా తల్లిపాలలో దోషముఉన్నా లేదా అవసరము కంటే పాలఉత్పత్తి అధికముగాఉన్నా పాలు ఇగిరిపోవుటకు (తగ్గిపోవుటకు) : లెకెసిస్-200ను ప్రతిరోజు 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను. ("అందము తగ్గిపోతుంది"అని అనవసర ముగా పాలను పిల్లల కివ్వకుండా తగ్గించుట మంచిదికాదు. శిశువుకు తల్లిపాలకు మించిన శ్రేష్ఠమైన ఆహారము మరొకటి లేదు. అంతేకాక శిశువుకు తల్లికి ఒకరిమీద ఒకరికి మమత కూడా పెరుగుతుంది.

## స్తనములలో గడ్డలు

**స్తనములు గట్టిగా రాయివలె ఉండి స్పర్శను సహించలేకపోవుట :** కోనియమ్- 200ను రోజుకు3 పూటలు చొప్పున 3రోజులువాడి, తరువాత కాల్కేరియా ఫ్లోర్-6×ను ఒకనెలపాటు వాడవలెను. ఫైటోలక్కా మదర్ టించర్ను వాడినా కూడా స్తనములలో గల గడ్డలు కరుగుతాయి. (ఆపరేషన్ అవసరము ఉండదు). ఫైటోలక్కా మదర్ టించర్ను-అర ఔన్స నీటిలో 10 బొట్లు చొప్పున కలిపి, రోజూ 3పూటలా కొంతకాలము వాడవలెను.

**స్తనముల నొప్పి లేదా వాపు :** బెల్లడోనా-30ని మూడు పూటలా 3రోజులు వాడి; తగ్గని ఎడల కాల్కేరియా కార్బ్-30ని 3డోస్లు వాడవలెను.

**ఋతుకాలములో నొప్పివాపు :** కోనియమ్-200ను 3డోస్లు 3 పూటలా వాడవలెను.

**ముట్టు ఉడిగిన కాలములో నొప్పి :** శాంగ్వినేరియా-200నురోజూ 3 పూటలా 3 డోస్లు చొప్పున కొంతకాలము వాడవలెను.

**చనుకుదురు :** ఎకోనైట్-30, బెల్లడోనా-30లను ఒకదాని తరువాత ఒకటిగా 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను. ఫైటో లక్కా-30 కూడా పనిచేయును.

**స్తనములు సరిగా ఎదగక పోవుట :** బ్రైయోనియా-30ని కొంతకాలము, తరువాత 200ను కొంతకాలము వాడవలెను. గుణము కనిపించకపోతే లైకోపోడి యమ్-30, సెబాల్ సెర్రులేటా-30లనుఒకటి తరువాత ఒకటిగా రోజూ రెండు పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.(స్తనములు ఎండిపోయినా ఈ మందులు పనిచేయును)





**స్తనములలో కురుపు :** సైలీషియా-200, కాల్కేరియా సల్ఫ్-200లను ప్రతిరోజు 3పూటలా వాడవలెను. బాధ ఎక్కువగా ఉంటే బెల్లడోనా-200ను ప్రతి 3 గంటలకు 3 మాత్రల చొప్పున కొన్ని మోతాదులు వాడి; తరువాత హెపార్ సల్ఫ్-1m ను ఒక డోస్ వాడవలెను.

**స్తనముల నుండి పాలకు బదులుగా రక్తస్రావము :** ఫాస్ఫరస్-200ను 3 మోతాదులు 3 పూటలా వాడవలెను.

**చన్మొనలు పగులుట :** మంటుంటే ఆర్సెనికమ్ ఆల్బ్-200లను మూడు పూటలా 3డోస్లు వాడవలెను. పగిలి, పుండ్లు పడితే గ్రాఫైటిస్-30ని 3డోస్లు 3 పూటలా వాడి, పైకి క్యాలెండులా పౌడర్ను వాడవలెను. CP-6×ను రోజుకు 3 పూటలా పూర్తిగా తగ్గేవరకు వాడవలెను. ఏసిడ్ నైట్రిక్-200ను రోజుకు 3 డోస్లు 3 పూటలా వాడవలెను.

## సంభోగ అవరోధములు మందులు



**యోని రంధ్రము చిన్నదిగా ఉండి రతి సహించక బాధ :** దీనికి ప్లాటినమ్ని 200 పవర్లో రోజుకు 3పూటలా 3 మాత్రలచొప్పున వాడవలెను.

**యోని ద్వారము పొడిగా ఉండి, రతి మంటగా ఉండుట :** నేట్రమ్ మూర్-200ను 2పూటలా 3 మాత్రల చొప్పున కొంతకాలము వాడవలెను.

**క్లిటోరిస్కు, యోనిపెదవులకు సహనశక్తి లేకపోవుట :** హెపార్సల్ఫ్-200ను 2పూటలా 3 మాత్రలచొప్పున కొన్ని డోస్లు వాడవలెను.

**సంభోగము నందు తాళలేక పోవుట లేదా రక్తస్రావము జరుగుట :** క్రియోసోట్రమ్-200లను రెండు పూటలా 3 మాత్రల చొప్పున కొంత కాలము వాడవలెను. 'నా స్వానుభవములో పై మందులును -1m పవర్లో వాడగా మంచి గుణము కనిపించెను. - **రచయిత**)

## మెడ-నడుము, కాళ్ళు-చేతులు

### లోపములు-బాధలు-నివారణలు

**మోకాళ్ళు,చీలమండ, పాదము, మడమలు వాచుట :** వాచుట లేదా ఎఱ్ఱగా ఉన్న ఆభాగము వెచ్చగా ఉంటే బెల్లడోనా-200ను రోజుకు 3సార్లు వాడవలెను. కదలికల వలన బాధఉంటే బ్రైయోనియా-200ను రోజూ 3 పూటలా 3మోతాదులు వాడవలెను. కూర్చుని లేచునపుడు, కొంత విశ్రాంతి

తీసికొన్ని తరువాత బాధలు ఎక్కువగా ఉంటే రుస్టాక్స్-200ను రోజూ 3పూటలా 3 మోతాదులు వాడవలెను.

**అరికాలు వాచుట :** పల్స్-30ని 3పూటలా 3డోస్‌లు వాడవలెను.

**వ్రేళ్ళు వాచుట:** కుప్రమ్‌మెట్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను. M.P. -30లను, K.P -30లను 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను.

**భుజములు వాచుట:** పెట్రోలియమ్-30ని వాడాలి.

**మణికట్టు వాచుట:** కాల్కేరియా సిలిసికా-30 లేదా రుస్టాక్స్-30ని 3 పూటలు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**తిమ్మిరి ఎక్కుట :** రుస్టాక్స్-30ని 3పూటలే 3డోస్‌లు వేసి, ఒక వారము తరువాత 20లను 3డోస్‌లువాడి, గుణము పూర్తిగా కనిపించని ఎడల 1m ను ఒకడోస్ వేయవలెను. దీని తరువాత కోలోసింథిస్-200లను పై విధముగానే వాడుతూ M.P. -6×, K.P -6×లనుప్రతిరోజు 3 పూటలా వాడవలెను.

## మెడ-నడుము, కాళ్ళు-చేతుల బాధలు లేదా నొప్పులు

**ఉదయము నిద్ర లేవగానేగాని, రాత్రి విశ్రాంతి టైమ్‌లోగాని :** రుస్టాక్స్-30ని ఒకరోజు 3 సారులుగా 3 మోతాదులు వాడవలెను.

**రాత్రిపూట మాత్రమే ఉన్నచో :**సల్ఫర్-30ని ఒకడోస్ మాత్రమువాడి, తరువాత బెల్లడోన-30ని రోజూ3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను.

**సాయంకాలంపూట ఉన్న :** అర్సెనికమ్ ఆల్బ్-200లను 3డోస్‌లు ఒకరోజు వాడి ఆపవలెను.

**ఒకసారి కాళ్ళలోను, ఒకసారి చేతులలోను ఉన్న:** మెర్క్యూబిన్ ఐయోడేటస్-30ని మూడుపూటల 3మాత్రల చొప్పున కొంతకాలము వాడవలెను.

**ఆహారము తీసుకున్న తరువాత ఉన్న :** బ్రైయోనియా-30ని 3పూటలా 3 మోతాదులు వాడవలెను.

**బహిష్టు సమయములో ఉన్న :** సిమిసి ఫ్యూగా (Cimici Fuga) -30 లేదా బెల్లడోనా-30ని 3 గంటలకు 3 మాత్రల చొప్పున కొన్ని డోస్‌లు వాడవలెను.



**కదలికల వలన బాధలుఎక్కువైతే :** బ్రైయోనియా -30ని 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**వెచ్చదనము వలన ఉద్రేకించిన :** ఫెర్రమ్‌ఫాస్-6×నుప్రతిరోజు రోజుకు 3 పూటల వాడవలెను.

**వెచ్చదనము వలన ఉపశమనము:** మెగ్నీషియాఫాస్-6×ను 3 పూటలు వాడవలెను. ఆర్సెనికమ్ ఆల్బ్-200ను ఒక్కరోజు మూడు పూటలా 3డోస్‌లు వాడవలెను.

**నొప్పులు మారుచుండిన :** కాలీసల్ఫ్-30ని ఒకరోజు 3పూటలా 3డోస్‌లు వాడవలెను. పల్స్-30ని ఒకరోజు 3సారులు సారికి 3 మాత్రల చొప్పున వాడవలెను.

**ఎముకల నొప్పులు :** యూపటోరియమ్ పెర్ఫ్-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పునవాడవలెను. దీనికినీ తగ్గని ఎడల పైరోజెనమ్-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను. దీని తరువాత రూట-30ని ఇట్లే వాడవలెను.

**సిఫిలిస్ జీర్ణించి యున్న:** ఆరమ్‌మెట్-1mను ఒకడోస్ వాడవలెను. దీనితో కాల్కేరియాఫ్లోర్-6×, కాల్కేరియా ఫాస్-6×లను రెండింటినీ కలిపి వాడవలెను. వీటిని రోజూ రెండు పూటల వాడుటమంచిది.

## పక్షవాతము

కాలీఫాస్-6×,మెగ్నీషియాఫాస్-6×లను ప్రతిరోజు 3 పూటలా కొంత కాలముపాటు వాడవలెను. కాస్టికమ్-200లను రోజూ 3పూటల 3మాత్రల చొప్పున వాడవలెను. ఒకవారము తరువాత కాస్టికమ్-1m ను ఒక్కడోస్ వేయవలెను.

**నీటిలో నానుట వలన పక్షవాతము వచ్చిన :** రుస్టాక్స్-200ను 3 పూటలా 3డోస్‌లు; మణికట్టుకు వచ్చిన: ప్లమ్‌బమ్‌మెట్-200ను రోజూ 3పూటలా 3 మాత్రలు వాడవలెను. కంటిరెప్పలకు వచ్చిన : జెల్సిమియమ్-30ని, 3పూటలా వాడవలెను. కాళ్ళకు, చేతులకు వచ్చిన : నువ్వుల నూనెతో మర్దనచేసి, వేడినీటి కాపడమును పెట్టుట వలన మంచి ఫలితములు కలుగును.

## చెమట

**పాదములకు :** సిలికా(సైలీషియా)-30ని ప్రతిరోజు 3 పూటలా వాడవలెను. వారమునకు ఒకడోస్ చొప్పున జిమ్‌కమ్ మెట్-200ను 3సార్లు వాడి ఆపవలెను.

**నొసట (ముఖము):** ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3పూటలా 3డోస్‌లు వాడి, విరాట్రమ్ ఆల్బ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**చంకలు :** కాల్కేరియాసల్ఫ్-200ను ప్రతిరోజు మూడు పూటలా వాడవలెను. గ్రాఫైటిస్-200ను కూడా వాడవచ్చును.

## శరీరము కొయ్యబారుట

**కొయ్యబారినట్లు శరీరము ఉన్న ఎడల :** సల్ఫర్-30ని ఒక్కడోస్‌వేసి, తరువాత రెండు రోజులకు కాల్కేరియా కార్బ్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను. తగ్గనిచో, కుప్రమ్‌మెట్-200నుగాని, లెడమ్‌పాల్-200ను గాని పై విధముగానే వాడవలెను. M.P 6×ను ప్రతిరోజు 3 పూటలా 3మాత్రల చొప్పున వాడవలెను.

**కంపములతో కొయ్యబారిన :** సిక్యుటావిరోసా-200ను 3 పూటలా 3 మాత్రలచొప్పున కొంతకాలము బెల్లడోనా-200ను 3 పూటలా 3మాత్రల చొప్పున కొంతకాలము వాడి; సల్ఫర్-200లను 3డోస్‌లు వాడవలెను. M.P 6×, K.P 6×లను ప్రతిరోజు రెండు పూటలా వాడవలెను.

**కీళ్ళు బిగబట్టుట:** బ్రైయోనియా-30ని 3పూటల 3డోస్‌లు వేసి, ఒకవారము ఆగి; గుణము కనిపించనిచో-200ను 3 పూటలా 3 మాత్రల చొప్పున కొంతకాలము వాడి;సల్ఫర్-200లను 3డోస్‌లు వాడవలెను. M.P 6×, K.P 6×లను ప్రతిరోజు రెండు పూటలా వాడవలెను.

**మెట్లుఎక్కుట వలన :** అర్సెనికమ్ ఆల్బ్-200లను 3 పూటలా 3 డోస్‌లు వాడవలెను.

**పిల్లలు నడుచుట ఆలస్యముగా నేర్చుకొంటున్న :** 5 ఫాస్-6×, N.M 6×, Sil -6×లను ప్రతిరోజు రోజుకు 3సార్లు వాడుతూ; కాల్కేరియా కార్బ్-30ని 3డోస్‌లు వాడి, ఒకనెల తరువాత 200పవర్‌లో 3డోస్‌లు వాడవలెను.



## గోరులు

దళసరముగా మారుట (ఎండినట్లు ఉండుట): గోరులకు సరిగ ఎదుగుదల లేకపోతే ఏన్టిమోనియమ్ క్రూడమ్-30ని రోజూ 3పూటలా వాడవలెను. సైలీషియా- 12×ను ప్రతిరోజు కొంతకాలముపాటు వాడి, తరువాత గ్రాఫైటీస్ 30ని 3 పూటలా 3డోస్‌లువాడి, ఒకవారము తరువాత 200 పవర్‌లో 3 పూటల 3డోస్‌లు వాడవలెను.

పెళుసుగా ఉండుట, సులభముగా పగులుట లేదా పుచ్చుట: సైలీషియా-30ని 4 రోజులకు ఒకడోస్ వేయుచూ, తూజా-200ను 4రోజులకు ఒక డోస్ చొప్పున 4సారులు వేసి, ఆ తరువాత 15 రోజులకు 1m లో ఒకడోస్ వేయవలెను.

**కాళ్ళు-చేతులు వణకుట**

జెల్సిమియమ్-30ని మూడు పూటలా మూడు మాత్రల చొప్పున మూడు దినములు వాడి; ఒకవారము తరువాత 200ను పై విధముగానే వాడవలెను. దీని తరువాత రుస్‌టాక్స్-30, దీని తరువాత కాస్టికమ్-200 వీటిని పై విధముగానే వాడవలెను. ప్రతిదినమూ 5 Phos 6× ను రోజూ 3 పూటలా N.M -12×ను రోజూ 2 పూటలా వాడవలెను.

## నీరసము

**జీవ పదార్థములు పోయిన తరువాత గానీ, ఏదైన వ్యాధి వచ్చి, తగ్గిన తరువాతగానీ వచ్చు నీరసమునకు:** చైనా-30ని ప్రతిదినము 3సార్లు వాడుతూ; ఆల్ఫాల్ఫా మదర్ టించర్‌ను ఉదయము 10 బొట్లు, రాత్రి 10 బొట్లు చొప్పున అరఔన్స్ నీటిలో కలిపి వాడవలెను. కార్బోవేజ్-200ను వారము నకు 1డోస్ వేయవలెను.

**అమిత నీరసముగాయున్న :** ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3పూటల 3డోస్‌లు వాడవలెను. నేట్రమ్‌మూర్-6×ను రోజూ 3 పూటలా కొంత కాలము వాడవలెను.

**నరములు నీరసముగా యున్న :** 5 Phos -6×ను వాడుట మంచిది.

**బహిష్టులో నీరసము :** కాక్యులస్‌ఇండికస్-30ని 3డోస్‌లు వాడవలెను.

**సంభోగానంతరము నీరసము :** కాల్కేరియాకార్బ్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**శారీరక శ్రమ వలన నీరసము :** రుస్టాక్స్-30ని 3పూటలా 3డోస్‌లు వాడవలెను. ఆల్బ్ మినమ్ ఫాస్పేట్స్ మూత్రము వెంట పోవుచున్నప్పుడు కలుగు నీరసమునకు ఏసిడ్ పిక్రిక్-30ని3పూటలా 3 మాత్రల చొప్పున కొంతకాలము వాడుచూ; 5ఫాస్- 6×ను కూడా వాడుతూ ఉండవలెను.

## గోరుచుట్టు

**మంటగా ఉన్న:** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని వాడవలెను.

**నొప్పి,బాధ ఎక్కువగా ఉన్న :** బెల్లడోనా-30ని వాడవలెను.

**చీము ఎక్కువగా ఉన్నప్పుడు :** సైలీషియా-200ను వాడవలెను.

**గోరుచుట్టు గట్టిగా ఉన్నప్పుడు :** కాల్కేరియా ఫ్లోర్-30ని వాడవలెను. పై గోరుచుట్టు లక్షణములకు పై మందులను రోజుకు 3డోస్‌లచొప్పున తగ్గేవరకు వాడుతూ ఉండవలెను.

**కీళ్ళు, గజ్జలు, వ్రేళ్ళసందుల మధ్య ఒరియుట:** గ్రాఫైటీస్-30ని వాడి, ఆతరువాత 200ను-3పూటలా 3 మాత్రల చొప్పున వేస్తూ; పై పూతకు కొబ్బరి నూనెలో క్యాలెండులా పౌడర్‌ను కలిపి, పైపూతగా వ్రాయవలెను. లేదా పౌడర్‌ను చల్లవలెను.

**తేమతో నానుటచే ఒరియుట:** రుస్టాక్స్-30ని 3పూటలా వాడవలెను. ఒక వారమువాడిన తరువాత 200 పవర్‌లో3పూటలా వాడవలెను. పైకి క్యాలెండులా పౌడర్‌నువాడుతూ ఉండవలెను. దీని తరువాత ఏసిడ్ నైట్రిక్-30, పెట్రోలియమ్- 30లను కూడా వాడి చూడవచ్చును.

**నడుము కొయ్యబారుట :** బ్రైయోనియా-30ని పూటకు3డోస్‌ల చొప్పున 4రోజులు వాడి, గుణము కనిపించని ఎడల 200ను 3 పూటలు వాడి, ఆ తరువాత 4 రోజులకు 1m ను ఒకడోస్ వాడవలెను. దీని తరువాత రుస్టాక్స్‌ను పై విధముగానే వాడవలెను. వీటితో G.F 6×, M.P. -6× K.P 6× వీటిని రోజూ 3 పూటలా ఒక నెలపాటు వాడవలెను.

## వెన్నెముక-విల్లుబద్ద వలె వంగిపోవుట

సామాన్యముగా ఇట్లు 'ధనుర్వాతము'లో జరుగును. ధనుర్వాతము ఐతే దానికి ప్రత్యేక చికిత్సను చేయవలెను. కొన్ని వ్యాధులు లేదా బలహీనత వలన ఐతే కాల్కేరియాఫాస్-6× మరియు కాల్కేరియా ఫ్లోర్-6× వీటిని ప్రతి దినము రెండుసార్లు వాడుతూ, సిక్యుటా విరోసా-200ను 3 పూటలా కొంతకాలము





వాడి, సుగుణము కనిపించిన ఎడల స్ట్రిచ్నినమ్-30ని 3పూటలు 3డోస్‌లు వాడి, తరువాత 200ను 3డోస్‌లు వాడవలెను.

**వెన్నెముక వంకర టింకరగా వంగుట :** G.F. -6×, G.P. -6×లను ప్రతిరోజు 3 పూటలావాడుతూ, కాల్కేరియా సిలిసికా-30ని 3పూటలా 3 మోతా దులు వాడి, ఒక వారము తరువాత 200ను 3 పూటలా వాడి, సుగుణము కనిపించని ఎడల కాల్కేరియా కార్బ్-200ను 3 పూటలా 3 మోతాదులు వాడి, తరువాత వారమునకు 1m ను ఒకడోస్ వాడవలెను.

**చితక కొట్టినట్లు నొప్పులు ఉన్న :** ఆర్నికా-30, రుస్టాక్స్-30లను ఒకదాని తరువాత మరొకదానిని వాడవలెను. నొప్పులు వచ్చుచూ పోవుచూ ఉన్న కోలోసిం థిస్-200ను 3పూటలు వాడవలెను.

**నడుము బలమునకు:** G.F 6×ను ప్రతిరోజు 2 పూటలా వాడవలెను.

## మెడ బాధలు



**మాంస గ్రంథులు గట్టి పడుట:** కాల్కేరియా ఐయోడేటా-30ని 3పూటలు వాడవలెను. సుగుణము కనిపించని ఎడల బెరైటా కార్బోనిక-30ని 3పూటలా వాడుతూ, ఫైటోలక్కా-6×ను ప్రతిరోజు3పూటలా వాడవలెను. కాల్కేరియా ఫ్లోర్- 6×ను కూడా దీనితోనే వాడవచ్చును.

**మెడ కొయ్య బారిన :** స్ట్రిచ్నినమ్-30ని 3పూటలా 3మాత్రల చొప్పున వాడవలెను. తగ్గకపోతే రుస్టాక్స్-200ను 2 పూటలువాడి, ఒకవారము తరువాత 1m ను ఒకడోస్ వేయవలెను.

**సయాటిక నరము నొప్పి :** తొడ తగ్గరనుండి చీలమండలము వరకు ఉండు ఒకబారు నరమునకు రక్తప్రసరణసరిగా జరుగనప్పుడు లేదా కొన్ని వ్యాధుల వలన ఈనొప్పివచ్చును. దీని వలన ఎక్కువసేపు నడచుట, కూర్చుం డుటకష్టము. కూర్చుండి, లేచునపుడు; కొంతసేపు పరుండి, నడవబోయే ముందు బాధ ఎక్కువగాఉండి; కొంతదూరమునడచిన తరువాత కొంత వరకు ఉపశాంతి కలిగినచో; రుస్టాక్స్-200ను మూడుపూటల 3 మాత్రల చొప్పున 3డోస్‌లువేసి, ఒకవారము తరువాత 1m ను ఒకడోస్ వేయవలెను.

**కదలిన, నడచిన బాధ ఎక్కువగా ఉన్న :** బ్రైయోనియా-200ను 3 పూటలా3డోస్‌లువేసి, వారము తరువాత 1m ను ఒక మోతాదు వేయ వలెను.

**మెల్లగా కదలుట వలన ఉపశాంతి ఉన్న:** లైకోపోడియమ్-200ను 3 పూటలు వాడవలెను. దీనికి సుగుణము కనిపించని ఎడల పల్స్-30ని 3డోస్‌లు వాడవలెను. (పల్స్‌లోనొప్పులు మారుట కూడా ఉండును)



**నొప్పులు క్రింద నుండి, పైకి పాడిచినట్లు లేదా ప్రాకినట్లు ఉన్న ఎడల:** లెడమ్‌పాల్- 200ను 3 పూటలు వాడవలెను.

**పై నుండి క్రిందకు నొప్పులు ఉన్న :** కాల్మియాలటి ఫోలియా-30ని 3పూటలు వాడవలెను. మొత్తము మీద సయాటికా నొప్పికి-పై మందులతో పాటుగా M.P -30, K.P -30లను ప్రతిరోజు 3 పూటలా వాడవలెను.

## శ్వాసావయవ మండలము

### వ్యాధులు-మందులు

**క్షయ:** ఆర్సెనికమ్ ఐయోడేటమ్-30, తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-200 వీటిని రోజూ 3పూటలా కొంత కాలము పాటు వాడుతూ ప్రతి దినము "M.P -6×, G.P 6×, N.M 6×"అను ఈ మూడు మందులను ప్రతిరోజు రోజుకు 3 పూటలా తగ్గేవరకు వాడుతూనే ఉండవలెను.

**క్షయ జ్వరమునకు :** పై మందులతో పాటు F.P -6×ను ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను. అప్పుడప్పుడు ట్యూబెర్కు లినమ్-1m ను ఒకడోస్, జెల్సిమియమ్-1m ను ఒకమోతాదు వేయుచున్న క్షయ పూర్తిగా నివారించును.

**ఏ కారణము చేతనైనను ఊపిరితిత్తుల నుండ రక్తస్రావము జరుగుట:** ఫాస్పరస్-200ను ఒకడోస్‌నువేసి; F.P. 30, G.F-30లను ప్రతి3గంటలకు ఒక్క డోస్ చొప్పున వాడవలెను. మిల్లిఫోలియమ్-Q ను 3పూటలువాడిన తరువాత హెమా మెలిన్-Qను రోజూ3పూటలా నీటిలోకలిపి రక్తస్రావము తగ్గేవరకు వాడవలెను.

**ప్లూరసీ:** దీనికి ఎకోనైట్-30 ప్రధానమైన ఔషధము! దీనిని 3 పూటలు 3డోస్‌లువాడి,తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 3పూటలు 3డోస్‌లు వాడాలి. F.P -30, K.M -30, N.M-30 ఈ 3 మందులను రోజూ 3 పూటలా కొంత కాలము వాడవలెను.

**శ్వాసకోశమునకు పక్షవాతము వచ్చిన :** లైకోపోడియమ్-30ని 3 పూటలువాడి, తరువాత డల్కమారా-30ని 3డోస్‌లు వాడవలెను.



## బ్రాంకైటీస్ BRINCHITIS

ఇపెకాక్-30ని రోజూ 3 పూటలా వాడుతూ F.P.-30, K,M.-30, N.S-30 లను రోజూ 3పూటలా కొంతకాలము వాడవలెను. కార్బోవేజ్-200ను అప్పుడప్పుడు 3డోస్‌లు వాడవలెను.

**స్వరపేటిక వాపు లేదా పక్షవాతము:** కాస్టికమ్-200ను రోజుకు 3సారులు చొప్పున కొన్ని రోజులు వేసి ఆపవలెను.

**గొంతు బొంగురుకు :** దగ్గులవలన, వర్షములోన తడియుట వలన వచ్చిన బొంగురుకు రుస్టాక్స్-30ని ఒకరోజు 3డోస్‌లు వాడవలెను. తరువాత 4రోజులు ఆగి, 200ను 3డోస్‌లు వాడవలెను.

**నొప్పితో కూడిన బొంగురుకు :** బెల్లడోనా-30ని మూడు డోస్‌లు వాడవలెను. గాయకులు, ఉపన్యాసకులు,టీచర్స్ మొదలగువారికివచ్చు గొంతు బొంగురుకు కోకా(Coca)-30ని రోజుకు 3సార్లు చొప్పున కొంత కాలము వాడవలెను.



**ఉబ్బసము (ఆయాసము) :** కళ్ళెతెగి పడక ఆయాసము ఎక్కువగా ఉన్నచో రోజుకు 3-4 సార్లు ఏంటిమ్ టార్ట్-30ని వాడవలెను. దీని తరువాత ఇపెకాక్-30, రుస్టాక్స్-30లలో ఒకదానిని వాడి; తగ్గని ఎడల రెండవదానిని ప్రతిరోజూ 3డోస్‌లు చొప్పున 4 రోజులు వాడవలెను.

**ఆయాసము అధికమై, ఊపిరి అందనంతగా ఉంటే :** ఆర్సెనికమ్ ఆల్బ్ 30ని 3 గంటలకు ఒకడోస్‌చొప్పున 4డోస్‌లు వాడి,తరువాత కార్బోవేజ్ 200ను 3 గంటలకు 1డోస్ చొప్పున 3సార్లు వాడవలెను.

**దీర్ఘకాల ఉబ్బసమునకు :** ప్రతిరోజు సెనిగా-Q ను ఉదయము 10 బొట్లు, మధ్యాహ్నము 10బొట్లు, రాత్రి-10బొట్లు చొప్పున ఒక ఔన్స్ నీటిలోకలిపి త్రాగవలెను. వేడిచేస్తే డోస్‌ను తగ్గించి వాడవలెను. దీని తరువాత బ్లాట్టా ఓరియంటా లిస్-Q ను పై విధముగానే వాడవలెను.

**దగ్గు:** శ్లేషముతో కూడిన దగ్గుకు ఇపెకాక్-30ని రోజుకు 3 పూటలు చొప్పున కొంతకాలము వాడవలెను. పొడిదగ్గు లేదా వాటర్, కూల్‌డ్రింక్స్ త్రాగిన తరువాత వచ్చు దగ్గుకు బ్రైయోనియా-30ని 3సార్లు వాడవలెను. **ఊపిరాడనంత దగ్గుకు** డ్రోసెరాను-3డోస్‌లు లేదా కుప్రమ్‌మెట్‌ను 3డోస్‌లు వాడవలెను. **తెరలు తెరలుగా వచ్చు దగ్గుకు:** బెల్లడోనా-30ని 3సార్లు వాడ

వలెను. **చదువుట, మాట్లాడుట, నవ్వుట మొదలగు వాటివలన దగ్గు ఎక్కువ ఐన:** కాస్టికమ్-200ను 3 పూటలా 3డోస్‌లను వాడవలెను. 4 రోజులుచూచి, గుణము కనిపించని ఎడల డ్రోసిరా-30ని 3సార్లు వాడవలెను.

**గురకతో కూడిన దగ్గులు:** కాల్కేరియా కార్బ్-30ని 3సార్లు వాడవలెను.

**కొండ నాలుక పెరుగుటవలన వచ్చిన దగ్గుకు:** G.F-30ని ప్రతిదినము వాడుతూ కాల్కేకార్బ్‌ను మూడుసారులు వాడవలెను. దీని తరువాత పల్స్30ని 3సార్లు వాడవలెను. ఆయాసమునకు, దగ్గులకు పైమందులతో పాటుగా దీర్ఘ కాలము పాటు రోజుకు 3సార్లు చొప్పున M.P-6x, K.M.6x, N.S.6x.F.P.-6x లను వాడవలెను.

**శీతాకాలము, వర్షాకాలములో వచ్చు జలుబు-దగ్గు, ఆయాసమునకు:** నేట్రమ్ సల్ఫ్-6×ను పిల్లలకైతే 3సార్లు వాడవలెను. పెద్దలకైతే 30ని గాని, 200ను గాని వాడవచ్చును.

**కోరింత దగ్గు:** తెరలు తెరలుగా లేదా ఊపిరి అందనంత దగ్గు: నవ్విన, ఏడ్చిన-దగ్గు అధికమగుటు: దీనికి ప్రధాన ఔషధము-డ్రెసెరా-30. దీనిని 3సారులు వారికి 3 మాత్రలవాడవలెను. దీనిని ఎక్కువ డోస్‌లు వాడరాదు. దీని తరువాత కుప్రమ్‌మెట్-30ని 3సారులు 3డోస్‌లు వాడితే మేలుచేయును. ఐతే కుప్రమ్‌మెట్‌ను వాడుట వలన పిల్లలు ముఖము నీలిరంగులోనికి మారిపోతుంది. దగ్గు తెరలు వచ్చునపుడు శరీరమంతా కూడానీలముగా మారవచ్చును. మెగ్నీషియా ఫాస్-30ని ప్రతిదినము దిన మునకు 3సార్లు పూర్తిగా తగ్గువరకు వాడవలెను. పై మందులు పనిచేయని ఎడల సల్ఫర్-30ని ఒక డోస్ వేయవలెను.

**క్షయ తత్వము కల వారికి:** ఎప్పుడూ రొంపపట్టు స్వభావము గలవారు ట్యూబెర్క్యులినమ్ 1m ను నెలకు ఒకడోస్ చొప్పున 3 నెలలు వాడితే శారీరక తత్వములో మార్పువచ్చును. నిద్రలో ఉన్నప్పుడు నిద్రలేపునంత దగ్గు వచ్చుట లేదాఫిట్స్, ఆయాసము మొదలగునవి వచ్చుట, లెకెసిస్-200ను 3సారులు 3డోస్‌లు వాడవలెను.

**న్యూమోనియా లేదా బ్రాంకో న్యూమోనియా:** ఎకోనైట్-30ని రోజూ 3పూటలా 3 మాత్రల చొప్పున 3రోజులపాటు వాడవలెను. దీని తరువాత బ్రైయోనియా-30ని 3 మోతాదులు వాడవలెను. సుగుణము కనిపించని ఎడల సల్ఫర్-30ని 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.





**సాధారణ జలుబు:** వర్షాకాలము, శీతాకాలము వచ్చు జలుబులకు ముక్కువెంట నీరుకారుచున్న నేట్రమ్‌సల్ఫ్-30ని ప్రతి 3 గంటలకు ఒక్కడోస్ చొప్పున వాడవలెను. వేసవిలో ఐతే నేట్రమ్‌మూర్-30ని 3గంటలకు ఒక్కడోస్ చొప్పున వాడవలెను. వర్షాకాలములో అయితే డల్కమారా-30ని ప్రతి 3గంటలకు ఒక్కడోస్ వాడవలెను. ఆ తరువాత రుస్టాక్స్-30ని వాడ వలెను. అప్పుడప్పుడు సల్ఫర్-30ని ఒక్కడోస్ వేయవలెను. **శీతాకాలము మంచులో తడియుట వలన చల్లనిగాలి వలన వచ్చిన జలుబుకు:** ఎకోనైట్-30ని ప్రతి3గంటలకు ఒకడోస్ చొప్పునవాడి, తరువాత హెపార్, సల్ఫ్- 30ని 3పూటలా 3డోస్‌లు వాడవలెను. వీటికినీ తగ్గకపోతే సల్ఫర్-200ను 3 పూటలా 3డోస్‌లు వేసిన పూర్తిగా తగ్గిపోవును. (జలుబు-జ్వరములకు కూడా పై మందులు పనిచేయును)

## చర్మ సంరక్షణ

### లోపములు-ఔషధములు



**దురద:** సోరినమ్-1m ను ఒక మోతాదుల వేయవలెను. వారము తరు వాత సల్ఫర్-200ను 3 మోతాదులు వాడవలెను.

**శరీరము మీద మచ్చలు లేకుండా దురద ఉంటే:** నేట్రమ్ సల్ఫ్-30ని రోజూ 3 పూటలా కొన్ని దినములు వాడవలెను.

**దద్దురులతో కూడిన దురదలకు:** రుస్టాక్స్-200ను 3పూటలా 3డోస్‌లు వాడవలెను. సార్సపరిల్లా మదర్ టించర్‌ను ఉదయము-10బొట్లు, రాత్రి-10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి వాడవలెను.

**చెమట వలన దురద ఎక్కువ అయితే:** మెర్క్‌సోల్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**సంభోగము వలన శరీర మంతటా దురద ఎక్కువైతే:** ఎగారికస్-30ని రోజుకు 3పూటలు చొప్పున ఒక వారము వాడవలెను.

**శరీరముమీద దుస్తులను తీసివేయగానే దురద:** స్టాఫిసేగ్రియా-30ని 3పూటలా కొన్ని డోస్‌లు వేయవలెను. దీనితోటి నేట్రమ్ సల్ఫ్-30ని కూడా వాడవలెను.

**తేనెరంగునీరు లేదా నీటివంటి స్రావముతో కూడిన చర్మ వ్యాధులు:** గ్రాఫైటీస్- 30ని 3పూటలు 3మోతాదులు వేసి, ఒక్కవారము ఆగి; 200ను

3 పూటల 3 మోతాదులు వాడవలెను. సోరినమ్-1m ను ఒక్కమోతాదు వేయవలెను.

**శరీరము ముడతలు పడుట (ముసలివారి వలె) :** సార్సపరిల్లా-Q ను రోజుకు 3 పూటల పూటకు10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి ఒకనెల రోజులపాటు త్రాగించవలెను. అప్పుడప్పుడు మెజీరియమ్-200ను 3పూటల 3 మోతాదులు వాడి, గుణము కనిపించని ఎడల సల్ఫర్-1mను ఒక మోతాదు వేయవలెను.

## రకముల చర్మవ్యాధులు

బెర్బెరిస్ యాక్విఫోలియమ్-Q ను రోజూ 3పూటలా పూటకు 10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి 15 రోజులపాటు త్రాగించవలెను. 15 రోజులపాటు ఎఖినేషియా-Q ను ప్రతిపూట అరఔన్స్ నీటిలో 10 బొట్లు కలిపి రోజూ 3 పూటలా త్రాగించవలెను.



## పులిపిరి కాయలు

ఇవి సైకోటిక్ తత్వము గలవారికి వస్తాయి. ఉబ్బెత్తుగా ఉండి, చూచుటకు కాలీఫ్లవర్ ఆకృతిలోఉంటే తూజా-30ని ప్రతిరోజు రోజుకు 3పూటలు చొప్పున 15 రోజులువాడి, తరువాత 1m ను ఒకమోతాదు వేయవలెను. తూజాను వాడే టప్పుడు పెద్దఉల్లిని వాడకూడదు. పై పూతగా తూజా మదర్ టించర్‌ను వ్రాయవలెను. నిదానముగా పులిపిర్లు రాలిపోవును.

**కొమ్ములవలె గట్టిగా ఉంటే:** కాస్టికమ్-200ను రోజుకి 3 పూటలు చొప్పున 15 దినములువ ఆడి, తరువాత 1m ను ఒకడోస్ వేయవలెను.

**పులిపిర్లు మర్మావయవములమీద ఉంటే :** నైట్రిక్ ఏసిడ్-200ను కొన్ని డోస్‌లు వాడి, ఒక నెల తరువాత 1mను ఒకడోస్ వేయవలెను. దీనితరువాత స్టాఫిసేగ్రియా-200ను రోజుకు ఒకపూట చొప్పున కొంతకాలము వాడి, ఒక నెల తరువాత 1m ను ఒకడోస్ వేయవలెను. అరచేతుల యందు గల పులిపిర్లకు నేట్రమ్‌మూర్-200ను వాడి, తరువాత 1m ను పై విధముగానే వాడవలెను. పై పూతకు లోపలికి వాడే మందునే (అదే పవర్‌లో) వాడవలెను.

## చెమటకాయలు లేదా గుల్లలు (పేలుట)

వేసవిలో శరీరము మీద నీటితో కూడిన చిన్నచిన్న పొక్కులు అధికముగా వస్తాయి. ఇవి కొందరికి తీవ్రముగా కొందరికి కొంచెముగ రావచ్చును. పసి

47



పిల్లలను ఇవి చాలా ఇబ్బంది పెట్టును. వీటితోపాటు దురద కూడా ఉండును. దీనికి ముఖ్యమైన మందు పై పూతకు Prickly Heat Boro Calendula Powder దీనిని స్నానము తరువాత శరీరము అంతటా చల్లవలెను. కడుపులోనికి నేట్రమ్‌మూర్-30ని 3సార్లు వాడవలెను. మెడ్యూసా-30ని 3 పూటలు వాడవలెఉన. సోరినమ్-200ని ఒకరోజు 3 పూటలా 3డోస్‌లు మాత్రమే వేసి ఆపవలెను. రుస్టాక్స్-30లేదా సల్ఫర్-30 కూడా పనిచేయును.

**శీతాకాల పొక్కులు :** రుస్టాక్స్-30ని 3సార్లు (దురద ఉన్నా లేకపోయినా) వాడవలెను. దీనితరువాత పెట్రోలియమ్-30ని 3 పూటలు వాడవలెను.

**సవాయి వలన ఐతే :** మెర్క్‌సోల్-200ను ప్రతిరోజు 3సారుల చొప్పున కొన్ని మోతాదులువాడి, ఆ తరువాత ఏసిడ్ నైట్రిక్-20ను 3పూటలా 3డోసులు వాడవలెను.

**రక్తపుగడ్డలు :** ఇవి వేడి చేసినా వచ్చును. వేసవిలోనూ వచ్చును. చీముతో కూడిన వాటికి సైలీషియా-200ను 3 దినములపాటు వాడి, హెపార్ సల్ఫ్-200ను 3 సార్లుగా 3డోస్‌లు వేయవలెను. గడ్డలుపాకమునకు రాని ఎడల పై మందులే తక్కువ పవర్‌లో అనగా6×లో ప్రతి 3 గంటలకు ఒక్కడోస్ చొప్పున వాడవలెను. రక్తముకలిసి ఉన్నా; నొప్పిఎక్కువగాఉన్నా, వేడిగా ఉన్నా; బెల్లడోన-200ను 3సార్లు 3 మోతాదులువేయవలెను. గడ్డలు చితికిన తరువాత మానుటకు;సైలీషియా-200ను కాల్కేరియాసల్ఫ్-200 ఈ రెండు మందులను తగ్గేవరకు రోజుకు 3 పూటలు చొప్పున వాడవలెను. పైకి క్యాలెండూలా పౌడర్‌ను వాడవలెను.

**కురుపులు :** చీముతో కూడిన కురుపులు మరియు చర్మముమీది కురుపులు త్వరగా మానకుండా ఉన్నప్పుడు; హెపార్‌సల్ఫ్-200ను, రోజుకు 3 మోతాదులు చొప్పున 3 దినములు వాడవలెను.

**రసికారే కురుపులైతే:** గ్రాఫైటీస్-200ను 3డోస్‌లు వాడవలెను. సోరినమ్ 1m ను ఒకమోతాదు వాడవలెను. చుట్టూ అంచు కట్టిన కురుపులకు మెర్క్‌సోల్ 100నున 3సారులు 3 మోతాదులు వాడవలెను.

**అన్ని రకముల కురుపులకు :** కాల్కేరియా సల్ఫ్-200, సైలీషియా-200 లను ఒకరోజు ఒకదానిని, రెండవరోజు రెండవదానిని రోజుకు 3 సారల చొప్పున పుండులు మానేవరకు వాడవలెను. ఎఖినేషియా-Q ను పూటకు 10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి త్రాగించవలెను.

**వేసవి కురుపులకు :** ఫెర్రమ్‌ఫాస్-30ని రోజుకు 3 పూటలా వాడుతూ , బెల్లడోనా-30ని మధ్యమధ్య 3 మోతాదులు వాడవలెను.

## ఆటలమ్మ

**రాకుండా ఆపుట :** పల్స్-30ని రోజుమార్చి రోజు రోజుకు 3 సార్లు చొప్పున 4రోజులు వాడితే చాలును. (ఆ ప్రాంతములో ఆటలమ్మ ఉన్నట్లు తెలిసినపుడే వాడవలెను.)

**వచ్చిన తరువాత :** మంటలుగా ఉన్న ఆర్సెనికమ్ ఆల్బ్-200ను ప్రతిరోజు రోజుకు 3 మోతాదులు చొప్పున 4 రోజులు వాడవలెను. నీటి బొబ్బలుగా ఉన్న; రుస్టాక్స్-30ని రోజుకు 3 పూటల చొప్పున 3 దినములు వాడవలెను. జ్వరము ఎక్కువగా ఉన్న F.P-30, K.M-30 లను గంటకు 3 మాత్రల చొప్పున జ్వరము తగ్గేవరకు వాడవలెను.

## పొంగు

**రాకుండా ఆపుటకు :** మోర్బిలినమ్-30ని రోజుకు 3 పూటలా 3 రోజులు వేసి ఆపవలెను.

**వచ్చిన పిమ్మట :** రుస్టాక్స్-30ని రోజుకు 3 పూటలు చొప్పున 3 రోజులు వాడవలెను. రుస్టాక్స్‌ను వాడినతరువాత పల్స్-30 3 పూటలు వాడవలెను. **జ్వరము వచ్చిన :** F.P-30,K.M-30 లను ఒక గంటకు 3 మాత్రల చొప్పున జ్వరము తగ్గేవరకు వాడవలెను.

## మసూచికము

**రాకుండా ఆపుటకు :** వెరియోలినమ్-30ని లేదా వేక్సినినమ్-30ని లేదా మెలాండ్రినమ్-30ని మూడు పూటలా 3 రోజులు వాడవలెను.

**మసూచికము వచ్చిన తరువాత :** వెరియాలినమ్-30ని రోజూ 3 పూటలా 3 దినములు వాడవలెను. తూజా-30ని రోజూ రెండుపూటలా 4 రోజులు వాడవలెను. ఎఖినేషియా-Q ను రోజూ 2 పూటలా పూటకు 10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి త్రాగించవలెను.

**కుష్టుకు :** హైడ్రోకొటైల్-Q ను ప్రతిరోజు రోజుకు 3 పూటలు పూటకు-10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి త్రాగించవలెను. సైలీషియా-1m ను వారమునకు ఒక్కడోస్ చొప్పున 3 డోస్‌లు వాడి, తరువాత రోగి జనరల్ హెల్త్‌ను తెలిసికొని చికిత్స చేయవలెను.



**శ్వేత కుష్టు లేదా బొల్లి :** సైలీషియా-30ని ప్రతిరోజు ఒక్కడోస్ చొప్పున వాడుతూ హైడ్రోకొటైల్-Q ను ప్రతిరోజు 3సార్లు సారికి 10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి త్రాగిస్తూ; ఆర్సెనికమ్ సల్ఫురేటమ్ ఫ్లావర్-6× టాబ్లెట్స్‌ను ప్రతిరోజు రెండు పూటలా వాడుతూ, పైపూతగా చాల్మూగ్ర ఆయిల్‌ను పూయవలెను.

**బోదకాలు :** హైడ్రోకొటైల్-Q ను ప్రతిరోజు రోజుకు 3సార్లు సారికి 10 బొట్లు చొప్పున అరఔన్స్ నీటిలో కలిపి వాడవలెను. ఎనాకార్డియమ్-30ని ప్రతిరోజు 2సార్లు,సారికి 3మాత్రల చొప్పున వాడవలెను. కాల్కేరియాఫ్లోర్ 6×, కాలీమూర్-6×, సైలీషియా-6×లను ప్రతిరోజు రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.

**పుండ్లు :** దీర్ఘకాలము మానని పుండ్లకు లెకెసిస్-200ను ఒకరోజులో 3 సారులు 3డోస్‌లు వాడి ఆపవలెను.

**నల్లగా కుళ్ళినట్లు ఉంటే :** ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3మోతాదులు వాడవలెను.

**రక్తము కారు పుండ్లకు :** ఫాస్ఫరస్-200ను 3డోస్‌లు వేసి, ఫెర్రమ్ ఫాస్-30ని ప్రతిదినము 2 సారులు సారికి-3 మాత్రల చొప్పున వాడవలెను.

**బాధతో కూడిన పుండ్లు :** బెల్లడోనా-30ని రోజుకు 3సార్లు చొప్పున కొంత కాలము వాడవలెను.

**దుర్వాసనగల రసితో కూడిన పుండ్లకు :** సల్ఫర్-200ను మూడు డోస్‌లు వాడవలెను.

**పుండ్ల స్రావము తగిలి, తిరిగి పుండ్లు పడుతున్నప్పుడు:** ఆర్సెనికమ్ ఐయోడేటమ్- 30ని 3డోస్‌లు మెర్కసోల్-30ని రోజుకు 3డోస్‌ల చొప్పున కొద్దిరోజులు వాడవలెను.

పైమందులతో గుణము కనిపించని ఎడల సిఫిలినమ్-1m ఒక్కడోస్ వెయ్యవలెను.

**గమనిక :** ఈ పుండ్లు అన్నిటికీ పైకి క్యాలెండులా-Q ను గాని, పౌడర్‌ను గాని వాడవలెను. కడుపులోనికి ఎఖినేషియాను అర ఔన్స్ నీటిలో 10 బొట్లు కలిపి, రోజుకు మూడుసారుల చొప్పున వాడవలెను.

**తామర :** ఏసిడ్ క్రైసరోబినమ్-6×ను ప్రతి దినము వాడవలెను. బెర్బెరిస్ ఏక్విఫోలియమ్-Q ను ప్రతిదినము 3సారులు సారికి అర ఔన్స్ నీటిలో 10 బొట్టుల చొప్పున కలిపి త్రాగించవలెను. మధ్యమధ్య సల్ఫర్-200ను ఒక డోస్, సోరినమ్-1m ను ఒకడోస్ వేయవలెను. పైకి ఆయింట్‌మెంట్స్‌ను వాడకుండా కొబ్బరినూనెను వ్రాయవలెను.

**స్థానము మారు దురదలు :** మెజీరియమ్-30 లేదా 200,ఎనాకార్డియమ్ 200, స్టాఫిసేగ్రియా-30 లేదా 200 అవి ప్రధానముగా పనిచేయు మందులు. మొదట మెజీరియమ్-30ని 3పూటలా 3డోస్‌లువాడి, వారము తరువాత, 200ను వాడవలెను. ఆ తరువాత ఎనాకార్డియమ్, స్టాఫిసేగ్రియా లను విధముగానే వాడ వలెను.

**నీటిబొట్టులు గల చర్మవ్యాధి :** కేంథారిస్-30ని మూడు పూటలే! పూటకు 3 మాత్రలు వేయవలెను. మంట-చురుకులు ఉన్నచో దీనినే 200 పవర్‌లో 3 డోస్‌లు వాడవలెను. స్రావములు దుర్వాసనగా ఉంటే; ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 3 పూటలా 3డోస్‌లు వాడవలెను. వీటితో నేట్రమ్ మూర్-30ని ప్రతిరోజు రోజుకు 3 పూటల చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**నరముల పొడవునా ద్రవపు పొక్కులు :** రనన్క్యులస్ బల్బోసస్-Q ను ఉదయము 10 బొట్లు,రాత్రి 10 బొట్లు చొప్పున అర ఔన్స్ నీటిలో కలిపి వాడవలెను.

**మోటు పనిముట్లను వాడుటవలన వచ్చు కాయలు (చర్మము గట్టిపడుట) అఱకాళ్ళలో ఆనెలు :** ఏంటిమోనియమ్‌క్రూడమ్-30ని ప్రతిరోజు రోజుకు 3 పూటలు చొప్పున కొంతకాలము వాడవలెను. గుణము కనిపించని ఎడల 200 పవర్‌లో కొంతకాలము వాడి, తరువాత 1mలో ఒకడోస్‌వేసి ఆపవలెను. దీనితో పాటు C.F -30ని ప్రతిరోజు వాడవలెను. దీని తరువాత కోనియినమ్ 200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**ఎప్పుడూ మురికిగా ఉండే వారికి స్నానము చేయని వారికి, దుర్వాసనగల చెమట జనించువారికి, మురికిబట్టలు ధరించు వారికి వచ్చు చర్మ వ్యాధులకు మరియు మానసిక వ్యాధులకు:** సల్ఫర్-200ను 3 పూటల 3డోస్‌లువాడి, నెలతరువాత 1m లో ఒకడోస్ వాడవలెను. ఇదిఏంటిసోరిక్ ఔషధము. కనుక ఏమందులనువాడుతున్నా అప్పు డప్పుడు సల్ఫర్‌ను 30 పవర్‌లో ఒకడోస్ వేయుట వలన గతములో వాడిన మందులు త్వరగా పనిచేయును.





**రాచ కురుపులు, నీటి బొబ్బలు వంటి చర్మవ్యాధులు-మంటలతో కూడి ఉండుట; ధాతువులుక్రుళ్ళుట :** ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను, ఆర్సెనికమ్ ఆల్బ్ తత్వము సల్ఫర్‌కి వ్యతిరేకముగా అతి శుభ్రముగా నుండును.

## నరముల మండలము

### బాధలు-ఔషధములు

నేటిసమాజములో విద్యార్థులకు, డాక్టర్స్‌కు, లాయర్స్‌కు, వ్యాపారస్థులకు, గృహిణులకు ఒకరికేమిటి అందరికి తీరనిసమస్యలే. ఎల్లప్పుడూ మానసిక ఒత్తిడులు ఎక్కువే!! దానికి తగినట్లుగా ఎనర్జీ పెరుగుట కవసరమైన విశ్రాంతి ఆహారము లేక ఎక్కువగా నాడీమండల వ్యాధులు వస్తున్నాయి. ప్రథమచికిత్సగానేకాక పూర్తి నివారణచర్యగా కూడా క్రిందతెలిపిన మందులు పనిచేయును. సక్రమముగా వాడితే మేలు చేయును. దుఃఖము, విచారము, ధననష్టము, భార్యగాని, భర్తగాని, పిల్లలుగాని చనిపోవుట లేదా ప్రేమ భంగముల వలన మానసిక క్షోభ కలిగినపుడు వచ్చే నరముల జబ్బులు ప్రధాన మైనవి.

**హిస్టీరియా, మూర్ఛ, నిద్రలేమి, ఆకలి లేమి మొదలగు వాటికి :** ఇగ్నీషియా -200ను రోజుకు 3పూటల చొప్పున ఒకవారమువాడి, తరువాత 1m లో ఒకడోస్ వేయవలెను. దీని తరువాత నేట్రమ్‌మూర్-200ను రోజుకు 3 పూటలు చొప్పున కొంతకాలము వాడవలెను. దీనిని కూడ ఒకనెల తరువాత 1m లోఒకడోస్ వేయవలెను. వీటివలన సుగుణము కనిపించని ఎడల ఏసిడ్ నైట్రిక్‌ను పై విధముగానే వాడవలెను.

**మూర్ఛ(హిస్టీరియాలో) :** K.P-30లను ప్రతిరోజూ రోజుకు2పూటలా వాడ వలెను. ఒఎనాన్తె క్రోకేట-Q ను ప్రతిదినము ఉదయము 10బొట్లు, రాత్రి10బొట్లు చొప్పున అరఔన్స్ నీటిలో కలిపి వాడవలెను. వ్రేళ్ళతో ప్రారంభించే ఫిట్స్‌కు: కుప్రమ్‌మెట్-200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**నరముల నిస్త్రాణకు :** M.P-6x, K.P-6x లను ప్రతిరోజు రోజుకు 3పూటలు చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**నరముల బలము కలుగుటకు :** 1.అవెనసతివా-Q, 2.డామియాన-Q, 3.ఆల్ఫాల్ఫా-Q ఈ మందులను ఒకదానిని ఒకరోజు 2పూటలా అర

ఔన్స్ నీటిలో ఉదయము-10బొట్లు, రాత్రి-10బొట్లు చొప్పున కలిపివాడ వలెను. 2వ రోజు 2వ మందును, 3వరోజు 3వ మందును పైవిధముగానే కొంతకాలము వాడవలెను.

**సయాటికా :** రుస్టాక్స్-200ను రోజుకు 3 పూటలు చొప్పున ఒక వారము వాడి, తగ్గకపోతే 1mలో ఒకడోస్ వేయవలెను. తరువాత బ్రైయో నియాను పై విధముగానే వాడవలెను. తిమ్మిరిగా ఉంటే కోలోసింథిస్-200ను రోజుకు 3 పూటలు చొప్పున ఒక వారము వాడి, తరువాత 1m లో ఒకడోస్ వేయవలెను. M.P-6x, K.P-6×లను ప్రతిరోజు రోజుకు 3 పూటలు చొప్పున తగ్గేవరకు వాడవలెను.

## ధనుర్వాతము

స్ట్రిచ్నినమ్-200ను 3 పూటలు వాడవలెను. దీని తరువాతి మందు సిక్యుట విరోస-200ను ప్రతి 6గంటలకునూ ఒకడోస్ చొప్పున వాడవలెను. రోగిని-చీకటి గదిలో ఉంచి, అనుభవము గల వైద్యుని సంప్రదించవలెను.

**ప్రసవించిన తరువాత నీడీమండల బలహీనతలు :** సిమిసి ఫ్యూగా-30ని 3 పూటలు వాడవలెను.

**ఫిట్స్:** నోటివెంట నురుగు వచ్చుచున్న సిక్యుట విరోసా 30ని రోజుకు మూడు సారుల చొప్పున కొంతకాలము వాడవలెను.

**తలకు రక్త ప్రసరణ అధికమగుట వలన వచ్చిన ఫిట్స్‌కు:** బెల్లడోన-30ని ఒకరోజే 3సారులు వాడవలెను. తలనొప్పిఉన్న ప్రతి 6గంటలకు 3 మాత్రల చొప్పున తలనొప్పి తగ్గువరకు వాడవలెను.

**తిమ్మిరితో కూడిన నరముల నొప్పి :** ఆకస్మికముగావచ్చి, ఆకస్మికముగా తగ్గు చున్నచో ఎకోనైట్-30ని 3డోస్‌లు వాడవలెను. ఈలక్షణముమీద కోలో సింథిస్- 30ని కూడా 3సార్లు వాడవచ్చును. M.P-6x ను రోజుకు 3సార్లు చొప్పున కొంత కాలము వాడవలెను.

**నొప్పులు క్రమముగా పెరిగి, తగ్గుతూ ఉంటే :** స్టానమ్-30ని 3 పూటలా 3డోస్‌లు వాడవలెను. క్రిందినుండి పైకి నొప్పి ప్రాకినట్లు ఉన్న లెడమ్-30ని 3 పూటలు వాడవలెను. పైనుండి క్రిందకు నొప్పి ప్రాకినట్లు ఉన్న కాల్మీయా-30ని 3డోస్‌లు వాడవలెను.

**వ్రాతగాళ్ళ వ్రేళ్ళు పట్టు దప్పుట :** M.P-30, K.P-30 లను రోజుకు 3సార్లు చొప్పున ఒక నెలరోజులు వాడవలెను. తరువాత 200 పవర్‌లో వాడవలెను.



**గర్వముగా గలవారికి కలుగు నరముల నొప్పి :** ప్లాటినమ్-30ని రోజుకు 3 సారుల చొప్పున ఒక నెలరోజులు వాడవలెను. తరువాత 200 పవర్‌లో వాడవలెను.

(పక్షవాత నివారణకు "కాళ్ళుచేతులు" అను అధ్యాయమును చూడ గలరు)

**విద్యుత్ ఘాతమువలన షాక్ తగిలి నరములు చచ్చుబడిన :** ఆర్నికా-200 ను 3పూటలే 3డోస్‌లు వాడి, M.P-30, K.P-30 లను రోజూ ప్రతి 6 గంటలకు ఒకడోస్ చొప్పున కొంతకాలము వాడవలెను.

**నరములు ఉబ్బుట :** అర్నికా-200ను 3 పూటలు వాడవలెను.

## వివిధ జ్వరములు-నివారణ

**రాత్రిపూట జ్వరము :** సల్ఫర్-30ని 6 గంటలకు 3 మాత్రల చొప్పున 3 డోస్‌లు వాడవలెను. ఆ తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-30ని పై విధముగానే వాడవలెను. జ్వరతీవ్రత ఎక్కువగా ఉంటే పై వాటితో బెల్లడోనా-30, F.P-30, K.M-30 లను ప్రతిగంటకు 3 మాత్రల చొప్పున వాడవలెను. శరీర మంతటా చితుక కొట్టినట్లుగా నొప్పులు ఉంటే; రుస్టాక్స్-30ని 3 పూటలా 3డోస్‌లు మాత్రమే వాడవలెను.

**చలితో కూడిన జ్వరము :** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 3గంటలకు 3 మాత్రల చొప్పున 3డోస్‌లు వాడవలెను. నేట్రమ్‌సల్ఫ్-30ని పై దానితో పాటు వాడవలెను. చైనా-30ని కూడా వాడవచ్చును.

**ఒకసారి చలి, ఒకసారి జ్వరము మారుతూ వచ్చిన ఎడల :** చైనా-30ని ప్రతి 3 గంటలకు 3 మాత్రలచొప్పున 3 డోస్‌లువాడవలెను. ఆ తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 6 గంటలకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను. దీని తరువాత సల్ఫర్-30ని ఒకరోజే 3డోస్‌లు వాడవలెను.

**చెమటతో జ్వరము :** నేట్రమ్‌కార్బ్-30ని 3గంటలకు 3 మాత్రల చొప్పున 3 డోస్‌లు వాడవలెను. కెప్సికమ్-30ని పైమందు వలెనే వాడ వచ్చును. పల్స్-30ని కూడా 3డోస్‌లు వాడవలెను.

**చెమట పట్టక పోవుట :** యూపటోరియమ్ పెర్ఫ్-30ని 3 పూటలా 3 మోతాదులు వాడవలెను. అర్సెనికమ్ ఆల్బ్-30ని 3పూటలా 3 మోతాదులు వాడవలెను.

**జ్వరముతో దుప్పటి కప్పుకొనుట-(చలిలేకపోయిననూ):** పల్సటిల్లా-30ని 3 గంటలకు ఒకడోస్ చొప్పున 3డోస్‌లు వాడవలెను. ఆ తరువాత ఆర్సెని కమ్‌ఆల్బ్ -30ని పై విధముగానే వాడవలెను.

**విపరీతమైన నొప్పులతో జ్వరము ఉంటే:** కెమోమిల్లా-30ని పై విధము గానే వాడవలెను. తరువాత స్టాఫిసేగ్రియా-30ని 6 గంటలకు ఒకసారి చొప్పున 3 మోతాదులు వాడవలెను.

## వేసవి జ్వరము

**ఎండ వేడిమితో లేదా వేసవిలో కలుగు జ్వరమునకు:** సోరినమ్-200ను 3 పూటలా 3 మోతాదులు వాడవలెను. బెల్లడోన-30ని గంటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**తీవ్రముగా జ్వరము ఉంటే:** F.P-30, K.M-30 లను ప్రతి గంటకు 3 మాత్రల చొప్పున వాడవలెను. నేట్రమ్‌మూర్-30ని కూడా 6గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను. తగ్గని పక్షములో సల్ఫర్-30ని 3 పూటలే 3 మోతాదులను వాడవలెను.

**సంభోగానంతరము జ్వరము:** నక్స్-30ని 3 మోతాదులు వాడవలెను. తరువాత కాల్కేరియా కార్బ్-30ని 3 పూటలా 3 మోతాదులు వాడవలెను.

**పైకి శరీరము వేడిగా ఉండును గాని జ్వరము ఉండదు:** సల్ఫర్-30ని 3పూటలా 3 డోస్‌లు వాడవలెను. ఆతరువాత పల్స్-30ని 3పూటలా 3 మోతాదులు వాడవలెను. తగ్గనిపక్షములో సల్ఫర్-30ని 3పూటలా 3 మోతాదులు వాడవలెను.

## లో జ్వరము

పైకి జ్వరము ఉండదు (శరీరము వేడిగా ఉండదు) గానీ లోపల జ్వరము ఉండును(థెర్మామీటర్‌లో చూచినజ్వరము తెలియును) విరిట్రమ్ ఆల్బమ్-30ని 3 పూటలా 3 డోస్‌లు వాడవలెను. తరువాత సల్ఫర్-30ని 3 పూటలా మూడు డోస్‌లు వాడవలెను.

**తీవ్ర జ్వరములు:** బెల్లడోనా-30ని ప్రతిఒక గంటకు 3 మాత్రల చొప్పున వాడుతూ;F.P-30, K.M-30 లను 1గంటకు 3 మాత్రలుచొప్పున వాడవలెను. దడు పుతో, గాలిఆందోళనలతో జ్వరముఉంటే; ఎకోనైట్-30ని ప్రతిగంటకు మూడు రాత్రులచొప్పున వాడవలెను. నిస్త్రాణముతోఉంటే;





ఆర్సెనికమ్-30ని 3 గంటలకు ఒకసారిసారికి 3 మాత్రల చొప్పున వాడవలెను.

**జ్వరములో సంధి లక్షణములు:** స్ట్రెమోనియమ్-30ని మూడుగంటలకు 2 మాత్రలచొప్పున వాడవలెను. తరువాత బెల్లడోనా-30ని 3 మాత్రల చొప్పున 3 గంటలకు ఒక్కడోస్ వాడవలెను. గుఱకతోకూడిన సంధి అయితే ఓపియమ్ -200ను 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**జ్వరము వచ్చినప్పుడు కంపములు వచ్చుట:** బెల్లడోన-30ని ప్రతి పది నిమిషము లకు 3 మాత్రల చొప్పున కంపములు తగ్గేవరకు వాడవలెను. తరువాత సిక్యుటా విరోసా-30ని 3పూటలు వాడవలెను.

**నిద్రలో జ్వరము:** లెకెసిస్-30ని 3పూటలువాడవలెను.

**రక్తదోషముల వలన వచ్చుజ్వరములు:** ఎఖినేషియా-Q ను 10బొట్లు అరఔన్స్ నీటిలో కలిపి, 3 పూటలు త్రాగించవలెను. ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3 పూటలా 3 మోతాదులు వాడవలెను.

**సూతికా జ్వరమునకు:** పల్స్-30ని 3 పూటలు వాడవలెను. ఆ తరువాత రుస్టాక్స్-30ని 3పూటలు వాడవలెను.

**పైత్య జ్వరము (విడిచి విడిచి వచ్చుట):** సల్ఫర్-30ని 3పూటలా 3డోస్‌లు వాడి, తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

**క్షయజ్వరము:** ("శ్వాసావయవమండలము"అనుఅధ్యాయమును చూడగలరు)

**సన్నిపాతములో విరేచనము:** ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 3 గంటలకు 3మాత్రల చొప్పున వాడవలెను. బంక ఉంటే మెర్క్‌సోల్-200ను 3 గంట లకు 3 మాత్రల చొప్పున వాడవలెను. రక్తము పడుతుంటే; మెర్క్ కర్-200లను 3 గంటలకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**అప్రయత్నముగా విరేచనములు ఔతుంటే:** సల్ఫర్-30ని 3పూటలా 3మాత్రలచొప్పున వాడవలెను. నీరసముంటే కార్బోవేజ్-200ను 3 గంట లకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**ఆంత్రము (ఆసనము)లో పుండ్లు పడుట:** ఇది ప్రమాదకర పరిస్థితి. ఈ స్థితిలోనే శస్త్రచికిత్స అవసరము ఔతుంది. అప్పుడు జాగ్రత్తగా అనుభవ వైద్యునిసలహాను అడుగవలెను. సాధారణముగా అటువంటి స్థితిలో బాప్టి

షియా-30ని 3 గంటలకు 3 మాత్రల చొప్పున 3 మోతాదులు వాడవలెను. (సన్నిపాత జ్వరములలో ఎకోనైట్‌ను వాడరాదు)

## బ్రాంకైటీస్,న్యూమోనియా జ్వరములు

ఎకోనైట్-30ని 3 గంటలకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**ఆకస్మికముగా వచ్చి, ఆకస్మికముగానే తగ్గుట :** ఎకోనైట్-30ని వాడి, తరువాత, బెల్లడోనా-30ని వాడవలెను. జ్వరములో 'చనిపోతాను' అనే భయము కలిగితే ఆర్సెనికమ్ ఆల్బ్-30ని; "ఫలానా టైమ్‌లో చనిపోతాను" అని చెప్పితే ఎకోనైట్-30ని వేయవలెను.

**మగత జ్వరముతో మూలుగుతున్న :** బెల్లడోనా-30ని 3 గంటలకు 3 మాత్రల చొప్పున వాడవలెను. గుఱకతో ఉంటే: ఓపియమ్-30ని 3 గంటలకు ఒకడోస్ చొప్పున వేయవలెను.

**కొలాప్స్ లేదా నాడి సన్నగిల్లుట లేదా ప్రాణ వాయువు అందకపోవుట :** ఎల్లప్పుడు 'విసరమ"నికోరుట, నల్లని వాంతులు, కామెరల జ్వరములో కార్బోవేజ్- 200ను 3 గంటలకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**ఎముకలు, శరీరము చితక కొట్టినట్లుగా నొప్పలు :** రోజు మార్చిరోజు జ్వరము వస్తున్నప్పుడు యూపటోరియమ్ ఫెర్ఫ్-30ని ప్రతి 3 గంటలకు 3 మాత్రల చొప్పునవాడవలెను.

**అజీర్ణ జ్వరము :** నక్స్-30ని 3 పూటలా 3 మోతాదులు వాడవలెను. తరువాత పల్స్-30ని 3 పూటలా 3 మోతాదులు; FoP-30, K.M-30 లని ప్రతి 3 గంటలకు ఒకసారి సారికి 3 మాత్రలచొప్పున వాడవలెను.

**విడువని జ్వరము :** నక్స్-30ని 3 పూటలువాడి, తరువాత బ్రైయోనియమ్ 30ని 3 మోతాదులు వాడవలెను. ఆ తరువాత సోరినమ్-1m లో ఒకడోస్ వేయవలెను.

**జలుబు జ్వరము :** ఎకోనైట్-30ని 3 పూటలా పూటకు 3మాత్రల చొప్పున వాడవలెను. ఆ తరువాత సల్ఫర్-30ని 3 మోతాదులు వాడవలెను. శీతాకాలములో మంచు వలన వచ్చిన ఎకోనైట్-30ని తరువాత హెఫార్ సల్ఫ్-30ని 3 మోతాదులుగా వాడవలెను. వర్షాకాలములో ఐతే రుస్ స్టాక్స్-30ని 3మోతాదులు వాడవలెను. నేట్రమ్‌సల్ఫ్-30ని ప్రతిరోజూ జలుబు తగ్గేవరకు వాడవలెను.





## టైఫస్ జ్వరము

**ఇది టైఫాయిడ్ (సన్నిపాతము) జ్వరమునకు ముందుస్టేజ్:** రుస్టాక్స్-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను. ఆ తరువాత ఆర్సెనికమ్ ఆల్బ్-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను.

**టైఫాయిడ్ (సన్నిపాత జ్వరము) :** అర్సెనికమ్ ఆల్బ్-30ని 3పూటలా 3మాత్రల చొప్పున 3రోజులు వాడవలెను. దీనికితరువాత బాప్టీషియా-30ని 3 పూటలా 3 మాత్రల చొప్పున వాడవలెను.

**శారీరక నొప్పులతో, విరేచన బద్ధకముతో :** బ్రైయోనియా-30ని 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

**సంధి జ్వరము : బట్టలను పీక్కొనుట, ప్రక్కబట్టలను ప్రోగుచేసికొనుట ఉన్న :** హయోశ్యామస్-30 లేదా200ను 3పూటలా పూటకు3మాత్రల చొప్పున వాడవలెను.

**గమనిక :** అన్ని రకముల జ్వరముల లోను F.P-30, K.M-30 లను గంటకు 3మాత్రల చొప్పున వాడవలెను. సామాన్య జ్వరములలో 3 పూటలా పూటకు 3 మాత్రల చొప్పున వాడవలెను.

## నిద్ర-కలలు-పొజిషన్స్

శాస్త్రీయ విజ్ఞానములో నిద్ర, కలలు; నిద్రలో పరుండు స్థితులనుబట్టి కూడా వ్యాధుల నిర్ణయములు జరుగుచున్నది. వారి వారి మానసిక ప్రవృత్తులు కూడా తెలియుచున్నవి. అంతేకాక వారి శారీరక నిర్మాణములలోని అవయవ బలహీనతలను కూడా తెలిసికోవచ్చును. కావున మనము వైద్యములో ఏవ్యాధికైననూ వీటిని సహచర లక్షణములుగా తీసికోవచ్చును. మొదడుచేయు పనులకు ఇవి దగ్గరగా ఉండును. ఈ అధ్యాయమును కేవలము పరిచయము మాత్రమే! ముందు ముందు మరిన్ని వివరములను, చికిత్సలను తెలియజేయడమైనది.

## నిద్రలో పరుండు పొజిషన్స్ (స్థితులు)

**కడుపుమీద పరుండుట (బోరగిలా):** కాలీకార్బ్-200ను ప్రతిరోజు 3 డోస్‌ల చొప్పున వాడవలెను. ఇంకా కోలోసింథిస్-200నుకూడా వాడవచ్చును. దీనికి స్ట్రెమోనియమ్ కూడా పనిచేయును.

**చేతులను-తలమీద ఉంచుకొని పరుండుట :** నక్స్‌వామికా-200ను ప్రతిరోజు రాత్రిపూట 3 డోస్‌లు వాడవలెను. తరువాత పల్సటిల్లా-200ను ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున వాడవలెను.

**కడుపుమీద చేతులను పెట్టుకొని పరుండుట:** పల్స్-200ను ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున వాడవలెను.

**తలక్రింద చేతులను పెట్టుకొని పరుండుట:** ఏంటిమోనియమ్ టార్టారికమ్ 20ను ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున వాడవలెను. నక్స్ వామికా-200ను ప్రతి రాత్రిపూట 3 మాత్రల చొప్పున వాడవలెను.

**తలను-వెనుకకు వంచి పరుండుట:** కాల్కేరియాకార్బ్-200ను ప్రతిరోజు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**మోకాళ్ళను-ఎడముగా పెట్టి పరుండుట:** స్ట్రెమోనియమ్-200ను ప్రతిరోజు రోజుకు 2సార్లు చొప్పున వాడవలెను.

**కాళ్ళను ఒకదానిమీద ఒకటి ఏటవాలుగా వేసి పరుండుట :** దొడోడెన్డ్రాన్ 200ను ప్రతిరోజు రోజుకు 2సార్లు చొప్పున వాడవలెను.

**కాళ్ళను పైకి లాగుకొని చాచుకొని పరుండుట :** ప్లాటినమ్-200ను 3 డోస్‌లు వాడవలెను. తరువాత పల్స్-200ను వాడవలెను. కోపమున్నవారు కెమోమిల్లాను వాడవలెను.

**ఒక కాలునుజాపి, రెండవ కాలును ముడుచుకొని పరుండుట :** స్టానమ్-200ను ప్రతిరోజు రోజుకు 2సారులు చొప్పున వాడవలెను.

**వెలకిలిగా పరుండుట :** సోరినమ్-1m ను వారమునకు ఒక డోస్ చొప్పున 3డోస్‌లు వాడి పల్స్-200ను ప్రతిరోజు రోజుకు 2సార్లుచొప్పున వాడవలెను. తరువాత రుస్టాక్స్-200ను 2సార్లు వాడవలెను. బ్రై కూడా పనిచేయును.

**కూర్చుండినట్లు పరుండుట:** ఆర్మోరేసియా సతివ-200ను 3 డోస్‌లు వాడి, ఆ తరువాత సల్ఫర్-200ను 3డోస్‌లు వాడవలెను. వారము తరువాత లైకోపోడి యమ్-200ను ప్రతిరోజు రోజుకు 2సార్లు చొప్పున వాడవలెను.

**ఎడమ వైపుకు పరుండలేక పోవుట :** లైకోమ్‌మూర్-200ను ప్రతిరోజు రోజుకు 2డోస్‌ల చొప్పున వాడవలెను.

**కుడివైపుకు పరుండలేకపోవుట:** ఫెర్రమ్‌మూర్-30ని ఒక్క 3డోస్‌లు వాడవలెను. ఫాస్ఫరస్-200ను 3డోస్‌లు, ఆతరువాత సెబాడిల్లా-200ను రోజుకు ఒకడోస్ చొప్పున వాడవలెను.





(ఇప్పటి వరకు చర్చించిన పొజిషన్‌లను ఉద్రేక-ఉపశమనములుగా తీసుకొని అనేక వ్యాధులను నివారించుట జరిగినది. ఉదా: ఉబ్బసము, శూల, నరమునొప్పులు మొదలగునవి.- రచయిత)

## నిద్ర

**ఆవులింతలు :** మెగ్నీషియా కార్బ్-200ను 3డోస్‌లు వాడవలెను.

**ఒడలు విరుపులు, నిద్రమత్తు :** కాల్కేరియా కార్బ్-200ను మూడు డోస్‌లు వాడి, బెల్లడోనా-200ను రోజుకు ఒకడోస్ చొప్పునవాడవలెను.

**నిద్రమత్తు :** నేట్రమ్‌మూర్-200, సైలీషియా-200లను ప్రతిరోజూ వాడ వలెను. ఓపియమ్-200ను 3డోస్‌లు మాత్రమే వాడవలెను.

## నిద్రలేమి-కారణములు-చికిత్స

పాస్సిఫ్లోరా ఇన్‌కార్‌నేటా-Qను రాత్రిపూట 3 గంటలకు ఒకసారి అర ఔన్స్ నీటిలో 10బొట్లు చొప్పున కలిపివాడవలెను. కాలీఫాస్-200, ఫెర్రమ్‌ఫాస్ -200లను గంటకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**రక్తోద్రేకము వలన :** పల్స్-200ను 3డోస్‌లు వాడవలెను.

**ఆలోచనల వలన :** స్టాఫిసేగ్రియా-200ను రోజుకు ఒక్కడోస్ చొప్పున, బ్రై-200ను రోజుకు ఒక్కడోస్ చొప్పున తగ్గేవరకు వాడవలెను.

**ఒకే ఆలోచన-తిరిగి తిరిగి వచ్చుట వలన:** కాల్కేరియాకార్బ్-200ను రోజుకు3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**మనస్తాపము వలన :** నేట్రమ్‌మూర్-200, కాలీఫాస్-200, ఫెర్రమ్ ఫాస్-200లను ప్రతిరోజురోజుకు 3సారుల చొప్పునవాడవలెను. ఆర్సెనికమ్ ఆల్బ్-200ను 3డోస్‌లువాడి, ఆ తరువాత విరాట్రమ్ ఆల్బ్-200ను 3 డోస్‌లు వాడవలెను.

**బాధల వలన:** కెమోమిల్లా-200ను3గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**వేసవిలో (ఉడుకువలన):** బ్రై-200ను 3డోస్‌లు, ఫెర్రమ్‌ఫాస్-200ను 3గంటలకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

## నిద్రలోని లోపములు

**త్రుళ్ళిపడుట :** బెల్లడోనా-200ను 3 గంటలకు ఒకడోస్ చొప్పున వాడుతూ, సల్ఫర్-200ను 3డోస్‌లు వాడవలెను.

**భయంకర దృశ్యములు కనబడుట:** కాల్కేరియాకార్బ్–200ను 3డోస్‌లు వాడవలెను. కార్బోవెజ్–200ను రోజుకు ఒక్కడోస్ చొప్పున వాడవలెను.

**అత్యధికనిద్ర :** ఓపియమ్–200ను3డోస్‌లువాడి;సల్ఫర్‌ను3డోస్‌లు వాడవలెను.

**సుఖము లేని నిద్ర :** ఫాస్ఫరస్–200ను 3డోస్‌లు వాడి; ఫెర్రమ్ ఫాస్–200, కాలీఫాస్–200లను ప్రతిరోజు వాడవలెను.

**నిద్ర పట్టినా లేదా గాఢ నిద్రలో–వ్యాధి లక్షణములు ఉద్రేకించుట:** లెకెసిస్ 200ను 3డోస్‌లు వాడి, వారము తరువాత 1m లో ఒకడోస్ వేయవలెను.

కోడి (అరకన్ను) నిద్ర (కనుగ్రుడ్డు సగము కనిపించుచుండును) ఓపియమ్– 200ను ఒక్క 3డోస్‌లు వాడి, బెల్లడోనా–200ను రోజుకు3 డోస్‌ల చొప్పున వాడవలెను.

**నిద్రలో నల్లగ్రుడ్డు పైకిపోయి, తెల్లగ్రుడ్డు కనిపించుట:** హెల్లెబోరస్ ఫొయెటిడస్–200ను 3సార్లు వాడవలెను.

**నిద్రలో మూలుగులు :** బెల్లడోనా–200ను 3 డోస్‌లు వాడవలెను. తరువాత స్టానమ్–200ను 3సార్లు వాడవలెను.

**నిద్రలో కొరుకుట :** సినా–200ను ప్రతిరోజు రోజుకు 2సార్లు చొప్పున వాడుతూ, ఓపియమ్–200ను రోజుకు ఒక్కడోస్ చొప్పున ఒక వారము వాడవలెను.

**నిద్రలో గుఱ్ఱుపెట్టుట :** స్ట్రెమోనియమ్–200ను ప్రతిరోజు రోజుకు 2డోస్‌ల చొప్పున వాడుతూ; ఓపియమ్–200ను రోజుకు ఒకడోస్ చొప్పున ఒకవారము వాడవలెను.

**నిద్రలో పాటలు-మాటలు-ఏడ్చుట మొదలగు లక్షణములకు:** సల్ఫర్–200ను ఒక్క 3డోస్‌లువాడి, తరువాత కాల్కేరియాకార్బ్–200ను 3డోస్‌లు వాడవలెను. 5ఫాస్ టాబ్లెట్స్‌ను రోజుకు 3 టాబ్లెట్స్ చొప్పున 3సారులు వాడవలెను.

**నిద్రలో నడుచుట, ఏవో పనులను చేయుట:** బ్రైయోనియా–200ను ప్రతిరోజు 2 డోస్‌ల చొప్పున వాడుచూ, ఓపియమ్–200ను ఒక్క 3డోస్‌లు వాడవలెను. ఆ తరువాత ఫాస్ఫరస్–200ను 3డోస్‌లు వాడి; సిలికా–200, నేట్రమ్‌మూర్–200లను ప్రతిరోజు 2సారులు చొప్పున వాడవలెను.





**నిద్రలో బట్టలను పీక్కొనుట, ఏదో పోయినట్లుగా పక్కను వెదకుట :** హైయోశ్యామస్–200ను ఒక రోజుకు 3డోస్‌ల చొప్పున ప్రతిరోజు వాడవలెను. తరువాత బెల్లడోనా–200ను 3డోస్‌లు వాడవలెను.

**నిద్రలో నోటిని తెరచి ఉంచుట:** ఓపియమ్–200ను 3డోస్‌లు వాడి, సాంబ్యూకస్–200ను రోజుకు 2డోస్‌లు వాడవలెను.

**నిద్రలో మెలకువవచ్చినచో నిద్ర పట్టకపోవుట:** సల్ఫర్–30ని 3డోస్‌లు వాడి; నేట్రమ్‌మూర్–200, సైలీషియా–200లను ప్రతిరోజూ వాడవలెను. ఫైవ్‌ఫాస్– 6×నూ వాడవలెను.

**నిద్ర లేపినచో తాను ఎక్కడ ఉన్నది తెలియకపోవుట:** పల్స్–200ను 3డోస్‌లు, ప్లాటినమ్–200న 3డోస్‌లు వాడవలెను.

**నిద్రలో చెమట :** సాంబ్యూకస్–200ను 3డోస్‌లు వాడి, నేట్రమ్‌మూర్–200ను ప్రతిరోజు ఒకడోస్ చొప్పున వాడవలెను.

## కలలు

**ఆపద వచ్చినట్లు :** సల్ఫ్యూరిక్‌ఏసిడ్–200ను 3డోస్‌లు వాడి, నక్స్–200ను ప్రతిరాత్రి ఒకడోస్ చొప్పున వాడవలెను.

**జంతు సంబంధమైనవి :** ఆర్నికా–200ను ప్రతిరోజు ఒక్కడోస్ వాడుతూ, ఏసిడ్‌ఫాస్–1m ను ఒకడోస్ వాడవలెను.

**ఆరోజు జరిగిన వ్యాపారము (ఆరోజు జరిగిన సంఘటన)లను గూర్చి:** నక్స్–200ను ప్రతిరాత్రి పూట ఒక్కడోస్ వాడుతూ; రుస్టాక్స్–200, బ్రై–200లను మార్చిమార్చి వాడవలెను.

**శవములు(మృతినొందినవారు)కనిపించుట :** మెగ్నీషియా కార్బ్–200ను 3డోస్‌లు, తూజా–200ను 3డోస్‌లు వాడవలెను.

**దడుపు తరువాతి భయమువలన :** ఎకోనైట్–200ను 3డోస్‌లు వాడి, సల్ఫర్–200ను ఒకడోస్ వాడవలెను.

**శృంగారపరమైన కలలు :** ఫాస్ఫరస్–200ను ఒక్కడోస్ వాడవలెను. నక్స్–200 ను ప్రతిరాత్రి ఒక్కడోస్ చొప్పున వాడవలెను. తూజా–200, సల్ఫర్–200 కూడా పనిచేయును.

**దొంగలు, హత్యలు, రక్తపాతము:** నేట్రమ్‌మూర్-200, కాలీఫాస్-200 లను ప్రతిరోజు 3సారులు వాడుతూ, మెర్క్‌సోల్-1mను 1డోస్, మెగ్నీషియా కార్బ్ -200ను 3డోస్‌లు వాడవలెను.

**నీటి సంబంధమైన కలలు:** ఎమ్మోనియమ్ మ్యూరియాటికమ్-200ను కొన్ని డోస్‌లు వాడవలెను.

**సంభోగము చేస్తున్నట్లు కలవచ్చి, స్ఖలన మగుట:** కోబాల్టమ్-200నుకొన్ని డోస్‌లు వాడి, సల్ఫర్-200ను 3డోస్‌లు వాడవలెను.

**మూత్ర విసర్జన చేస్తున్నట్లుగా కలవచ్చి, మూత్ర విసర్జనము చేయుట:** క్రియోసోటమ్-200ను రోజుకు ఒకడోస్ చొప్పున; మెర్క్‌బిన్ అయోడ్-200ను రోజుకు ఒక డోస్ చొప్పున వాడవలెను.

**ప్రేమభంగము వలన అనగా ప్రియుడు లేదా ప్రియురాలు విడిపోవుటగాని; తల్లి- తండ్రి, భార్య-పిల్లలు, స్నేహితులు చనిపోవుట వలనగాని వారే కలలోకి వచ్చి నిద్రాభంగము కలుగుటలేదా నిద్రపట్టకపోవుట:** ఇగ్నీషియా-mను వారమునకు ఒకడోస్, నేట్రమ్ మూర్-1mను వారమునకు ఒక్కడోస్ చొప్పున వాడుచూ; ఫైవ్‌ఫాస్-6×ను ప్రతిరోజు రోజుకు 3 సారులు చొప్పున వాడవలెను.

(వీటిని గుఱించి ఇంకనూ విపులముగా తెలుపుటకు స్థలాభావము గావున ముగించడమైనది. ఆసక్తి గలవారు, 'హోమియో మెటీరియా మెడికా' 'లక్షదీపిక' లను చదువుట మంచిది. హోమియో చికిత్సకు ఇవి ఎంతగానో ఉపయోగిస్తాయి- రచయిత)

## హోమియో-ప్రథమ చికిత్స

నిత్యజీవితములో మనకు జరుగునట్టి ప్రమాదముల నుండి కాపాడుకొనుటకు, వైద్యుని వద్దకు వెళ్లేముందు బాధల తీవ్రతను తగ్గించుకొనుటకు ఉపయోగించు వైద్య చికిత్సను "ప్రథమ చికిత్స" అంటారు, అటువంటి చికిత్స చేయుటకు కొన్ని హోమియోపతి ఔషధములను ఉపయోగించుకో వచ్చును. వీటిని ప్రథమములో వాడుటవలన ఆబాధల ఉద్రిక్తత తగ్గి, రోగి-ప్రమాదమునుండి బయట పడతారు. ఆ తరువాత అనుభవముగల వైద్యుని వద్దకు తీసుకొని వెళ్ళి, సరియైన చికిత్సను చేయించవలెను.

**1.స్పృహను కోల్పోవుట**

సహజముగా షాక్‌వలన; హిస్టీరియా, మూర్ఛ, చిన్నబిడ్డలకు కలుగు చిన్నబొడ్డనొప్పి (శిశువాతము) మొదలగు వ్యాధులలో ఫిట్స్‌వచ్చుట వలన రోగి స్పృహ కోల్పోవు చుండును.





**చికిత్స:** 1.అమ్మోనియమ్ కాస్టికమ్ ను ఈమందును దూదిమీద నాలుగు లేదా ఐదుబొట్లువేసి; ఈదూదిని స్పృహ వచ్చువరకు రోగి ముక్కు వద్ద ఉంచి, వాసన చూపవలెను. 2. చల్లని నీటిని నొసట చల్లవలెను. 3. బెల్లడోనా-30ని 3మాత్రలు నోటిలో వేయవలెను.

**2. ధనుర్వాతము**

అల్లోపతిలో "క్లోస్ట్రిడియమ్ టెటామ్" అను సూక్ష్మజీవుల వలన "ఈ వ్యాధి వచ్చున"ని "వాటియందు 'టాక్సిన్' అను విషము కలద"ని చెప్పబడుచున్నది.

**వ్యాధి నడక కాలము:** కొన్ని గంటల నుండి-15 రోజులు లోపు!

**వ్యాధి తీవ్రత:** 3వ రోజునుండి 7వ రోజు వరకు!

**వ్యాధిస్థితి:** రోగి ధనుస్సువలె వెనుకకు వంగిపోవును. ప్రారంభములో నోటి అంకెళ్ళు-బిగుసుకు పోవును. నాడి కొట్టుకొను వేగము-72 నుండి 180 వరకు ఉండును. శారీరక ఉష్ణోగ్రత-104 నుండి 110 వరకు పెరిగిపోవును.

**జాగ్రత్తలు:**చీకటి గదిలోనే ఉంచవలెను. విశ్రాంతి చాల ముఖ్యము. ఏ శబ్దము వినపడకుండ చెవులకు దూదిని పెట్టవలెను. బహిరంగమైన గాలి తగులకూడదు.

**ఆహారము:** నిమ్మరసము, పాలు, గ్లూకోజ్!

**వ్యాధి నివారణ ఔషధములు:** హైపెరికమ్-200, లెడమ్-200. ఈ రెండు ఔషధములను 3 గంటలకు ఒక్కడోస్‌చొప్పున వ్యాధిఉద్రేకము తగ్గు వరకు వాడవలెను.

**వ్యాధి నిరోధక ఔషధములు:** పైఔషధమును దినమునకు 3సారులు చొప్పున 3 దినములు వాడితే 'ధనుర్వాతము' రాకుండా ఆగుతుంది.

మొనతో కూడిన మేకులు, సూదులు మొదలగునవి గ్రుచ్చుకొన్నప్పుడు ధనుర్వాతము రాకుండా; వాటివలన చెడుఫలితములు కలుగకుండా, లెడమ్-200ను రోజుకు 3సారులు చొప్పున 3దినములు వాడవలెను. ఎముక దెబ్బలకు, వెన్నుపూస దెబ్బలకు, గాయములకు ధనుర్వాతము రాకుండా హైపెరికమ్-200ను దినమునకు 3సారులు చొప్పున 3 దినములు వాడవలెను.

### 3. ఎక్లాంప్సియా (గుల్లపు వాతము)

ఇది సహజముగా గర్భిణీతో ఉన్న స్త్రీలకు ప్రసవించిన తరువాత వచ్చు ఒకరకమగు మూర్ఛలవ్యాధి. దీనికి వ్యాధినిరోధకముగా తూజా-200ను దినము నకు 3సార్లు చొప్పున 3దినములు వాడవలెను.

### 4. హైడ్రోఫోబియ (వెఱ్ఱికుక్క, నక్క, కోతి మొదలగు జంతువులు కరచుటచే వచ్చు, జలోన్మాదము)

**వ్యాధికాలము**: 10 రోజలనుండి 90 రోజులలోపు లేదా 3నెలల నుండి 6 నెలలలోపు లేదా అరుదుగా 2సంవత్సరముల లోపులో కూడా రావచ్చును. పిచ్చెక్కిన జంతువులు-సాధారణముగా ఇరువది రోజులలోపే చనిపోతాయి. జంతువులు కరచి నపుడు ఆ కరచిన జంతువులను-20రోజుల వరకు కాపాడ గలిగితే వాటికి పిచ్చెక్కి నది,లేనిది తెలిసిపోతుంది. దీనివలన"పిచ్చిజంతువా? కాదా? అనినిర్ధారణ అవుతుంది.

**చికిత్స :** "టర్కిష్ బాత్" అనగా వేడిగల మంటవద్ద బహిరంగ గాలి తగలకుండా రోగిని ఉంచి, బాగా చెమట పట్టిన తరువాత వేడినీటితో స్నానము చేయించుట (వేడినీటి స్నానము చేయునంత వరకు రోగికి బహిరంగ గాలి తగుట కూడదు) హాట్ ఎయిర్‌బాత్ (ఆవిరిస్నానము) పిచ్చెక్కిన జంతువులు కరచిన చోట ఉడకబెట్టిన సున్నమును పూయుచు, రంగు మారకుండ ఉన్నయెడల ఆ పూసిన సున్నము నంతను ఉప్పునీటితో కడుగవలెను.

**వ్యాధి నిరోధక ఔషధములు :** ఈక్రింద ఇచ్చిన మందులను దినమునకు 3సారుల చొప్పున ఒక వారము వాడవలెను.

"కాంథారిస్ దీనిని 200 పవర్‌లో వాడమ"ని డాక్టర్ హేరింగ్ సలహా ఇచ్చారు. "30 పవర్‌లో వాడుము" అని డాక్టర్ హార్ట్ లాబ్, డా॥ ట్రంక్స్ చెప్పారు. డా॥హానిమాన్ బెల్లడోనను 30 పవర్‌లో వాడుము అని చెప్పారు. డా॥ బోరిక్ "కాలిఫాస్, మెగ్నీషియా ఫాస్‌లను 6× పవర్‌లో వాడమని చెప్పారు. నా అనుభవములో గల 30 సంవత్సర ముల నుండి వ్యాధినిరోధక నివారణ ఔషధముగా 'ఎఖినేషియా' మదర్‌టించర్‌ను ఒక ఔన్స్‌నీటియందు 10బొట్లువేసి, దినమునకు 3సార్లు చొప్పున ఒకవారము దినములు వాడుతున్నాను. దీనితో బెల్లడోన-30ని దినమునకు 3సార్లు చొప్పున ఒక వారము రోజులు వాడుటమంచిది.

**వ్యాధి నివారణ ఔషధములు :** 'హైడ్రోఫోబినమ్, ఎగేవ్ అమెరికానా స్ట్రెమోనియమ్'లను వాడి నివారణచేయవచ్చును. పిచ్చిఎక్కిన కుక్క మరియు జంతువులు, కోపముతో కూడిన మృగములు, కోపముతో కొరకిన మనుష్యుల కాటులకు ఆర్నికాను వాడరాదు.



### 5. పాముకాటు

**'టర్కిష్‌బాత్' :** ఆవిరి స్నానము (స్టీమ్‌బాత్) చేయించవలెను. ఆ కరచిన భాగమును 'పొటాషియమ్ ఫెర్మాంగనేట్ లోషన్'తో కడుగవలెను.

**నివారణ ఔషధములు:** ఎఖినేషియా మదర్ టించర్‌ను తీవ్రతలను బట్టి ప్రతి 10 నిమిషములకు ఒకసారి అర ఔన్స్‌నీటిలో 10 బొట్లు కలిపి త్రాగించవలెను. దీనితో 'ఎమోనియమ్ కార్బ్'-30నీ వాడవలెను.

డా॥ కౌపెర్త్‌వెట్ "సెడ్రాన్ మదర్ టించర్‌ను గాని లేదా 30 పొటెన్సీలో గాని వాడమ"న్నారు.

"దృష్టపాకు పసరును లోపలకుఇచ్చి, పైకి అవేఆకులను నూరి కట్టుటవలన పాముวిషము హరించున"ని ఆయుర్వేదములో చెప్పబడినది.

డా॥ లోపాక్ "ఎసెటిక్ ఏసిడ్ మదర్‌టించర్ లేదా 6× పొటెన్సీలో వాడమ'ని సలహా ఇచ్చారు.

డా॥ పరోతిషేపర్డ్ అనునామె తన ప్రాక్టికల్ మెడిసన్స్అను పుస్తకములో "పొగాకును నీటిలో నానవేసి, ఆ రసమును త్రాగించి, ఆ నీటితో పైన (కరచినచోట) కడిగితే పాము విషము హరించున"ని చెప్పినది.

నా స్వానుభవములో ఎఖినేషియా మదర్ టించర్‌ను ప్రతి 5 నిమిషములకు ఒకసారి అరఔన్స్ నీటిలో 10బొట్లువేసి, లోపలికిత్రాగిస్తూ అమ్మోనియమ్ కార్బ్-30ని ప్రతి పావు గంటకు 1 మోతాదు చొప్పున వాడుటవలన పాము విషము హరించి, రోగులు స్వస్థతను చెందారు.

### 6. తేలు, జెఱ్ఱి, మండ్రగబ్బలు కుట్టుటచే కలుగు విషఫలితములకు

ఎఖినేషియా మదర్ టించర్‌ను ప్రతి నిమిషములకుఒకసారి అర ఔన్స్ నీటియందు 10బొట్లు చొప్పున కలిపి త్రాగిస్తూ దీనినే పైపూతకుమందుగా వాడుతూ, లెడమ్ 30ని 5 నిమిషములకు ఒక మోతాదు చొప్పున వాడవలెను. ఇవియే కాక, ఆర్సెనికమ్ ఆల్బ్-30; నేట్రమ్‌మూర్-30లు కూడ పనిచేయును.

### 7. తేనె టీగలు, కందురీగలు కుట్టుట

**తేనెటీగలు కుట్టుట వలన కలిగిన బాధలకు :** కార్బోలిక్ ఆసిడ్-30, నేట్రమ్ మూర్-30లను అర గంటకు ఒకడోస్ చొప్పున కొన్ని డోస్‌లు వాడవలెను.

**కందురీగలు కుట్టిన ఎడల :** ఏపిస్-30 లేదా ఎ సిటిక్ ఏసిడ్-30ని ప్రతి అరగంటకు ఒక మోతాదు చొప్పున 3 లేదా 4మోతాదులు వాడితే చాలును.

**8.దోమలు కుట్టుట :** లెడమ్-30, నేట్రమ్మూర్-30లను రోజుకు 3 సార్లు చొప్పున 3 రోజులు వాడవలెను.

**9. నల్లులు కుట్టుట:** హైపెరికమ్-30ని రోజుకు 3డోస్‌లు చొప్పున వాడవలెను.

**10. సాలీడు, బల్లులవిషము :** లెకెసిన్-30ని వాడవలెను.

**11. ఎలుక, చుంచు, పందికొక్కులు కరచుట :** లెడమ్-30ని రోజుకు 3సార్లు చొప్పున కొన్ని రోజులు వాడవలెను.

**12. జలగ కుట్టుట :** లెకెసిన్-30ని 3 పూటలా 3డోస్‌లు వాడవలెను.

పై జంతువులు కుట్టుట వలన చర్మము రంగు మారుట : ఏన్టిపైరినమ్ మదర్ టించర్‌ను పైకిరాసి, దీనినే 30 పవర్‌లో రోజుకు 2 సారులు చొప్పున కొంతకాలము వాడవలెను.

**13. పేలు :** ఎఖినేషియా-Q ను తల వెంట్రుకలు రాచుకుంటూ దీనినే కడుపు లోనికి రోజుకు 2సారుల చొప్పున వాడుతూ N.M-30 ని ప్రతిరోజు రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.

**దెబ్బలు, తెగినగాయములకు, షాక్(కరెంట్), కాల్పులు, మొదలగు ప్రమాదములు జరిగినప్పుడు వెంటనే చేయవలసిన ప్రథమ చికిత్స**

**1. దెబ్బల వలన లేదా నలుగుట వలన చర్మముమీద నీలిరంగుగా లేదా నల్లగా కమిలిన బాధలు :** ఆర్నిక మదర్ టించర్‌ను పైకి రాచుకుంటూ దీనినే-200 పొటెన్సీలో రోజుకు 3సార్లు చొప్పున బాధలు తగ్గువరకు వాడవలెను.

**2.ఎముకలు-విరుగుట లేదా చిట్లుట-వాచుట**

**ఎముకపొర వాచుట లేదా ఎముక చిట్లుట మొదలగు వాటికి :** రూట-200ను రోజుకు 3సార్లు చొప్పున కొంత కాలము వాడవలెను. దీనితోపాటు సింఫైటమ్-200ను వాడవలెను.

**ఎముక విరుగుట:** విరిగిన ఎముకను ముందుగా సరిచేసి కట్టుకట్టవలెను. ఆ ఎముక త్వరితముగా అతుకు కొనుటకు కాల్కేరియా ఫాస్-6×,కాల్కేరియా ఫ్లోర్-6×లను పౌడర్ రూపములోనే మిశ్రితముచేసి;ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున ఎముకలు అతుకుకొను వరకు వాడుకోవలెను.





**3. కీళ్ళు తొలగుట లేదా బెణకుట :** కీళ్ళు తొలగినపుడు ముందుగా యథా స్థానమునకు చేర్చాలి. ఇలా సరిచేసిన తరువాత వచ్చువాపు నొప్పు లకు లేదా దీర్ఘకాలిక బెణకునొప్పులకు రుస్టాక్స్-200ను రోజుకు 3సార్లు చొప్పున కొన్ని రోజులపాటు వాడవలెను. (ఒక్కొక్కప్పుడు హెచ్చుపొటెన్సీలలో వాడవలసి రావచ్చును)

**4. తెగిన గాయములు :** రక్తస్రావము కట్టుటకు క్యాలెండులా మదర్ టించర్‌నుగాని లేదా పౌడర్‌నుగాని వేసి 'డ్రస్సింగ్' చేయవలెను. కడుపు లోనికి ఫెర్రమ్‌ఫాస్-6×, హెమోమెల్లిస్ మదర్ టించర్‌లను రక్తస్రావము ఆగు వరకు ప్రతి 5 నిమిషములకు ఒకడోస్ చొప్పున వాడవలెను.

**5. కరెంట్‌షాక్ :** హైపెరికమ్-200ను ప్రతి 3 గంటలకు ఒకడోస్ చొప్పున 4లేదా 5డోస్‌లు వాడవలెను. ఆ తరువాత లెడమ్-30ని రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.

**6.కాల్పులు :** శరీరము కాలుటవలన బొబ్బలు ఏర్పడితే కేంథారిస్ మదర్ టించర్‌ను కొబ్బరినూనెలో కలిపి పైపూతగా వ్రాసిన ఎడల మంటలు, చురుకులు తగ్గిపోతాయి. కడుపులోనికి కేంథారిస్-30, నేట్రమ్ మూర్-30లను మార్చిమార్చి ప్రతి 6 గంటలకు ఒక్కడోస్ చొప్పున వాడ వలెను. పుండ్లుపడిన ఎడల సైలీషియా- 200, కాల్కేరియా సల్ఫ్-200లను ప్రతిరోజు రోజుకు 3సారులు చొప్పున వాడవలయును.

**7. దెబ్బలు తగులుట వలన నొప్పి కట్టుట :** బెల్లిస్ పెరెన్నిస్ మదర్ టించర్‌ను పైపూతగావ్రాసి, దీనినే 30 పొటెన్సీలో రోజుకు 3సార్లు చొప్పున వాడవలెను.

**8. శరీరములో ఏదేని భాగమునకు పక్షవాతము వచ్చుట:** కాస్టికమ్-200ను ప్రతి 3గంటలకు ఒకడోస్ చొప్పున 3 లేదా 4డోస్‌లు వాడి, తరు వాత అనుభవము గల వైద్యుని వద్దకు తీసుకొని వెళ్ళవలెను.

**9. ఏవ్యాధి సంధైనను శరీరమంతటాచలువ కమ్మి, నాడి సన్నగిల్లి, నీరసము వచ్చుట :** కార్బోవేజ్-200, కాలీఫాస్-200లను ప్రతి 5 నిమిషములకు ఒక్కడోస్ చొప్పున 4 లేదా 5 డోస్‌లు వాడినఎడల రోగి యొక్క ప్రాణములు కాపాడబడతాయి.

-)0(-

### ప్రత్యేక అనుబంధము-1

## ఎయిడ్స్

**(A.I.D.S= ACQUIRED IMMUNE DEFICIENCY SYNDROME)**

'ఎక్వైర్డ్ ఇమ్యూన్ డిఫిసెయెన్సీ సిన్‌డ్రోమ్'కు సంక్షిప్త పద రూపమే "ఎయిడ్స్" అంటే...! గల ఇరువది సంవత్సరములుగా మానవాళిని విపరీత భయాందోళనలకు గుఱిచేస్తున్న ఎయిడ్స్-నిజమునకు 'వ్యాధికాదనే" చెప్పాలి. ఐతే H.I.V వైరస్ సోకిన వారికి ఏవ్యాధి వచ్చినా ఇక అదివారి 'శరీరమునుండి దూరమగుట బహు దుర్లభము. కారణము వ్యాధులను పారద్రోలుటకు మనశరీర ములోఉన్న 'వ్యాధినిరోధక యంత్రాంగము' యొక్క పనిని 'హ్యూమన్ ఇమ్మునో డెఫిసియన్సీ వైరస్ (H.I.V) నాశనము చేస్తుంది.

H.I.V వ్యాధి నిరోధక కణములను పుట్టించే 'T-సెల్స్'ను నాశనము చేయుట ద్వారా ఆవ్యక్తి జీవితమునే అందకార బంధురము చేస్తున్నది. ఎయిడ్స్‌ను రాకుండా చూచుకొనుటయే గానీ వచ్చిన తరువాత ఆ మహమ్మారిని నివారించుట అటుంచి, దానిని అదుపు చేయుట కూడ చాల కష్టము.

హోమియోపతి వైద్య సిద్ధాంతము ప్రకారము "సిఫిలిస్+సైకోసిస్ కలయిక వలన H.I.V సోకి,ఎయిడ్స్ వస్తున్నద"ని భావించుట జరుగుచున్నది. అమెరికా, జర్మనీ, చైనా, భారత దేశముల నందలి హోమియోపతిక్ రీసెర్చ్ సెంటర్స్ వారు తెలియజేసినటువంటి కొన్ని అతి ముఖ్యమైన హోమియోపతి మందులను ఈ క్రింద తెలియజేయడ మైనది. వాటితో నేను చాలకేస్‌లను అదుపులోనికి తెచ్చుట జరిగినది. ఈ మందులతోటి H.I.V రాకుండానూ, వచ్చిన తరువాత అదుపులో పెట్టుటనూ చేయవచ్చును.

H.I.V **నిరోధక పద్ధతులు :** లైంగిక సంపర్కము దంపతుల మధ్యనేతప్ప ఇతరత్రా ఉండకూడదు. ఇతరత్రా సంపర్క ముండేవారు తప్పకుండా 'కండోమ్' లను ధరించవలెను. సిరంజ్‌లు, నీడిల్స్, బ్లేడ్స్ మున్నగు వాటిని డిస్పోజబుల్స్‌నే వాడవలెను.



**ఎయిడ్స్ ముఖ్య లక్షణములు :** శారీరక బరువు తగ్గిపోతుంది. జ్వరము వస్తేపోదు, విరేచనములైతేతగ్గవు. ఆకలి మందగిస్తుంది. చర్మము దురదగా ఉంటుంది. నిద్ర పట్టదు, జలుబు-దగ్గులు వంటి ఏచిన్న వ్యాధి సోకినా అది దీర్ఘవ్యాధిగా రూపాంత రము చెందుతుందే తప్ప ఏమాత్రము తగ్గ ముఖము పట్టదు. T.B లో వలె E.S.R. అధికమై, ఊపిరితిత్తుల యందు నెమ్ము జేరుతుంది.

**ఎయిడ్స్ మందులు :** వ్యాధి నిరోధక శక్తి లోపించుట దీని ప్రధాన లక్షణము గావున దీనికి కార్బోవెజ్‌ను 200 పవర్‌లో వాడవలెను. ఇంకా ఫైవ్‌ఫాస్-6×ను వాడవలెను.

చర్మము దురదలుగా ఉన్నవారు ఎఖినేషియా మదర్ టించర్‌నూ, సల్ఫర్ 200ను వాడవలెను.

శారీరకముగా బరువును కోల్పోయి, రక్తక్షీణత గలవారు ఫెర్రమ్‌మెట్-6×, కాల్కేరియాఫాస్-6×, నేట్రమ్‌మూర్-6×లను వాడవలెను.

పైన చెప్పిన లక్షణములకు పైన చెప్పిన మందులను వాడుతూనే సిఫిలిస్+ సైకోసిస్ వ్యాధులకు వాడే మందులను కూడ వాడవలెను.

సిఫిలినమ్‌ను 1m పవర్‌లో వారమునకు ఒకడోస్ చొప్పున నాలుగు డోస్‌లను వాడవలెను. రెండవనెలలో మెడోరినమ్‌ను కూడా 1m పవర్‌లో సిఫిలినమ్ వలెనే వాడవలెను. ఇదే విధముగా మూడవ నెలలో ట్యుబెర్కులినమ్‌ను 1m పవర్‌లో వాడవలెను.

పై మందులకు గుణము కనిపించని పక్షములో అశ్రద్ధను చేయక వెను వెంటనే క్వాలిఫైడ్ అండ్ ఎక్స్‌పీరియన్స్‌డ్ డాక్టర్‌ను సంప్రదించ వలెను. ఎయిడ్స్‌ను నివారించుట అసాధ్యము. దానిని అదుపులోన ఉంచుటే బహు కష్టసాధ్యము. కావున H.I.Vని రాకుండా చూచుకొనుటయే ఉత్తమ మార్గము!! ఈ కఠిన సత్య మును మీరు తెలిసికొనుటయే గాదు. ఎల్లవారలకు తెలియజేసి, మానవాళిని రక్షించు యజ్ఞములో మీ సమిధను మీరు వేయగలరు.

59

### ప్రత్యేక అనుబంధము-2

## HEPATITIS (హైపటైటిస్-కాలేయము వాచుట)-B

'హైపటైటిస్-B' వ్యాధివచ్చిన తరువాత దీనిని నివారించుటకంటే ఈ వ్యాధి రాకుండా నిరోధించుటయే అతిముఖ్యము.

'హైపటైటిస్-B' వచ్చిన తరువాత అల్లోపతి వైద్య విధానములో "చికిత్సలేదు" అని తెలియవస్తున్నది. ఇందులో రాకుండా జాగ్రత్తలను తీసికొనుట, వచ్చినపుడు ఉప శాంతికి చికిత్సలు చేయుటమాత్రమే కలదు.

'హైపటైటిస్-B'కి వ్యాధి నివారక, వ్యాధి నిరోధక ఔషధములు-భారతీయ వైద్య విధానమైన ఆయుర్వేదములో కలవ"ని ఆ సంబంధిత ఆయుర్వేద వైద్యులు చెబుతున్నారు.

'హైపటైటిస్-B'కి హోమియోపతి వైద్యములో చక్కని మందులు ఉన్నాయి. వీటితో ఈ వ్యాధిగ్రస్తుల నెందరినో స్వస్థత పరచి యున్నాను.

**పచ్చకామెరల సాధారణ లక్షణములు :** తిన్నవి అరుగకపోవుట, ఆకలి మంద గించుట, మూత్రము పచ్చగానుండుట, నేత్రములు - పచ్చబడుట, జ్వరము వచ్చుట మున్నగు లక్షణములు కనిపిస్తాయి. వ్యాధి బాగా ముదిరితే పొట్టకు నీరు పడుతుంది. శరీర మంతటా నీరు చేరుతుంది. నీరసము అధికమౌతుంది. రక్త క్షీణత ఏర్పడుతుంది.

**కామెరల వ్యాధికి పత్యము :** వ్యాధి పూర్తిగా తగ్గువరకు శరీరము అలసి పోవు ఎట్టి పనులనూ చేయరాదు. ముఖ్యముగా రతి క్రీడలో పాల్గొని అలసి పోవుట పనికిరాదు. తేలికగా అరగే పండ్లు,మజ్జిగ, లేదా కొబ్బరినీరు, అన్నమును పిసికి తీసివేసిన మజ్జిగజీవ మున్నగు ఆహారపదార్థములనే తినవలెను. విశ్రాంతి అతిముఖ్యము. ఎండలో, చలిగాలి-మంచులో అసలు తిరుగరాదు. వేళకు నిద్ర పోవలెను. శిరఃస్నానమును విసర్జించవలెను. అలుపురాకుండా నిదానముగా మామూలు స్నానమును చేయవచ్చును.

**కామెరలకు చికిత్స :** చెలిడోనియమ్ మదర్ టించర్‌ను పదిచుక్కలు తీసికొని, అరకప్పు నీటిలో కలిపి, ఈ మొత్తమును ఒక్కమోతాదుగా రోజులో నాలుగు మోతా దులు త్రాగవలెను. ఇదే విధముగా కార్డూస్ మదర్ టించర్‌ను కూడ త్రాగవలెను.

కాలిమూర్-30, నేట్రమ్‌ఫాస్-30 వీటిని మూడు మాత్రలు ఒక డోస్‌గా రోజుకు నాలుగు డోస్‌లను వేసికోవలెను.



జ్వరముకూడా ఉంటే పైమందులతో పాటుగా ఫెర్రమ్‌ఫాస్-30ని జ్వరతీవ్ర తనుబట్టి 3 నుండి 5డోస్‌ల వరకు వాడవలెను. దాహము, నీరసము, విరేచన బద్ధకము ఉన్నపుడు బ్రైయోనియా-30,నేట్రమ్‌మూర్-30లను కూడ పైమందులతో పాటుగా వాడవలెను.

శారీరకముగా నీరు పట్టిన ఎడల ఆర్సెనికమ్ ఆల్బ్‌ను 30 పవర్‌లోన ప్రతిరోజు రోజూ మూడుపూటలా మూడుడోస్‌లను వాడవలెను.

శారీరక చర్మమునకు దురదలున్న ఎడల సల్ఫర్-200ను ఒక్కరోజే మూడుడోస్‌లనువాడి ఆపవలెను. ఎకినేషియా మదర్ టించర్‌ను పదిచుక్కలు తీసికొని, వీటిని అరకప్పు నీటిలోకలిపి త్రాగవలెను. ఈ విధముగా రోజుకు మూడు సారులు చొప్పున తీసికోవలెను.

కామెరల వ్యాధి వైరస్‌వలన దీర్ఘవ్యాధియై, 'హైపటైటిస్-B' అను భయంకర వ్యాధిగా రూపాంతరము చెందుతుంది. ఈవ్యాధిని ల్యాబ్ టెస్ట్‌ల అనంతరము వైద్యులు గుర్తిస్తారు. ఇంతకు ముందుగా చెప్పిన చికిత్సల వలన 'హైపటై టిస్-B' అదుపులోన ఉంటుందే గానీ, వ్యాధినివారించబడదు. కావున త్వరగా నైపుణ్యానుభవముగల వైద్యుని వెంటనే సంప్రదించవలెను. ఈవ్యాధి భర్తకు వచ్చినా, భార్యకు వచ్చినా దంపతులిద్దరూ చికిత్సను పొంద వలసిఉన్నది.

ఈ కామెరల వ్యాధిని నివారించుట కష్టసాధ్యము కనుక రాకుండా నిరోధించు కొనుట చాల అత్యవసరము. ఇది **"ఎయిడ్స్‌కంటెను ప్రమాదకర చిమైనది"** అని వైద్యులు భావిస్తున్నారు.

## ప్రత్యేక అనుబంధము-3

## తరచుగా ఉపయోగించే-హోమియో మందుల డిక్షనరి

## A DICTIONARY ON HOMEOPATHY MEDICINES

### A

Acetic Acid (ఎసిటిక్ ఎసిడ్)

Acid Crysarobinum (ఏసిడ్ క్రైసరోబినమ్ లేదా క్రైసరోబినమ్)

Aconite or Aconitum Napellus నాపెల్లస్ లేదా ఎకోనైట్ నాప్)

Aconitinum or Acinitine (ఎకోనైటినమ్ లేదా ఎకోనైటిన్)

Actea Racemosa or Cimicifuga Racemosa(అక్టియా రెసెమొసాలేదాసిమిసి ఫ్యూగా రెసెమొసా)

Aesculus Hippocastanum (ఎస్క్యులస్ హిపొకాస్టనమ్ లేదా ఎస్క్యులస్ హిప్)

Aethusa cynapium (ఎతుజా సైనాపియమ్ లేదా ఎతుజా)

Agaricus Emeticus (ఎగారికస్ ఎమెటికస్ లేదా ఎగారికస్)

Agave Americana (ఎగేవ్ అమెరికానా లేదా ఎగేవ్)

Agnus castus (ఎగ్నస్ కాస్టస్ లేదా ఎగ్నస్)

Agraphis nutans (ఎగ్రఫిస్ న్యూటన్స్)

Aletris Farinosa (ఎలెట్రిస్ ఫెరినోసా)

Alfalfa (ఆల్‌ఫాల్ఫా)

Allium cepa (ఎల్లియమ్ సెపా)

Aloe Socotrina or Aloe or Aloes (ఎలో సొకొట్రినా లేదా ఎలో లేదా ఎలోస్)

Alumen (ఎల్యూమెన్=పటిక)

Alumina Aluminum oxide or Argilla (ఎల్యూమినా లేదా ఎల్యూమినమ్ ఆక్సైడ్ లేదా అర్జిల్లా)

Ambra Grisia or Ambra Grisea (అంబ్ర గ్రీసియా)

Ammonium carb (ఆమ్మోనిమమ్ కార్బ్)

Ammonium Muriaticum or Sal Ammoniac (ఆమ్మోనియమ్ మ్యూరియాటికమ్ లేదా సాల్ అమ్మోనియాక్ లేదా అమ్.మూర్.)

Amyl Nitris or Anyl Nitritie or amyl  Nitrus Ether (ఎమైల్ నైట్రిస్ లేదా ఎమైల్ నైట్రైటియె లేదా ఎమైల్ నైట్రస్ ఈథర్)

Anacardium occidentale (ఎనాకార్డియమ్ ఆక్సిడెంటల్ లేదా ఎనాకార్డ్)

Antimonium Crudum (ఏంటిమోనియమ్ క్రూడమ్ లేదా ఏంటిమ్ క్రూడ్)

Antimonium Tartaricum (ఏంటిమోనియమ్ టార్‌టారికమ్ లేదా ఏంటిమ్ టార్ట్)

Antipyrinum (ఏంటి పైరినమ్)



Apis Mellifica (ఏపిస్ మెల్లిఫికా లేదా ఏపిస్ మెల్)

Argentum Metallicum (అర్జెన్టమ్ మెటాల్లికమ్ లేదా అర్జెన్టమ్ మెట్)

Argentum Nitricum (అర్జెన్టమ్ నైట్రికమ్ లేదా అర్జ్ నైట్రిక్)

Armiracia Sativa or Cochlearia Armoracia(ఆర్మోరేసియాసతివాలేదాకొక్లేరియా ఆర్మోరేసియా)

Arnica Montana (ఆర్నికా మాన్టానా లేదా ఆర్నికా మాన్ట్)

Arsenicum Album (అర్సెనికమ్ ఆల్బుమ్ లేదా అర్సెనిక్, ఆల్బ్)

Arsenicum Iodatum (అర్సెనికమ్ ఐయోడేటమ్ లేదా ఆర్సెనిక్, ఐయోడేట్)

Arsenicum Sulphuratum Flavum(అర్సెనికమ్ సల్ఫ్యూరేటమ్ ఫ్లేవమ్ లేదా ఆర్సెనిక్ సల్ఫ్.

Arum Italicum (ఆరమ్ ఐటాలికమ్)

Arum Maculatum (ఆరమ్ మెక్యులేటమ్ లేదా ఆరమ్ మెక్)

Arum Triphyllum (ఆరమ్ ట్రైఫైల్లమ్ లేదా ఆరమ్ ట్రైఫ్)

Asafotida or Asagraea officialis (అసఫోటిడా లేదా అసగ్రయెయా అఫిషియాలిస్)

Asarum Europaeum (అసారమ్ యురోపియమ్ లేదా ఎస్యారమ్ యురోపయెమ్)

Aurum Metallicum (ఆరమ్ మెటాల్లికమ్లేదా ఆరమ్ మెట్.)

Avena Sativa (అవెనా సతివా)

### B

Baptisia Confusa Acetica (బాప్టీషియా కన్‌ప్యూసా ఎసెటికా)

Baptisia Tinctoria (బాప్టీషియా టిన్క్టోరియా)

Baryta carbonica (బెరిటా కార్బోనికా లేదా బెరిటా కార్బ్)

Belladonna (బెల్లిడోన్నా లేదా బెల్)

Bellis perennis (బెల్లిస్ పెరెన్నిస్)

Benzoicum Acidum (బెంజాయ్‌కమ్ ఎసిడమ్)

Berberis Aquifolium (బెర్బెరిస్ ఆక్విఫోలియమ్)

Berberis Vulgaris (బెర్బెరిస్ వల్గారిస్)

Blatta Orientalis (బ్లాట్‌టా ఓరియోన్టాలిస్)

Borax (బొరాక్స్)

Bromium (బ్రోమియమ్)

Bryonia Alba or Buchu (బ్రైయోనియా ఆల్బా లేదా బుచు లేదా బ్రై)

Bufo (బ్యూఫో)

### C

Cactus Grandiflorus (కాక్టస్ గ్రాన్డిఫ్లోరస్ లేదాకాక్టస్)

Cadmium (కాడ్మియమ్)

Cadmium Bromatum (కాడ్మియమ్ బ్రోమేటమ్)

Cadmium seguinum (కెలేడియమ్ సెగ్వినమ్)

Calcarea Carbonica (కాల్కేరియా కార్బోనికా లేదా కాల్కే కార్బ్)

Calcarea Fluorica or C.F (కాల్కేరియా ఫ్లోరికా లేదా కాల్కే, ఫ్లోర్)

Calcarea Iodata (కాల్కేరియా ఐయోడేటా లేదా కాల్కే ఐయోడేటా)
Calcarea phosphorica or C.P (కాల్కేరియా ఫాస్ఫారికా లేదా కాల్కే ఫాస్)
Calcarea Silicica (కాల్కేరియా సిలిసికా)
Calcarea Sulphurica or C.S (కాల్కేరియా సల్ఫ్యూరికా లేదా కాల్కే సల్ఫ్)
Calendula Officinalis (క్యాలెండ్యులా అఫిషినాలిస్ లేదా క్యాలెండ్యులా)
Camphora or Camphor (కామ్ఫోరా లేదా కేంఫర్)
Cannabis Indica (కెన్నబిస్ ఇండికా)
Cannabis Sativa (కెన్నబిస్ సతివా)
Cantharidin (కేంథారిడిన్)
Cantharia Vesicatoria (కేంథారియా వెసికటోరియా లేదా కేంథారిస్)
Carbo Vegerabilis (కార్బో వెజిటబిలిస్ లేదా కార్బో,వెజ్)
Carbolicum Acidum (కార్బోలికమ్ ఏసిడమ్ లేదా కార్బోలిక్ ఏసిడ్)
Carduus Marianus (కార్డ్యూస్ మెరీయనస్)
Caulophyllum (కాలోఫైలమ్)
Cedron (సెడ్రాన్)
Chamomilla Matricaria (కెమోమిల్లా మేట్రికేరియా లేదా కెమోమిల్లా లేదా కెమో)
Chaulmoogra (చాల్ మూగ్ర)
Chelidonium Majus (చెలిడోనియమ్ మేజస్ లేదా కెలిడోనియమ్ మేజస్)
China Boliviana (చూనా బోలీవియానా)
Chlorum (క్లోరమ్)
Chrysophanic Acidum (క్రైసోఫానిక్ ఏసిడమ్)
Cicuta Virosa (సిక్యుటా విరోసా)
Cimex Lectularius or Cimicifuga racemosa (సైమెక్స్ లాక్ట్యులారి యస్ లేదా సిమిసిఫ్యూగా రెసెమొసా)
Cina or Cinchona Boliviana or Cinchona Officinalis (సినా లేదా సింఒనాబొలివియానా లేదా సింకోనా అఫిషినాలిస్)
Clematis Erecta (క్లెమటిస్ ఎరెక్టా)
Cobaltum (కోబాల్టమ్ లేదా కోబాల్ట్)
Caca (కోకా)
Cocculus Indicus (కాక్క్యులస్ ఇండికస్ లేదా కాక్యులస్)
Coffea cruda (కాఫీ కూడా లేదా కాఫీ క్రూడ్)
Coffea Tosta (కాఫీ టోస్టా)
Colchicum (కోల్చికమ్)
Cococynthinum (కోలోసింథినమ్ లేదా కోలోసింథ్)
Coniinum (కోనియమ్ మెక్కులేటమ్ లేదా కోనియమ్)
Conicum Meculatum (కోనియమ్ మెక్యులేటమ్ లేదా కోనియమ్)
Crataegus Oxyacantha (క్రటెగస్ ఆక్సైయెకాన్తా లేదా క్రేటేగస్)
Cuprum Metallicum (కుప్రమ్ మెటాల్లికమ్లేదా కుప్రమ్ మెట్)



D

Damiana (డామియానా)
Digitalis putpurea (డిజిటాలిస్ పర్ప్యూరియా లేదా డిజిట్, పర్ప్, లేదా డైజిటాలిస్)
Drosera Rotundifolia (డ్రొసెరా రొటన్డిఫోలియా లేదా డ్రోసెరా)
Dulcamara (డాల్కమారా)

E

Echinacea (ఎఖినేషెయా)
Echinacea Anfustigolia (ఎఖినేషెయా అన్గ్యుష్టిఫోలియా)
Echinacea purpurea (ఎఖినేషియా పర్ప్యూరెయా లేదా ఎఖినేషియా పర్ప్)
Eryngium (ఇరైన్జియమ్)
Eupatorium Perfiliatum యూపటోరియమ్ పెర్ఫోలియేటమ్ లేదా యూపటోరియమ్ పెర్ఫ్
Euphrasia Officinalis (యూఫ్రేషియా అఫిషినాలిస్ లేదా యూఫ్రేషియా)

F

Ferrum Metallicum (ఫెర్రమ్ మెటాల్లికమ్ లేదా ఫెర్రమ్ మెట్)
Ferrum Muriaticum (ఫెర్రమ్ మ్యూరియాటికమ్ లేదా ఫెర్రమ్ మూర్)
Ferrum Phosphoricum or F.P (ఫెర్రమ్ ఫాస్ఫారికమ్ లేదా ఫెర్రమ్ ఫాస్)
Five phos (ఫైవ్ ఫాస్)
Fluoricum Acidum (ఫ్లోరికమ్ ఏసిడమ్ లేదా ఫ్లోరిక్ ఏసిడ్)

G

Gelsemium (జెల్సెమియమ్)
Geranium Maculatum (జెరానియమ్ మెక్కులేటమ్)
Ginseng or Gladerine Mallein or Farcine (జిన్సెంగ్ లేదా గ్లాడెరైన్ మెల్లెయిన్ లేదా ఫార్సైన్)
Glonine or Glonoinum (గ్లోనైన్ లేదా గ్లోనోయినమ్ లేదా గ్లోనోయిన్)
Graphites (గ్రాఫైటిస్)

H

Hamamelis (హెమామెలిస్)
Helleborus Foetidus (హెల్లెబోరస్ ఫోయెటిడస్)
Helleborus Niger (హెల్లెబోరస్ నైగర్)
Helleborus Orientalis (హెల్లెబోరస్ ఓరియెన్టాలిస్)
Hepar sulphuris Calcareum (హెపార్ సల్ఫ్యూరిక్ కాల్కేరియమ్ లేదా హెపార్ సల్ఫ్,కాల్క్.)
Hydrastininum Muriaticum (హైడ్రాస్టినినమ్ మ్యూరియాటికమ్)
Hydrastinum Muriaticum (హైడ్రాస్టినమ్ మ్యూరియాటికమ్ లేదా హైడ్రాస్టిన్ మ్యూర్)
Hydrastis Canadensis (హైడ్రాసిస్ కెనడెన్సిస్ లేదా హైడ్రాస్టిస్)

Hydrocootyle Asiatica హైడ్రోకూటైల్ ఆసియాటికా)
Hydrohpobinum (హైడ్రోఫోబినమ్)
Hyoscyamus Niger (హైయోశ్శ్యామస్ నైగర్ లేదా హయోశ్యామస్)
Hypericum (హైపెరికమ్)

I

Ignaria (ఇగ్నేషియా)
Iodium ఐయోడియమ్)
Ipecac or Ipomoea (ఇపెకాక్ లేదా ఇపోమ్‌యెయా)
Iris Versicolor (ఐరిస్ వెర్సికలర్)

J

Jacaranda Caroba (జకరాన్డా కరోబా లేదా జకరాన్డ్)

K

Kali Bichromicum (కాలీ బైక్రోమికమ్ లేదా కాలీ బైక్)
Kali carbobicum (కాలీ కార్బోనికమ్ లేదా కాలీ కార్బ్)
Kali Iodatum (కాలీ ఐయోడేటమ్ లేదా కాలీ ఐయోడేట్)
Kali muriaticum or K.M కాలీ మ్యూరియాటికమ్ లేదా కాలీ మూర్)
Kali Phosphoricum or K.P (కాలీ ఫాస్ఫారికమ్ లేదా కాలీ ఫాస్)
Kali Sulphuricum Chromico (కాలీ సల్ఫ్యూరికమ్ క్రోమికో)
Kalmia Latifolia (కాల్మియా లటిఫోలియా)
Kreosotum (క్రెయోసోటమ్ లేదా క్రీసోటమ్ లేదా క్రియోసోట్)

L

Lac caninum or Lac Defloratum (లాక్ కానినమ్ లేదా లాక్ డెఫ్లోరెటమ్)
Lachesis or Lachesis Lanciolatus లెకెసిస్ లేదా లెకెసిస్ లాన్సియోలేటస్)
Ledum Palustre లెడమ్ పాల్యుస్ట్రర్ లేదా లెడమ్ పాల్)
Lilium Tigrinum (లిలియమ్ టిగ్రినమ్)
Lycopodium (లైకోపోడియమ్)

M

Magnesia Carbonica (మెగ్నేషియా కార్బోనికా లేదా మెగ్నేషియా కార్బ్)
Magnesia Phosphorica or M.P (మెగ్నేషియా ఫాస్ఫారికా లేదా మెగ్నేషియా ఫాస్)
Malandrinim (మెలాడ్రినమ్)
Medorrhinum (హైడోర్రినమ్)
Medusa (మెడ్యూసా)





Mercurus (మెర్క్యూరియస్ లేదా మెర్క్)
MercuriusBin Iodatus (మెర్క్యూరియస్ బిన్ ఐయోడేటస్ లేదా మెర్క్ బిన్ ఐయోడేట్)
Mercurius bin Iocatus cum Kali Iodatum మెర్క్యూరియస్ బిన్ ఐయోడేటస్ కమ్ కాలీ ఐయోడేటమ్ లేదా మెర్క్, బిన్ ఐయోడేట్, కమ్ కాలి ఒయోడేట్)
Mercurius Corrisious or Mercurius cum Kali
(మెర్క్యూరియస్ కార్‌రోసియస్ లేదా మెర్క్యూరియస్ కమ్ కాలీ లేదా మెర్క్‌కర్)
Mercurius Proto Iodatus or Mercurius Solubitis Hahnemanni or Merc. Sol. or Mercurius Sublimatus Corrosivus (మెర్క్యూరియస్ ప్రోటో ఐయోడేటస్ లేదా మెర్క్యూరియస్ సోల్యుబిటిస్ హానెమన్ని లేదా మెర్క్‌సాల్, లేదా మెర్క్యూరియస్ సబ్లిమేటస్ కర్‌రోసివస్)
Mezereum (మెజెరెయమ్)
Milefolium (మిల్లెఫోలియమ్)
Morbillinum మోర్బిల్‌లినమ్)
Moschus (మోస్కస్)
Muriatic Acid or Muriaticum Acidum
(మ్యూరియాటిక్ ఏసిడ్ లేద మ్యూరియాటికమ్ ఏసిడమ్ లేదా ఏసిడ్ మూర్)



N

Naja Tripudians (నాజా ట్రిప్యూడియన్స్ లేదానాజా)
Natrum Carbonicum (నేట్రమ్ కార్బోనికమ్ లేదా నేట్రమ్ కార్బ్)
Natrum Muriaticum or N.M (నేట్రమ్ మ్యూరియాటికమ్ లేదా నేట్రమ్ మూర్)
Natrum Phosphocarbol (నేట్రమ్ సల్ఫోకార్బల్)
Natrum Sulphuricum or N.S (నేట్రమ్ సల్ఫ్యూరికమ్ లేదా నేట్రమ్ సల్ఫ్)
Negundium Americanum (నైట్రోసో మ్యూరియాటికమ్ ఏసిడమ్ లేదా నైట్రమ్)
Nux Moschata (నక్స్ మోస్కటా)
Nux Vomica (నక్స్ వామికా లేదా నక్స్)

O

Oenathe Crocata (ఓయెనాన్‌తె క్రొకెటా)
Opium or Opuntia (ఓపియమ్ లేదా ఓపన్టియా)
Origanum (ఒరిగానమ్)

P

Passiflora Incarnata (పాస్సిఫ్లోరా ఇన్ కార్నేటా)
Petroleum (పెట్రోలియమ్)
Phophoricum Acidum (ఫాస్ఫారికమ్ ఏసిడమ్ లేదా ఫాస్ఫరిక్ ఏసిడ్ లేదా ఏసిడ్ ఫాస్)
Phosphorus (ఫాస్ఫారస్ లేదా ఫాస్)
Phytolacca (ఫైటోలక్కా)
Phytolacca Decandra (ఫైటోలక్కా డెకాన్డ్రా)

Phytolacca Berry (ఫైటోలక్కా బెర్రి)
Picricum Acidum (ఫిక్రికమ్ ఏసిడమ్ లేదా పిక్రిక్. ఏసిడ్)
Plantago (ప్లాన్టగో)
Platinum (ప్లాటినమ్ లేదా ప్లాటిన)
Plumbum Aceticum (ప్లమ్బమ్ ఎసెటికమ్)
Plumbum Matallicum ప్లమ్బమ్ మెటాలికమ్)
Podiphyllum Peltatum పోడోఫైల్లమ్ పెల్టాటమ్)
Polytrichum (పొలైట్రికమ్)
Psoralea (సోరాలియా లేదా సోరా)
Psorinum (సోరినమ్)
Pulsatilla Nigricans (పల్సటిల్లా నైగ్రికన్స్ లేదా పల్స్.నైగ్రిక్)
Pulsatilla Nuttaliana (పల్సటిల్లా నట్‌టాలియానా లేదా పల్స్ నటాలియా)
Pyrogenium or Pyrogen (పైరోజెనియమ్ లేదా పైరోజెన్)

R

Ranunculus Bulbosus (రనన్క్యులస్ బల్బోసస్)
Ratanhia (రటానియా లేదా రటాన్‌హియా)
Rhododendron (రోడోడెన్డ్రాన్)
Rhus Toxicodendron (రూస్ టాక్సికోడెన్డ్రాన్ లేదా రుస్టాక్స్)
Ruta Graveolens (రూటా గ్రావెయోలెన్స్ లేదా రూటా)

S

Sabadilla or Cebadilla (సెబాడిల్లా)
Sabal Serrulata (సెబాల్ సెర్రులేటా)
Subina (సెబినా)
Sambucus Canadensis శామ్బ్యుకస్ కెనడెన్సిస్)
Sanbucus Nigra (శామ్బ్యుకస్ నైగ్రా)
Sanguinarinum (శాంగ్వినేరినమ్)
Sanguinarinum Canadensis (శాంగ్వినేరియమ్ కెనడెన్సిస్ లేదా శాంగ్వినేరియా)
Sarsaparilla (సార్సపరిల్లా)
Secale Cornutum (సెకెల్ కర్నుటమ్ లేదా సెకెల్ కర్)
Selenium (సెలెనియమ్)
Senecio Jacoboea (సెనిసియో జకోబోయెయా)
Senega (సెనెగా)
Sepia or Sepsinum (సెపియా లేదా సెప్సినమ్)
Silica or Sepsinum (సెపియా లేదా సెప్సినమ్)
Silica or Silicea or sil (సిలికా లేదా సైలీషెయా లేదా సెల్)



Solidago (సాలిడాగో)
Spigelia Anthelmia (స్పైజేలియా ఏన్థెల్మియా లేదా స్పైజేలియా)
Spongia Tasta or Squilla Maritima
(స్పాంజియా టోస్టా లేదా స్పాంజియా లేదా స్కిల్లా మారిటిమా)
Stannum (స్టాన్నమ్)
Stannum Lodatum (స్టాన్నమ్ ఐయోడేటమ్)
Staphysagria (స్టాఫిసేగ్రియా లేదా స్టాఫిన్)
Stramonium (స్ట్రెమోనియమ్ లేదా స్ట్రెమో)
Strychnium (స్ట్రిచ్నియమ్ లేదా స్ట్రిచ్)
Sulphur (సల్ఫర్)
Sulphricum Acidum (సల్ఫ్యూరికమ్ ఏసిడమ్ లేదా సల్ఫ్యూరిక్ ఏసిడ్)
Symphytum సిమ్ఫైటమ్)
Syphilinum (సిఫిలినమ్)
Syzygium (సిజైజియమ్)

T

Tarentula Hispania టారెన్ట్యులా హిస్పానియా)
Tarentula Cubensis or Tarter Emetic (టారెన్ట్యులా క్యూబెన్సిస్ లేదాటార్టార్ ఎమెటిక్)
Teucrium Marum Verum (టూక్రియమ్ మారమ్ వీరమ్)
Thuja Occidentalis (తూజా ఆక్సిడెన్టాలిస్ లేదా తూజా)
Tuberculinum (ట్యుబెర్క్యులినమ్ లేదా ట్యూబర్)

U

Uranium Nitricum (యురేనియమ్ నైట్రికమ్ లేదా యురేన్ నైట్రిక్)

V

Vaccininum (వేక్సినినమ్)
Variolinum వెరియోలినమ్)
Veratrum Album (వెరాట్రమ్ ఆల్బుమ్ లేదా వెరాట్రమ్ ఆల్బ్)

X

Xanthoxylum (జాన్థోజైలమ్)

Z

Zincum Iodatum or Zincum Metallicum (జింకమ్ ఐయోడేటమ్ లేదా జింకమ్ ఐయోడేట్ లేదా జింకమ్ మోటాల్లికమ్ లేదా జింకమ్ మెట్)

# హోమియో వైద్యం-2

## "ద్వాదశ లవణ చికిత్సలు"

### జీవ రసాయనిక శాస్త్ర పరిచయము



శుక్ల-శోణితాలు కలయికవలన-జీవకణాలనుండీ ఉద్భవించిన పిండము.... క్రమ క్రమంగా-వాటివాటి ప్రత్యేకలక్షణాలతో కోటానుకోట్ల కణాలుగా విభజన చెంది, కణము- ధాతువుగానూ; ధాతువులు-చర్మము, ఎముకలు మొ॥గు అవయవాలుగానూఏర్పడి; శిశువు స్త్రీగర్భమునండి వెలువడుతుంది. అట్లువెలువడిన శిశువుకు-ఈబాహ్య ప్రపంచమునందు లభించు-పాలు, పండ్లు, ధాన్యాలు మొ॥గు ఆహారపదార్థాల వలన-ధాతుకణాలు వృద్ధిచెంది, శరీరము-పెరిగి, పెద్దదై-శక్తియుతముగా మాఱుతుంది.

ఈ విధముగా తీసుకొను ఆహార పదార్థాలలోని శరీరానికి అవసరమైన పదార్థాలని తెలుసుకునే శాస్త్రాన్నే "జీవరసాయనిక శాస్త్రము" అని అంటారు. మనము తీసుకునే ఆహారంలో తగిన పోషక విలువలు లభించనపుడు.. ఆయా ధాతుకణాలు కలతచెంది ఆయా శరీరభాగాలు వ్యాధిబాధల నందుతాయి!ఈ సమయంలో ఏ పదార్థముతగ్గినదో గుర్తించి దానిని శరీరానికందించిన వ్యాధులు సమసిపోతాయి. ఈ ద్వాదశల లవణ విధానంలో ఇదే మూలసూత్ర రహస్యము! ఇలాంటి మహత్తర వైద్య సిద్ధాంతాన్ని ప్రప్రథమముగా ఆవిష్కరించి నిరూపించిన మహనీయుడు డా॥ స్క్యూస్లర్ (Schussler). వీరి ఈ వైద్య సిద్ధాంతము హోమియో పతి చికిత్సలకేకాక నేటి అనేక అధునిక వైద్యవిధానాలకు కూడా ఆదర్శమైనదంటే దాని విశిష్టతను వేరేచెప్పనక్కరలేదు. ఈ ద్వాదశలవణ వైద్యసిద్ధాంతాలు దేనికి అనుకరణగాక. దానికదే ప్రత్యేక సిద్ధాంతముగల వైద్యము!!



### ద్వాదశ లవణ వైద్య మూల సిద్ధాంతము

సజీవమైన ధాతువులయందుండు కణాలలోని "లవణాలు" కావలసిన పరిమాణముకంటే తగ్గినపుడు ఈ లవణాలందు, అణువుల చలనమునందు సంభవించే కలతయే వ్యాధి! ఆయాపదార్థాల ద్వారా లోపాలను నివారించడమే నివారణ!!

నీరు, పొటాష్, కాల్షియమ్, సిలి (ఇసుక), ఐరన్, మెగ్నిషియం, సోడియమ్‌లాంటి ఖనిజలవణాలను (అనంగారకపదార్థాలు లేక నిరింద్రియ పదార్థాలు) శరీరకముగాలోపించడమో, ఎక్కువడమో జరిగినప్పుడు వ్యాధులు ఉద్భవిస్తాయి. ఈ లోపించిన పదార్థాలను ఆహారరూపంలోగాని, ఔషదరూపంలో గాని శరీరమునకు అందించి ఆయా వ్యాధులను నివారించాలి! ఔషధాలను 12 రకాలుగా విభజించారు.

### ద్వాదశ లవణ పదార్థాలు

1. కాలెరియా ఫాస్ (C.P.); 2. కాల్కేరియాఫ్లోర్ (C.F.); 3. కాల్కేరియా సల్ఫ్ (C.S.); 4. ఫెర్రమ్‌ఫాస్ (F.P); 5. కాలిమూర్ (K.M); 6. కాలిఫాస్ (K.P.); 7. కాలిసల్ఫ్(K.S.); 8.మెగ్నీషియాఫాస్ (M.P.); 9. నేట్రమ్‌ఫాస్ (N.P.); 10.నేట్రమ్‌మూర్ (N.M.); 11.నేట్రమ్‌సల్ఫ్ (N.S.); 12.సైలిషయా లేక సిలికా (SIL.).

### ద్వాదశ లవణాలు-నివారించు వ్యాధి భాగాలు

నరాల వ్యాధులయందు :- మెగ్నీషియా ఫాస్, కాలీఫాస్, నేట్రమ్ మూర్, ఫెర్రమ్‌ఫాస్ అద్భుతముగా పనిచేస్తాయి.
కండరాల వ్యాధులకు :- కాలీమూర్ దివ్యౌషధము!
సంధాయక ధాతువుల యందు కలిగే వ్యాధులకు :- సిలికా;
స్థితి స్థాపకధాతు వ్యాధులకు :- కాల్కేరియాఫ్లోర్, మెగ్నిషియాఫాస్, కాల్కేరియా ఫాస్‌లు- అమృతములాగా పనిచేస్తాయి.
జుట్టు పారదర్శక అద్దములయందు కలిగేవ్యాధలకు :- ఫెర్రమ్‌ఫాస్;
ఎముకుల ధాతువులయందలి వ్యాధులకు :- కాల్కేరియా ఫ్లార్;
మొత్తము శరీరకముగా కలిగే బలహీనతలు :- కాల్కేరియా ఫాస్ ఉత్తమము!

### ద్వాదశ లవణాలు తయారు చేయు విధానము

ఈ ఔషదాలను తయారుచేయు విధానము. "ఆర్గనాన్ ఆఫ్ మెడిసన్ (Organon Medi cien)" అను గ్రంథములో-264 నుండీ 274పేజీలనూ;

"దిక్రానిక్ డిసిజెస్-దెయిర్ పెక్యూలియర్ నేచర్ అండ్ దెయిర్ హోమియోపతిక్ క్యూర్" అనుగ్రంథములోనూ లభ్యమగును. ఇక్కడ సంక్షిప్తముగా తెలియజేయడమైనది.

డ్రగ్స్ (సహజ పదార్థాము= మూలపదార్థము) ను శక్తియుతము చేయు విధానాన్ని హోమియోపతీలో "పోటెన్సీ మరియూ డైనమిజేషన్ (Potencics & Dynamization)" అనిపిలుస్తారు. అల్లోపతిలో దీనిని మి॥గ్రా॥ (M.g.) లు అని ఉదహరిస్తారు. ద్వాదశలవణాలను రెండువిధాలుగా శక్తియుతముచేస్తారు.

మూలపదార్థమును ద్రవరూపములో శక్తియుతమ చేయ్యాలంటే నీరు గాని, ఆల్కహాల్‌గానీ చేర్చి గట్టిగా కుదుపుటతోనూ; ఘనరూపంలో చెయాలంటే పాలు, పంచదార లాంటివిచేర్చి నూరుటచేతనూ చేయవచ్చును. ఈ రెండు పద్ధతులలో ఏవిధముగా తయారుచేసినా ఔషధముశక్తియుతమై, డైనమిక్ పవర్‌తో పనిచేస్తుంది. వీటిలోని ఔషధీధర్మాలు(Medical Spirit) మేల్కోనబడి, మనశరీరమునందుగల-జ్ఞాన-కర్మేంద్రియాలు వీటిప్రభావముతో... ఇంచుమించు అద్భుత చైతన్యశక్తినిబడయుచున్నవి. ఈ పొటెన్సీలను-1. శతాంశ పద్ధతి; 2. దశాంశ పద్ధతిలో తయారుచేస్తారు. వైద్యపరిభాషలో శతాంశ పద్ధతిని "డెసిమల్ స్కేల్స్(Decimal Scales)" అనీ, దశాంశ పద్ధతిని "సెంటిసిమల్ స్కేల్స్ (Centicimal Scaies)" అని పిలుస్తారు.

ప్రిస్క్రిప్షన్ వ్రాయునపుడు ముందు పేరువ్రాసి, ఎంత పవర్ కావాలో అంకెవేసి ప్రక్కన "x" అని గుర్తుపెట్టిన దశాంశ పద్ధతిలో తయారైన మందులూ; "c" అని గుర్తు పెట్టిన శతాంశ పద్ధతిలో తయారైన మందులనుఇస్తారు.

## తరుణ, దీర్ఘవ్యాధులు-పవర్ నిర్ణయము

దశాంశ పద్ధతిలో తయారైన ఔషదములలో పదార్థము ఎక్కువగా ఉండుటవలన-శారీరకము (ఫిజికల్)గా వున్న వ్యాధులను తగ్గించును. శతాంశ పద్ధతితో తయారైన మందువలన శరీరాంతర్గతముగానూ, మానసికముగానూ పనిచేసి శరీరతత్త్వ మును మార్చడానికి పనిచేస్తుంది. అంతేకాక వ్యాధి లోతుగా ఉన్న పూర్తిగా నివారిం చును. అంటే తరుణవ్యాధులలో "x (దశాంశ పద్ధతి)" పవర్‌నూ, దీర్ఘ మరియూ మానసిక వ్యాధులలో "c(శతాంశ పద్ధతి)" పవర్‌నూ ఉపయోగించాలన్నమాట!

## ద్వాదశ లవణాల మోతాదు (డోస్) నిర్ణయము

డా॥ స్క్యూస్లర్ ద్వాదశలవణాలను అతిసూక్ష్మ మోతాదులలోనే వాడవలెనని తెలిపెను. పెద్ద మోతాదులు ఒక్కొక్కసారి తరుణవ్యాధులను కూడా



సృష్టించే ప్రమాదమున్నది. నా అనుభవమలో కూడా.... సూక్ష్మ మోతాదులే ఎక్కువ ఫలితాలను చేర్చుతాయి!

| వయస్సు | పిల్స్ | పౌడర్ | టాబ్లెట్స్ |
|---|---|---|---|
| 5 సం॥లోపు | 2 | 1 గ్రైన్ | 2 |
| 15 సం॥లోపు | 2 | 2 గ్రైన్ | 3 |
| 25 సం॥ | 4 | 3 గ్రైన్ | 4 |
| ఆపైన | 5 | 4లేక5 గ్రైన్ | 5 |

## పొటెన్సీ (Potency "శక్తి") నిర్ణయము

"ద్వాదశ లవణాలు" అనబడు ఈ నారీంద్రయ పదార్థాలు 12×పవర్ లోపే బాగా పనిచేస్తున్నాయిని నా అనుభవవములోని అనేక కేసులలో రుజువైనది. అంతేగాక టాబ్లెట్స్, పౌడర్ రూపములోనే ఎక్కువ ఫలితాలను ఇస్తున్నాయి. అవసరమనుకున్నపుడు 12×పవర్ పైబడి 30×పవర్ వఱకూ తఱచుగా వాడవచ్చును. 30× పవర్‌పైన (అంటే 200× వఱకు) ఔషధాలు వినియోగించుకోవలసినప్పుడు తప్పకుండా అనుభవజ్ఞులైన వైద్యుని పర్యవేక్షణ వుండాలి! వ్యాధిలక్షణాలు తెలిసికోకుండా ఎక్కువపొటన్సీలు ఉపయోగిస్తే అనేక అనర్థాలకు దారితీసే ప్రమాదాలు వెన్నంటి ఉంటాయని గ్రహించాలి! కాబట్టి సాధారణంగా అందరూ 6×,12×, 30×పొటన్సీల వరకే వినియోగించాలి! ఈ పొటన్సీలే నాకు 90% కేసులలో విజయాన్ని చేకూర్చాయి!

## మోతాదు వాడవలసిన కాల పరిమితి

సహజంగా తరుణ వ్యాధులలో ప్రతి 15 ని॥లకు ఒక డోస్ వేయవలసి వస్తుంది. ఈ విధముగా వ్యాధితీవ్రతనుబట్టి మాత్రమే ఉపయోగించాలి. వ్యాధి అంత తీవ్రముగా లేనపుడు గంటకు 1 డోస్ చొప్పునగానీ, మరీ తీవ్రముగా లేనపుడు 3 గంటలకు 1 డోస్ చొ॥నగానీ వాడాలి. అదేవిధముగా సహజ, దీర్ఘ వ్యాధులలో ఐతే రోజుకి 2 లేక3 డోస్‌లు వాడాలి. ఆరోగ్యానికి బలానికి వాడేవారు రోజుకి 1 మోతాదు వాడుకుంటే చాలు!

## సూక్ష్మ మోతాదులతో వ్యాధి నివారించునా? ఒక విశ్లేషణ!!

ద్వాదశ లవణ చికిత్సా సిద్ధాంతములో శరీరములోని ధాతు కణాలు యధాస్థితిలో ఉండటమే "శారీరకారోగ్యము" ఉన్నట్లుగా భావించడమైనది.

ధాతు కణాలలో మర్పు వచ్చినపుడు సంభవించే వివిధ వ్యాధి లక్షణాలను నివారించడానికి లోపించిన ఆయా లవణాలను "సూక్ష్మమోతాదు"ల ద్వారా భర్తీ చేసి యధాస్థితికి తీసుకురావడమే చికిత్స!

ఇప్పుడు చర్చనీయాంశ మేమిటంటే వ్యాధి లక్షణాలను రూపుమాపడానికి సూక్ష్మాతి సూక్ష్మమైన మోతాదు సరిపోతుందా? అన్నది. ఈ అనుమానము ఈ రోజు అనేకమందిని వేధించుచున్నది. ఈ అనుమానానికి నేను గ్రహించిన విషయాలను చిన్నవివరణగా ఈ క్రింద ఇస్తున్నాను! మీరు పరిశీలించండి!!

ఒక 50 కేజీల మనిషికి సుమారు పూటికి 1 కిలో ఆహారము సరిపోతుందంటే ఈ శరీరములో ఎక్కడో ఒక భాగములోని ఒక్క అణువులో సంభవించిన కలత (లోపము)కి ఎంతపదార్థము అవసరమౌతుందో విజ్ఞులైన పాఠకులే అలోచించ వలసిందిగా కోరుచున్నాను!

ఉదాహరణకి :- 14 పౌన్ ( 6 కె.జి లు)ల బాలుని ఎదుగు దలకు 6 సెం॥గ్రా॥ (1.5 గ్రైన్‌లు) ల మెగ్నీషియం సరిపోతుంది. దీనినిబట్టి ఈ పిల్లవానికి "1 లీటర్ పాలు చాలు!" అని వైద్య శాస్త్రము నిర్దేశించింది. అంటే 1లీటర్‌పాలలో 3.5 గ్రైన్లు మెగ్నీషియం ఉన్నదన్నమాట! ఈ బాలునికి ఏదో కణములో మెగ్నీషియం లోపించి ఆకణములో కలతసంభవిస్తే ఎంత మోతాదులో మోగ్నీషియం ఇవ్వవలసి ఉంటుందో ఊహించండి!! ఈ విధముగానే ఈ బరువు కలిగిన బాలునికి రక్త వృద్ధికి 4॥మి॥గ్రా॥ల ఐరన్ అవసరమౌతుంది. 1లీటర్ పాలలో 4 మి॥గ్రా॥ల ఐరన్ కూడా ఉన్నది. దీనినిబట్టి ఒకవిషయము ప్రస్ఫుటముగా అర్థమవుతుంది. మనశరీరములో ఏది ఎంత పరిణామములో లోపించిదో దానిని ఆ పరిమాణములో భర్తీచేయటమే ముఖ్యకర్తవ్యము!

వేసవిలో దాహముతో నోరు ఎండిపోయినపుడు అతనికి నీరు అందించని ఎడల దాహముతో అతను మరణించును ఈ విధముగానే ఆకలితో ఉన్న వారికి ఆహారము అందించకపోతే శోష్లిల్లిపోక తప్పదు. అంటే శరీరానికి ఏది కావాలో కొన్నిలక్షణాల ద్వారా మనకు తెలియబరుస్తుంది. దీనిని బట్టి అర్థమమౌతున్నది కదా!

పై విషయాలనుసరించి ఏది ఎంతఅందించాలో అంతే అందించాలి గానీ అతిగా ఇచ్చినా, అనవసరమైనవి ఇచ్చినా, అనేక దుష్పరిణామాలువాటిల్లక తప్పదు. ఇదే ద్వాదశలవణ చికిత్సలోని "అత్యద్భుత విశిష్టత!" కాబట్టి కొన్ని కణాలలోని కలతలను నివారించడానికి సూక్ష్మాతి సూక్ష్మమైన మోతాదులో





ఔషధము వాడినా చాలును! ఈ సిద్ధాంతమే ద్వాదశ లవణ వైద్యానికి మూలము! పునాది!! డా॥ కెంట్ "హెచ్చు మోతాదులు ఇఋవైపులా పదునుగల కత్తివంటివి!" అని హెచ్చరించారు.

## ద్వాదశలవణ వైద్యములో-పథ్య, పానములు

ద్వాదశ లవణౌషధములు సేవించినపుడు ఎలాంటి పథ్య, పానములు, నియమములు లేవు! కాని వ్యాధిని బట్టి వ్యాధిగ్రస్తుని అలవాట్లను బట్టి వాటిని నిర్ణయించాలి! ఈ ద్వాదశ లవణౌషధములను "సేవించుటకు ముందు గంట, సేవించిన తరువాత గంట ఎలాంటి ఘన,ద్రవపదార్థాలు తినరాదు, త్రాగరాదు!"

## ద్వాదశలవణౌషధములను భద్రపరుచు విధానము

హోమియో మందులకు వలనే వీటికి కూడా ఏ విధమైన సువాసనా, దుర్వాసనలు తగులనీయరాదు. అలాగే ఎండ వేడిమిగాని నెమ్ముగానీ సోకనీరాదు. ఈ మందులును భద్రపరుచు పెట్టెలు అన్ని హోమియోస్టోర్సులలోనూ లభించును. వీటిని తీసుకునేటప్పుడు చేతులతో తీసుకోకుండా శుభ్రమైన తెల్లని కాగితములో మందును తీసుకుని నోటిలో వేసుకోవాలి.



## ద్వాదశలవణౌషధములు లభించు పరిమాణము

**ద్రావకములు :** 5మి॥లి॥,10మి॥లి, 30మి॥లి, 450మి॥లీ; టాబ్లెట్స్, పౌడర్స్ : 1 గ్రా॥, 2గ్రా॥, 20 గ్రా. ఇంకా-4 ఔన్సులు, 450 గ్రా॥ మరియు పౌన్‌ల రూపంలో అభ్యమగును.

మందు చీటి వ్రాయునపుడు 1) మందు ఏరూపములో కావాలో, 2) ఎంత పరిమాణములో కావాలో, 3) ఎంత పవర్ (పొటెన్సీ) లో ఉండాలో జాగ్రత్తగా వ్రాయాలి.

# చికిత్సా విభాగము

## మానసిక కలతలు

**వాధి లక్షణాలు :** ధనమునకు విలువ ఇచ్చు స్వభావము (సహజము కంటే ఎక్కువగా), ఆర్థికపతనము కలుగనని ఆ కారణముగా భయపడుట.

**చికిత్స :** కాల్కేరియా ఫ్లోర్-30 పొటన్సీలో ప్రతిరోజు రోజుకి 3 సార్లు, 3 మాత్రలు చొ॥న వాడాలి. (ఒక నెల కోర్స్ ఇవ్వవలెను)



**వ్యా॥ల॥ :** దుఃఖము, విసుగుదల, ఆశాభంగము అనంతరము కలుగు భాదలు తెలివి తక్కువ, మానసిక పరిశ్రమ చేయలేక పోవుట, అన్ని వ్యాధులలోను ఆందోళన హెచ్చు, గ్రహింపు శక్తి తక్కువ

**చికిత్స :** కాల్కేరియా ఫాస్-6× పొటన్సీలో ప్రతీరోజు 3 సార్లు 1 గ్రైన్ చొప్పున వాడాలి. ఇట్లు ఒక నెలవాడి తరువాత 12 పొటన్సీలో ఒక నెల వాడాలి.

**వ్యాధిలక్షణాలు :** అన్ని విషయములయందు అసంతృప్తి, పరధ్యానము, మారుచుండెడి స్వభావము, భయము, నిస్పృహ, జ్ఞాపకశక్తి ఆకస్మికముగా తగ్గిపోవుట

**చికిత్స :** కాల్కేరియా సల్ఫ్-30 పొటన్సీలో ప్రతిరోజు 3సార్లు, 3 మాత్రలు చొప్పున కొంత కాలము వాడవలెను. తగ్గిపోతే ఆపాలి.

**వ్యాధి లక్షణాలు :** త్రాగుబోతుల యందు కలుగు వాగుడు, అతి వాగుడు, కోపము ఎక్కువ, నిర్లక్ష్యము, ఆశనసించుట, విసుగుచెందు స్వభావము, ఉన్మాదస్థితి, సరియగు మాటలు ప్రయోగించలేకపోవుట, తన భావములు వెల్లడించలేకపోవుట, చిన్నవిషయాలు కూడాపెద్దగా అనిపించుట, అయోమయ స్థితి.



**చికిత్స :** ఫెర్రమ్ ఫాస్-30 పొటన్సీలో ప్రతిరోజు 3 సార్లు, 3 మాత్రలు చొప్పున వాడాలి. తగ్గని ఎడల-200 పొటన్సీలో పైవిధముగా ఒక నెలవాడాలి. దీనిని 3× లో వాడిన నిద్రపట్టదు. 200లో నిద్రపట్టునట్లు చేయును.

**వ్యాధి లక్షణాలు :** ప్రతీ దానికి ఉపవాసము చేయవలెనని కోరిక

**చికిత్స :** కాలిమూర్-30 పొటన్సీలో కొంతకాలము రోజుకి రెండు సార్లు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆందోళన, అమితభయము, లేనివి ఉన్నట్లు తలంచుట, ప్రతీవిషయములోనూ కీడుతలంచు స్వభావము, నిస్పృహ (తను చేయు పనులందు), ప్రజలలో కలిసిఉండుట కయిష్టము, మానసిక పనులవలన మెదడు అలయుట, ఉత్సాహ శక్తులు క్రుంగుట, ముక్కోపము, అశాంతి, జ్ఞాపక శక్తి తగ్గుట, వ్రాయునపుడు, మాట్లాడినప్పుడు తప్పులు చేయుట (మాటలు లేక అక్షరాలు)

**చికిత్స :** కాలిఫస్-30 పొటన్సీలో ప్రతిరోజు 3 సార్లు 3 మాత్రలు చొప్పున కొన్నినెలలు వాడవలెను. సుగుణము కనుపించినాపవలెను.

**వ్యాధి లక్షణాలు :** పిరికితనము, ఎప్పుడు హడావిడిగా ఉండుట.

**చికిత్స :** కాలిసల్ఫ్-30 పొటన్సీలో ప్రతీరోజు రెండుసార్లు 3 మాత్రలు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** తల మొద్దుబారినట్లుండి ఆలోచనలు తట్టవు, మానసిక పరిశ్రమచేయుట కయిష్టము, వెక్కివెక్కి దుఃఖించు చుండుట, తనలో తాను మాట్లాడుకొనుట, లేక మౌనము వహించుట.

**చికత్స :** మెగ్నీషియా ఫాస్ 30 పొటన్సీలతో ప్రతిరోజు 3 సార్లు చొప్పున ఒక నెల వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** భవిష్యత్తునుగూర్చి ఎల్లపుడూ భయముచెందుట, ఎప్పుడూ ఏదోఆలోచించుట, దానివలన గుండెదడ, ఉత్సాహ శక్తులు క్రుంగుట, కన్నీరుకార్చు స్వభావము, త్రాగుబోతులందు కలుగుసంధి లేక వాగుడు, తను ప్రేమించినవారు దూరముఅగుట లేక చనిపోవుట వలన కలిగిన అనంతర లక్షణములు, ఎప్పుడూ ఓదార్పుకోరుట.

**చికిత్స :** నేట్రమ్ మూర్-200 పొటన్సీలో ప్రతీరోజూ రెండుసార్లు సారిక 3 మాత్రలు చొప్పున స్వస్థత కలుగువరకు వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** ఎట్టివాంఛలూ ఉండకపోవుట భ్రమలు, వస్తువులు మనుష్యులుగా కనిపించుట, "రాత్రి పూట అడుగుల చప్పుడు వినపడుతున్నది" అనిచెప్పుట, ఆందోళనా, మానసికవిస్తారణ.



**చికిత్స :** నెట్రోమ్ ఫాస్-30 లో ప్రతీరోజు 2 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆత్మహత్యా తలంపు, దానికొరకు నిగ్రహముగా ఉండవలెనని తలంచుట, ఈ ఆలోచనలతో నిద్రపట్టకపోవుట, సంధి సంగీతము, ముఖ్యముగా విచారకరమైన సంగీతము వినిపించుట వలన లక్షణములు ఉద్రేకించుట, తలకు దెబ్బలు తగులుటచే కలుగుమానసిక లక్షణములు.

**చికిత్స :** నేట్రమ్ సల్ఫ్-30లో ప్రతీరోజు 2సార్లు సారికి 3 మాత్రలు చొప్పునవాడాలి. వ్యాధి ఉద్రేకముగాఉంటే.... రోజుకి 3సార్లు చొప్పున తగ్గే వరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** మనసు కేంద్రీకరించుట కష్టము, తేలికగా అలసిపోవుట, శరీరబలముకన్నా మానసికబలము ఎక్కువ, మానసిక పట్టుదల ఎక్కువ, విసుగు, ఇతరులను భాదపెట్టు స్వభావము, ఓర్పుతక్కువ, విద్యార్థులు పాఠము అప్పచెప్పలేకపోవుట, అయోమయస్థితి, జ్ఞాపకశక్తి నిలువకపోవుట.

**చికిత్స :** సైలిషియా-200లో ప్రతీరోజూ 3 సార్లు 3 మాత్రలు చొప్పున వాడాలి. లక్షణములు తగ్గేవరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** "శబ్దము" అన్నాభయము, ఇతరులు మాట్లాడు నప్పుడు తప్పులువెతుకు స్వభావము, ఇంటికి పారిపోవుట (హోమ్ సిక్) గతము ఎప్పుడూ తలచుకొనుచుండుట, విపరీతమైన నవ్వు లేక ఏడుపు, హిస్టీరియా, పిచ్చి, తనకు ఏదోవ్యాధి కలదని భావన, ప్రసవానంతరము కలుగు ఉన్మాదము, సిగ్గు, సున్నితస్వభావము, మగత, ఆవలింతలు, కుక్కలాగ మొరుగుట, నిద్రలేమి అనుమానము, అసందర్భ ప్రేలాపన.

**చికిత్స :** కాలిఫస్-30, నేట్రమ్మూర్-30, మెగ్నీషియా ఫాస్-30,లు ప్రతీరోజు రకానికి మూడు మాత్రలు చొప్పున కలిపి వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** చెడు స్వభావము, ఇతరులను భాదపెట్టు స్వభావము, నిద్రలోలేచి స్పృహలేకుండానే పనులుచేయుట, చిన్నశబ్దమునకు కూడా ఉల్లిక్కి పడుట, పిల్లలుఏడ్చుట, ఎప్పుడూ ఎత్తుకుని త్రిప్పమనుట, పిల్లల ఉద్రేక మనస్తత్వము, జ్ఞాపక శక్తి క్షీణించుట.



**చికిత్స :** నేట్రేమ్మూర్-30, కాలీఫస్-30, సూలీషియా-30 ఈ మూడుమందులు కలిపి ప్రతీరోజు 3 పూటలా రకానికి 3 మాత్రలు చొప్పున కొంతకాలము వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** ప్రేమ స్వభావము నశించుట, భర్త, పిల్లల యందు ప్రేమ లేకపోవుట (పురుషుడైతే భార్య యందు), వ్యభిచరించుస్వభాము.

**చికిత్స :** నేట్రమ్ మూర్-200, కాలిఫస్-200 లు ప్రతిరోజు రోజుకి 3 సార్లు చోప్పున కొంత కాలము వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** అమావాస్యకు, పౌర్ణమికి మానసిక లక్షణములు ఉద్రేకించుట.

**చికిత్స :** సైలీషియా-200 లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు చొప్పున కొంత కాలము వాడాలి.



**వ్యాధి లక్షణములు :** అమిత రతి వాంఛ లేక రతి వాంఛ అసలు ఉండక పోవుట.

**చికిత్స :** నేట్రమ్-200, కాల్కేరియాఫాస్-200, కాలీఫస్-200, ఫెర్రమ్ఫాస్-200 ఈ నాలుగు మందులూ కలిపి రోజుకి రెండు సార్లు చొప్పున కొంతకాలము వాడాలి.

**గమనిక :** మానసిక వ్యాధులతో ఇంతకంటే పెద్ద పొటన్సీలు వాడవలసి రావచ్చును కాని అనుభవ వైద్యుడే వాటిని వాడవలెను. మీకు దగ్గరలో ఉన్న హోమియో వైద్యుని సంప్రదించండి!

69

## శిరో వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** నూతనంగా జనించు శిశువు తలపై కలుగు కంతి, ఎముకలకు తగులు దెబ్బలు, వికారముతో ఉండు తలపొప్పి, గట్టిగా రాయివలే ఉండుకంతులు, రక్తపుకంతులు, సెగ్గడ్డలు.

**చికిత్స :** కాల్కేరియా ఫ్లోర్-12×లో ప్రతిరోజూ 4 సార్లు సారికి 1 గ్రైన్ చొప్పున తగ్గు వరకూ వాడవలెను. (పౌడర్, టాబ్లెట్ రూపములో బాగుగా పని చేయును.)

**వ్యాధి లక్షణాలు :** వృద్ధాప్యమునందు కలుగు వ్యాదులకు, తుమ్ముట వలన తలనొప్పి తగ్గుట, తల చల్లగాఉండుట, పండ్లువచ్చు సమయమందు వచ్చు తలనొప్పి, మాడునొప్పి, కడుపులో గ్యాస్ ఉండుటవలన కలుగు తలనొప్పి, బ్రహ్మరంధ్రము (మాడు) పూడకపోవుట లేక పలుచుగాఉండుట, తల, వెంట్రు కలురాలుట, తలదురద, కురుపులు.

**చికిత్స :** కాల్కేరియా-12× లో పౌడర్ గాని, టాబ్లెట్స్‌గాని, ప్రతీరోజు రోజుకి 3 సార్లు చొప్పున తగ్గేవరకూ వాడాలి.

**వ్యాది లక్షణాలు :** చిన్నపిల్లల యందు అంటుకట్టి, రసితో కూడిన కరుపులు, చీముగాని రసిగాని ఉండుట, తలచుట్టూనొప్పి, చుండ్రు, వెంట్రుకలు రాలిపోవుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30, ప్రతీరోజు3 పూటలా సారికి 3 మాత్రలు చొప్పున తగ్గు వరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** తాకిచూస్తే తల పచ్చిపుండుగా ఉండుట, రక్తాధిక్య తచే తలనొప్పి, ముక్కునుండీ రక్తస్రావమైన తలనొప్పితగ్గుట, తీవ్రమైన తలనొప్పి, శిరోజాలను దువ్వెనెతో దువ్వుటవలన కూడా నొప్పి, ఎండవేడిమిచే కలుగు తలనొప్పి, ముఖము ఎర్రబడుట, తలనొప్పితోచూపు కనిపించకపోవుట.

**చికిత్స :** ఫెర్రమ్ ఫాస్-30 లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. నొప్పులు ఎక్కువగా ఉన్నగంటకు 3 మాత్రలు చొప్పున గంట గంటకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** వాంతులలో కూడిన తలనొప్పి, తెల్ల తెమడ లేక నాలుకపై తెల్లని పూత ఏర్పడి తలనొప్పి వచ్చుట, అజీర్ణము వలన తలనొప్పి, చుండ్రు, రసికారు చర్మవ్యాధి.



**చికిత్స :** కాలిమూర్-30 లో ప్రతిరోజు 3 సార్లు సారకి 3 మాత్రలు చొప్పున వాడవలెను. నొప్పితీవ్రముగా ఉన్న ప్రతీ 15 ని॥లకు ఒక మోతాదు వాడవచ్చును. దీనితో **సి.ఎస్.,ఎఫ్.పి.** కలిపి వాడిన మంచిది.

**వ్యాధి లక్షణాలు :** లేచునప్పుడు, పరుండునప్పుడు, నిలబడినప్పుడూ, కూర్చున్నపుడూ పైకిచూచుటవలన కలుగు-తలత్రిప్పు, తలదిమ్ము, మెదడు నందు రక్తక్షీణత వలన కలుగు అలసట, తలనొప్పి, నరములబలహీనత వలన విద్యార్థులు, డాక్టర్స్, లాయర్స్, ఉపాధ్యాయులు మెదలగువారు మానసికశ్రమ చేయు వారియందుకలుగు తలనొప్పి, స్త్రీలయందు ఋతుసమయములో తలనొప్పి, శిరోకదలిక వలన తలనొప్పి.

**చికిత్స :** కాలీఫాస్-6× లేక 12×లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు వాడాలి. తగ్గని పక్షమున 30 పొటన్సీలో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** వెంట్రుకలు రాలిపోవుచుండుట, అక్కడక్కడా బట్టతల ఏర్పడుట, కీళ్ళవాత సంబంధ మైన తలనొప్పి, తలపై చేపపొలుసువలే పొట్టువచ్చుట, తేమగా జిగురుగా ఉండుట, చుండ్రు, తలవెచ్చగా ఉండుట.



**చికిత్స :** కాలిసల్ఫ్-6× లో ప్రతీ రోజు రోజుకి 3 సార్లు కొంత కాలము వాడవలెను. దీనితో నేట్రమ్మూర్-6× కూడా వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** తలనొప్పి స్పృహలేకుండా వచ్చు పొర్లు లేక ఫిట్స్, మెదడు వ్యాధులు, నొప్పులు త్వరితముగా తగ్గుట, తీవ్రముగా ఉండుట, విద్యార్థు లకు, మానసిక పరిశ్రమ చేయువారికి కలుగు తల నరములబాధ, ఈ బాధ శిరస్సుకు వెనుక నుండి వెన్నుకు వ్యాపించి, భుజములకు మధ్యకుపోవుట, తలపై చర్మము గరుకుగాఉండుట, తలతిరుగుట, తలను ముందుకు గాని ప్రక్కలకుగాని త్రిప్పుటచే నొప్పి, మెదడు భాగమున నొప్పి.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలిఫస్-6× లేక 12లో వాడిన త్వరగా ఫలితములు ఉండును.

**వ్యాధి లక్షణాలు :** నుదురు, కణతల యందుతలనొప్పి, ఇది నిద్రలో తగ్గుట, కన్నీరుకారు స్వభావము, నిద్రమత్తు, సుఖము తెలియని నిద్రవలన కలుగు తలనొప్పి, మల బద్ధకముతో నుండు తల నొప్పి, విద్యార్థులకు, స్త్రీలకు ఋతు సమయంలో వచ్చు తలనొప్పి, వడదెబ్బ, సూర్య తాపముచే కలుగు భాదలు, వెంట్రుకలు రాలిపోవుట, పార్శ్వపు తలనొప్పులు.

**చికిత్స :** నెట్రోమ్ మూర్-30 లో ప్రతిరోజు 3 పూటలా సారికి3 మాత్రలు చొప్పున తగ్గువరకూ వాడవలెను. మలబద్ధకముతో ఉన్న కేస్‌లందు సైలీషియా 30 తో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** ఋతువుకి ముందు, తరువాత కలుగు తలనొప్పి మాడునొప్పి (నడినెత్తి నొప్పి), ఉదయము లేవగానే ఉండు తలనొప్పి వెనుక గాని, నుదురు యందుగాని ఉండుట, పుల్లని త్రేపులు లేక ద్రవపు వాంతితో కూడిన తల నొప్పి

**చికిత్స :** నేట్రమ్ ఫాస్-6లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు చొప్పున తగ్గువరకూ వాడవలెను. దీనితో కాలిమూర్-6× లేక12× లో వాడినా మంచి ఫలితముండును.

**వ్యాధి లక్షణాలు :** పైత్యపు తలనొప్పి, తలత్రిప్పు, నడినెత్తిన నొప్పి, చేదు వాంతి, చేదు రుచితో కూడన భాధలు, తలకు దెబ్బలు తగులుటచే కలుగు చెడు ఫలితములు, నడినెత్తున మంట, మెదడు లూజ్‌గా ఉన్నట్లు భావన, తల చర్మము-దురద, భాధ, నొప్పులు.

**చికిత్స :** నేట్రమ్ సల్ఫ్-30 లో ప్రతిరోజు 3 పూటలా పూటకి 3 మాత్రలు చొప్పున తగ్గేవరకూ వాడవలెను. దీనితో నేట్రమ్ ఫాస్30 వాడిన మంచిది. కపాల ఎముక, దవడ ఎమక కలియు చోట వచ్చు నొప్పికి కాల్కేరియా ఫాస్-6× లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** రోగి ముందుకు గాని వెనుకకు గాని పడిపోతూ నట్లు ఉండుట, అంతర్గత కారణాల వలన కలుగు తలత్రిప్పు, మెడ వెనుక భాగము నుండి నడినెత్తి వరకు నొప్పి(కుడివైపు అధికము); అలసట వలన, వెలుగువలన, చదువుట వలన అధికమైన తలనొప్పి; ఇది వెచ్చదనము వలన తగ్గుట, చీముతో కూడిన కురుపులు తలపై ఎక్కువ చెమట, తలకు గుడ్డచుట్టు కొనుట వలన బాధలు తగ్గుట, బ్రహ్మరంధ్రము పెద్దదిగా ఉండి తెరుచుకొని ఉండుట, దుర్వాసనగల చీము, రసి, చెమట, తల వెట్రుకలురాలుట, వెట్రుక కుదుళ్ళవాపు.

**చికిత్స :** సైలీషియా-30 లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు 3 మాత్రలు చొప్పున వాడవలెను. కురుపులలో 200 పొటన్సీలో వాడవలెను. దీనిని నేట్రమ్ మూర్-30, కాల్కేరియా ఫాస్-30, కాల్కేరియా సల్ఫ్-30 లతో కలిపి వాడిన బాగా పని చేయును. భాధలు తగ్గువరకూ వాడవలెను.





## నేత్ర వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** కనురెప్పలపై కురుపులు, కను గ్రుడ్డు తెల్లని భాగముపై మచ్చలు, కండ్లు కలక, కంటితో పనులు చేయుట వలన (చదువుట, వ్రాయుట, కుట్టుల మొదలగునవి) చూపు అలుముకు పోయినట్లు ఉండుట, కేటరాక్ట్ (కంటిలో తెల్లటిపొర).

**చికిత్స :** కాల్కేరియా ఫ్లోర్-30 లో ప్రతి రోజు రోజుకి 3 మాత్రలు చొప్పున వాడవలెను. దీనితో సైలీషయా-30 లో కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కనురెప్పలు శక్తి లేక వాలి పోవుట, అంధత్వము, వెలుగును, గ్యాస్ లైటునూ చూడలేక పోవుట, తెల్ల గ్రుడ్డు వాపు, చిన్న పిల్లలలో పుట్టుక నుండీ మసక.

**చికిత్స :** కాల్కేరియా ఫాస్-6× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. తగ్గని ఎడల 12× లో వాడాలి. దీనితో మెగ్నీషియా ఫాస్-6× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కండ్ల కలక, కంటిలో వ్రణము, పసుపు పచ్చని స్రావము, కంటిలో చీముకూడుట, రెటీనా వాపు, కంటిలో ఏదో అన్య పదార్థము ఉన్నట్లు ఉండుట, కంటికి గాయం తగిలిన తరువాత కలుగు చెడులక్షణములు, కనురెప్పలు అదురుట, కంటిమందు దృశ్యాలు సగమే కనిపించుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-200 లో ప్రతిరోజు 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనితో సైలిషియా-200, ఫెర్రమ్ ఫాస్-30 కలిపి వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కళ్ళలో ఎరుపు, నీరుకారుట, మంట, తీవ్ర రక్తాధి కృత, కండ్లుకలక, కన్నులవాపు, కన్నులయందు ఇసుక ఉన్నట్లుభాధ, వెలుగు చూడలేకపోవుట, కన్నుల క్రింద (క్రింద రెప్పల క్రిందభాగములో) నల్లని ఛాయలు ఉండుట.

**చికిత్స :** ఫెర్రమ్ ఫాస్-30 లో ప్రతి రోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. బాధ ఎక్కువగా ఉంటే 3 గంటలకు ఒక డోస్ చొప్పువాడాలి. దీనితో కాల్కేరియా సల్ఫ్-30 వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** కన్నుల నుండి తెల్లని అమ్లము (పుసి) వచ్చుట, కళ్ళలో నీటిబొబ్బలు, తెల్లని పొర, కనురొప్పల యందు నూకలు వంటి పొక్కులు, ట్రకోమ.

**చికిత్స :** కాలీమూర్-30 లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-30 వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నీరస దృష్టి, మెల్ల, డిఫ్తీరియాఅనంతరము కలుగు కంటి వ్యాధి, కంటికండరములు, నరములు దుర్బలముగాఉండుట, కనురెప్పలు అదురుట, కన్నులయందు నల్లనిమచ్చలు, కన్నులు గుంటలుగా పీక్కుపోయి, ముఖము కళావాహీనమనుగా ఉండుట.

**చికిత్స :** కాలిఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియా ఫాస్-6× లేక 12× కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కంటిలోలెన్స్ (అద్దము)నకు పారాదర్శకత్వము పోవుట, పచ్చని పుసులు, కన్నుల యందు ఆమత్వక్కు (కంజెక్టివ్) వాపు లేక చీము పుట్టుట ( నూతన శిశువుకు ఇట్లు కలుగును), కార్నియా క్రింద కురుపు, దీనిస్రావము పచ్చగా ఉండుట.

**చికిత్స :** కాలిసల్ఫ్-30 ప్రతిరోజు 3సార్లు వాడాలి. దీనితో కాల్కేరాయా సల్ఫ్-30 వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** లేనిరంగులు కనిపించుచుండుట, వస్తువులు రెండుగాకనిపించుట, కనుపాపలు సంకోచముచెందుట, కంటినుండీ మెదడుకు పోవు నరము దెబ్బతినుటవలన చూపుపోవుట, "రెటీనా"కి దెబ్బవలన చూపు తగ్గుట, కనురెప్పలు క్రిందికివాలిపోవుట, కనురెప్పలు అదురుట, కంటినరముల బలహీనతవలన చదువుట కష్టముగా ఉన్నపుడు.

**చికిత్స :** మెగ్నిషియాఫాస్-6× లేక 12× లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలిఫాస్-6× లేక 12× లో వాడిన మంచిది.

**వ్యాధి లక్షణాలు :** చూపు తెరకట్టినట్లు ఉండుట, చదువు నప్పుడు అక్షరములు అలుక్కుపోయినట్లు ఉండుట, ఎండలో కంటిబాధలు, ఉద్రేకము చెంది కన్నీటి గ్రంథినుండి కన్నీరు కారుచుండుట, దురద, మంట, కన్నులు పొడియారుపోయినట్లు ఉండుట, కనురెప్పలువాచుట, రాపిడి కలిగించు కన్నీరు, నీటిపొక్కులు, కన్నులు అలయుటచే చూపు నీరసముగా ఉండుట, ఈ బాధలన్నీ సూర్యోదయముతోవచ్చి, సూర్యాస్తమయముతో పోవుట.

**చికిత్స :** నేట్రమ్ మూర్-30 లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనాతో కాలిఫస్-30, మెగ్నీషియాఫాస్-30 కూడా వాడిన మంచి ఫలితము ఇచ్చును.

**వ్యాధి లక్షణాలు :** బంగారు వన్నెగల పుసులు, కనురెప్పలు ఉదయము అంటుకొనుట, వేడిగా కన్నీరు స్రవించుట, ప్రేగులలో క్రిములు ఉండుటచే కలుగు మెల్ల.



**చికిత్స :** నేట్రమ్ ఫాస్-30 లో ప్రతి రోజు 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనాతో మెగ్నీషియా ఫాస్-30 కూడా వాడుట మంచిది.

**వ్యాధి లక్షణాలు :** కన్నులు పచ్చబడుట, కన్నులయందు కొయ్యకండలు పెరుగుట, చీము ఆకు పచ్చగావచ్చుట, కన్నులు అంటుకొనుట, వెలుతురును చూడలేకపోవుట.

**చికిత్స :** నేట్రమసల్ఫ్-6× లేక 12× లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనీతో నేట్రమ్ ఫాస్-6× లేక 12×, కాలిమూర్-6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కన్నల యందుకలుగు లోతైన రంధ్రము, వ్రణము, చీము కారుట, సెగ్గడ్డలు, కొరుకుపండ్లు, కంటి కొలుకుల యందు కురుపులు, కండ్లు మసక, స్టైయ్ (కంటి రెప్పల అంచుల యందు లేచు కురుపులు)

**చికిత్స :** సైలీషియా-200 లో ప్రతిరోజూ రోజుకు 3 సార్లు చొప్పున తగ్గువరకు వాడాలి. దీనాతో సి.ఎస్.-200 కూడా వాడాలి.

## చెవి, ముక్కు వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** చెవిలో గింగిర్లు, శిరస్సునందు జలుబు, తుమ్ము వలయునని కోరిక ఉండును గాని తుమ్మురాదు. ముక్కులు దిబ్బడ, పడిసెము, ముక్కు ఎముక వ్యాధులు, ఎడినాయిడ్స్.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** వెలుపలచెవి చల్లగాఉండుట, కీళ్ళు వాత సంబంధ మైన చెవి ఎముకులనొప్పి, చెవి దగ్గరి గ్రంథులవాపు, దీనివలన గొంతునొప్పి, చెవిదిబ్బడ, చెవుడు, రోగి క్షీణించిపోవు వ్యాధిలో చెవిబాధలు, చల్లని గాలియందు నాసిక నుండి స్రావముకలిగి, వెచ్చని గాలియందుఆగుట, దీర్ఘ జలుబు-తుమ్ములు, ముక్కులో కంతి.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్ 6× లేక 12×లో తగ్గేవరకు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చెవినుండి చీము కారుటచే కలుగు చెవుడు, చెవి నొప్పి, ముక్కునొప్పి, రక్తస్రావము, ముక్కులో పొక్కులు కట్టి పట్టుకున్నట్లుగా ముక్కునొప్పి, ముక్కు దిబ్బడ వేయుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30 లేక 200లో ప్రతి రోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనితో సైలీషియా-30 లేక 200లో ప్రతి రోజు వాడాలి. తగ్గితే ఆపవలెను.

**వ్యాధి లక్షణాలు :** శబ్దములను భరించ లేకపోవుట, చల్లదనము, తేమ వలన చెవిపోటు, రక్తపోటు వలన చెవిపోటు లేక చెవిలో శబ్దము, చెవి మొదట్లో వాపు, జలుబు, రక్తస్రావము ఎర్రని రక్తస్రావము చల్లనిగాలి వలన రక్తము లేక జలుబు స్రవించుట.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12×లో ఒకే రోజు 4 లేక 5 సార్లు పడాలి. దీనితో కాలీ మూర్-6× లేక 12× లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** చెవుడు, మధ్య చెవివాపు, చెవినుండి గొంతుకు పోవునాళము మూసుకుపోవుట, చెవినుండి తెల్లని స్రావము వచ్చుట, జలుబు ముక్కులనుండి తెల్లని స్రావము.

**చికిత్స :** కాలిమూర్-6× లేక 12× లో రోజుకి 3 లేక 4 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నరముల బలహీనతచే కలుగు చెవుడు, దుర్వాసనతో కూడిన స్రావము, చెవిలో "హూం"కార శబ్దము, ముక్కునుండి దుర్వాసనతో కూడిన స్రావమువచ్చుట, తుమ్ములు, ముక్కులోపుండ్లు, ముక్కుతో మాట్లాడ వలసి వచ్చుట.

**చికిత్స :** కాలిఫస్-6× లేక 12×లో ప్రతి రోజూ రోజుకి 3 సార్లు చొప్పున తగ్గువరకూ వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12× వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** జలుబుతోకూడిన చెవుడు, చెవినుండి వచ్చిన స్రావము, మాస్టాయిడ్ ఎముకనందు నొప్పి, చెవిలో వ్రణాలు, కంతులు, దుర్వాసనతోకూడిన చీము, జలుబు, పచ్చని పడిసెము, దీర్ఘజలుబులు, వాసన తెలియక పోవుట, దురద.

**చికిత్స :** కాలిసల్ఫ్-6× లెక 12× లో ప్రతి దినమూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున తగ్గేవరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చెవుడు, లేక నాడీ మండల నీరసముచే కలుగు చెవుడు, చెవిపోటు, రకరకాల చెవిపోట్లు, జలుబు, పడిసెముతో వాసన గ్రహించు (ఘ్రాణశక్తి) శక్తి లోపించుట, ముక్కు దిబ్బడ.





**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో ప్రతీరోజూ 3 సార్లు వాడాలి. నొప్పి ఎక్కువగా ఉంటే తగ్గే వరకూ ప్రతీ గంటకూ 1 డోస్ చొప్పున వాడాలి. దీనితో కాలీఫాస్-6× లేక 12 వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నములు చున్నట్లుగా చెవులయందు శబ్దము, దురద, చెవినుండి నీటి వంటి స్రావము, వాసన, రుచి తెలియకపోవుట, రక్త క్షీనతతో కలుగువ్యాధులు, అధికతుమ్ములు, వేసవిలోచేయు జలుబు, నీటివంటి స్రావము, చెవిమంట.

**చికిత్స :** నేట్రమ్ మూర్-30 లో ప్రతి రోజూ 3 లేక 4 సార్లు తగ్గేవరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** జీర్ణకోశక్షణాలతోనుండు చెవివాపు చెవిభాదలు, దురద, చెవిలోహోరు, ముక్కుగిల్లు కొనుచుండుట, ప్రేగులందు క్రిములండుటచే ముక్కుదురద, జలుబు.

**చికిత్స :** నేట్రమ్ ఫాస్-30 లేక 200లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చెవి నుండి ఏదో బయటకు వచ్చుచున్నట్లుపోటు, ఇది తేమ వాతావరణమందు అధికమగుట, గంట మ్రోగినట్లు శబ్దము, ఋతు సమయమునందు ముక్కునుండి రక్తస్రావము, తేమ వాతావరణము వలన జలుబు, ముక్కుదిబ్బడ, దురద, నీటివంటి స్రావము, శీతాకాలములో, వర్షాకాలములో కలుగు జలుబు, (వేసవిలో జలుబుకు ఎన్.ఎమ్.ఎఫ్.పి. వాడాలి).

**చికిత్స :** నేట్రమ్ సల్ఫ్-30 లో ప్రతి 3 గంటలకూ 1 డోస్ చొప్పున జలుబు తగ్గేవరకూ వాడాలి. దీర్ఘవ్యాధి ఐతే...ప్రతి రోజూ 3సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** శబ్దము సహించలేకపోవుట, చీముస్రవించుట, దుర్వాసన, రసికారుట, చెవిలోపుండ్లు, చెవుడు, తుమ్ములు, దీర్ఘకాలిక రొంప, పుండ్లు, వాసన తెలియకపోవుట, మంట, రాపిడి కలిగించు చీము లేక స్రావము, ముక్కు, చెవులందు కలుగు చర్మవ్యాధి, రసిక, దురద.

**చికిత్స :** సైలీషియా-30 లేక 200లో ప్రతి రోజూ 3 సార్లు తగ్గే వరకూ వాడాలి. దీనితో కాల్కేరియా సల్ఫ్-30 లేక 200 మరియూ ఫెర్రమ్ ఫాస్-30 లేక 200 లో వాడాలి. నొప్పిగా వుంటే.... మెగ్నీషియా ఫాస్-30 వాడాలి.

## నోరు, గొంతు వ్యాధు-మందులు

**వ్యాధి లక్షణాలు :** పంటినొప్పి లేక చిగురువాపుతో దవడవాచి గట్టిగా ఉండుట, దౌడవాపుతో వ్రణములు ఈ వాపులు అన్నీరాయివలే గట్టిగా ఉండుట, నోటిమూలల పగులుట లేక పుండ్లు, పుట్లుక నుండి వంశానుగతముగా కలిగిన ('సిఫిలిస్'చే) నోటిలో లేక గొంతులో పుండ్లు, నాలుకపై చారలు-చారలుగా పగుళ్ళు లేక పుండ్లు, దంతాలు ఆలస్యముగా వచ్చుట, పళ్ళపైగల ఎనామిల్ (పింగాణీపదార్థము) లోపించుట, పండ్లు తేలికగా కదిలి ఊడులాగుట, చిగుళ్ళు వాపు, రక్తస్రావము, డిఫ్తీరియా, కొండనాలుక పెద్దదిఅగుట, దీనివలన దగ్గు వచ్చుట, టాన్సిల్స్‌వాపు లేక నొప్పి.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12×లో ప్రతిరోజూ3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. వ్రణములుంటే దీనితో సైలీషియా 200 వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కన్యల ముఖముమీదవచ్చు మొటిమలువంటి పొక్కులు, ముఖము ఎప్పుడూ జిడ్డు కారుచుండుట, గ్రంథులు ఉబ్బుట, నోటిలో అసహ్యకరమైన రుచి, పై పెదవి ఉబ్బరించుట, టాన్సిల్స్ వలన నోరుతెరచుట కష్టము, తలనొప్పితో నోటిచేదు, పిల్లల పళ్ళువచ్చు సమయంలో కలుగుబాధలు, మెల్లగాపెరుగుట, పళ్ళు చెడిపోవుట, ఇగుళ్ళునొప్పి లేక వాపు గొంతు బొంగురు, గ్రంథులువాపు, గుటకవేయునపుడు గొంతుకనొప్పి, మాట్లాడునపుడు గొంతు సవరించుకోవలసివచ్చుట, ఎక్కువగా మాట్లాడు వారికి కలుగు గొంతు బొంగురు లేకనొప్పి, గొంతునందు ఉత్తి గుటకవేయునపుడు కలుగునొప్పి, గొంతుక నుండీ జిగురువంటిస్రావము (జలుబుతో)వచ్చుట, టాన్సిల్స్ వాపు లేక నొప్పితో చెవి నొప్పిగా ఉండుట.

**చికిత్స :** కాల్కేరియాఫ్లాస్-6 లేక 12× లె ప్రతి రోజూ రోజుకి 3 సార్లుచొప్పున వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లాస్-6× లేక 12×లో వాడాలి. వ్యాధి తీవ్రతనుబట్టి గంటకు ఒకడోస్ చొప్పున వాడవచ్చును. తరువాత 30 పొటిన్సీలలో కూడావాడ వచ్చును.

**వ్యాధి లక్షణాలు :** దవడలపై వ్రణములు, నోటినిండా పుండ్లు, నాలుక లేక గొంతుమంట, పుల్లనిరుచి, కీళ్ళవాత సంబందమైన పళ్ళతీపు, లేక నొప్పి, ఇగుళ్ళకు చీముపట్టుట, రక్తస్రావమూ గొంతులో పుండ్లు ఏర్పడి చీము స్రవించుట, టాన్సిల్స్ చీముపట్టి బాధకలిగించుట, డిఫ్తీరియా చీము స్రవించు "క్విన్‌జీ" అను వ్యాధి.



**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30 లేక 200లో ప్రతిరోజూ 3సార్లు చొప్పున తగ్గువరకూ వాడాలి. దీనితో సైలీషియా-200 వాడిన తర్వాత గుణము కనిపించును.

**వ్యాధి లక్షణాలు :** ఇగుళ్ళునుండీ రక్తస్రావము, ఇగుళ్ళు మెత్తగా దూది పుంజులవలే ఉండుట, నాలుక ఎర్రగా నుండి వాపు, వేడి ఆహారపదార్థాలు వలన పళ్ళుతీపు కలిగి, చల్లనిపదార్థముల వలనతగ్గుట, గొంతు ఎర్రగా ఉండి వాపు, గొంతు పొడి ఆరిపోవుయి వేడిగా ఉండుట, టాన్సిల్స్ ఎర్రగా వాచి ఉండుట, గ్రంథులు వాపు, డిఫ్తీరియా ప్రథమదశ (గాయకులకు ఉపయోగపడు మంచిచికిత్స) గొంతు నుండీ ఎర్రని రక్తస్రావము.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× లో ప్రతి రోజూ రోజుకి 3 లేక 4సార్లు వాడవచ్చును. బాధ ఎక్కువగా ఉంటే గంటకి 1 డోస్ చొప్పున వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** నోటిలో తెల్లని నూకలు వంటి పొక్కులు, తిని వేయు చుండుపుండ్లు, దవడ లేక మెడ వద్ద గ్రంథులు ఉబ్బుట, నాలుకపై తెల్లని పూత, డిఫ్తీరియా(గవదలు వాపుకి, ఎడినాయిడ్స్‌కి టాన్సిల్స్ వంటివి ఉబ్బగానే మందు వాడవలెను). గొంతు వ్యాధులు, నీటిని కూడా త్రాగలేకపోవుట, వాటివలన గొంతు నొప్పి.

**చికిత్స :** కాలిమూర్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లువాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్ -6× లేక 12× లో వాడాలి. దీనిని ఒక గ్లాస్ గోరువెచ్చని నీటిలో కలిపి పుక్కిలించినా మంచిది.

**వ్యాధి లక్షణాలు :** పైపండ్లు నుండి చెవిలోనికి పొడుచు నొప్పి, పెదవులకు చర్మము పైన పొలుసు వుండుట, పొక్కు కట్టు కురుపులు, నోటి దుర్వాసన, లాలాజలము అధికముగా వచ్చుట, నాలుక నొప్పి, పిప్పు పండ్లు లేక ఇగుళ్ళు నొప్పులు రక్తస్రావము, పంటి నొప్పితో నుదురు నొప్పి ఉండుట, పెద్దగా మాట్లాడ లేకపోవుట మాట అస్పష్టముగా ఉండుట, ఇగుళ్ళు వెనుకకు పోవుట, నిద్రలో పళ్ళుకొరుకుట, స్వరముతో పోవుట, ముక్కుతో మాట్లాడుట, గొంతు లేక స్వరపేటిక మరియు శరీరము నందు అవయములకు కలుగు పక్షవాతము.

**చికిత్స :** కాలిఫస్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియా ఫాస్ -6× లేక 12లో వాడాలి. పక్షవాతమునందు 30, 200 పొటన్సీలలో కూడా వాడవలసి రావచ్చును. ఆపై పొటన్సీలు అనుభవము కలిగిన వారి సారధ్యంలో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** క్రిందపెదవి వాపు, నోటిలోని పైపొరఊడుట, నాలుకకు రుచి తెలియనిస్థితి, నోరువెచ్చగా ఉండుట; సాయంత్రము పూట, పంటినొప్పి, గొంతు పొడిగాఉండి, నొక్కినట్లుగా నొప్పి, టాన్సిల్స్ వాపుతో మ్రింగుట కష్టమగుట, ఎడినాయిడ్స్ ఆపరేషన్ జరిగిన తరువాత నోటితో గాలిపీల్చవలసి వచ్చుట లేక చెడులక్షణములు.

**చికిత్స :** కాలిసల్ఫ్-12× లేక 30×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. తగ్గితే అపేయాలి.

**వ్యాధి లక్షణాలు :** మెరుపు తీగవలే అకస్మాత్తుగావచ్చి, ఆకస్మికముగా తగ్గు నొప్పులు, నత్తి అంకెళ్ళు బిగిసుకుపోవుట, పెదవులు మూలలయందు పగుళ్ళు, చన్నీటివల్ల లేక చల్లగాలి వలన పళ్ళుతీపు పోటు, వేడి లేక వేడినీటి వలన ఉపశమనము కలుగుట, పిప్పళ్ళు తీపుపోటు, చిన్నపిల్లలకు పళ్ళువచ్చి నపుడు కలుగు బాధలు, మెడయందలి థైరాయిడ్ గ్లాండ్ పెద్దదిఅగుట,తల వెనుకభాగము నొప్పితో గుటకవేయటకు కష్టమగుట.

**చికిత్స :** మెగ్నీషియా ఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ రోజుకు 3 సార్లు చొప్పునవాడాలి. దీనితో కాలిఫాస్-6× లేక 12×లోనూ ఫెర్రమ్ఫాస్-6× లేక 12×లోనూ వాడాలి. పెదవుల మూలల పగుళ్ళకు కల్కేరియా ఫ్లోర్ -6× లేక 12×తో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** క్వినైన్ వాడినపుడు చెడులక్షణములు కలుగుట, భుజించునపుడు చెమట, ముత్యమువలే నీటివంటి ద్రవపు పెక్కులు వచ్చుట, లాలాజలము ఉప్పగాఉండుట, కొండనాలుక వాచుట లేక దిగజారుట, నీటి మూలలపగిలి మంటగా ఉండుట, పెదవులు పగుళ్ళు, గొంతుజలుబు, గడ్డము మీద చర్మవ్యాధి, రుచితెలియకపోవుట, చిన్నపిల్లలు మాటలు ఆలస్యముగా నేర్చుకొనుట, నాలుకపై వెంట్రుకలు ఉన్నట్లు భావన, నాలుక, గొంతు పొడి యారినట్లు ఉండుట, దాహము లాలాజలము ఎక్కువగా ఊరుచుండుట, చొంగ, రక్తస్రావము, ఇగుళ్ళు వదులై పళ్ళుకదులుట, పిల్లలకుగానీ పెద్దలకుగానీ మెడ శుష్కించుట, తైరాయిడ్ మెదలగు అన్నిగ్రంథులవాపు, గవదలవాపు, కొండ నాలుక వ్రేలాడుల లేక వాపు, నాలుక ఉప్పనిరుచితో కలిగి ఉండుట.

**చికిత్స :** నేట్రమ్ మూర్-6× లేక 12లో ప్రతిరోజూ వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-6× లేక 12లో వాడాలి. నాడీమండల కేసులలో **ఎమ్.పి-6క్షీ కె.పి-6క్షీలో** వాడాలి. గ్రంథులయందు **సి.పి-6క్షీ** తో వాడవలెను.

74



**వ్యాధి లక్షణాలు :** నోరుఎర్రగా ఉండుట, పుల్లనిరుచులు, చిన్నపిల్లలు నిద్రలో పళ్ళుకొరుకుట, నాలుక వెనుకభాగము పైన బంగారువన్నెగల మీగడలా గుండే పదార్థము ఏర్పడుట, గొంతుఅవలక్షణములు లేక జీర్ణకోశ అవలక్షణము లలో కలుగు నాలుకపూత, గొంతునొప్పి.

**చికిత్స :** నేట్రమ్ఫాస్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాలిమూర్-6× లేక 12× లో వాడిన చాలా ఉపయోగములు కలుగును.

**వ్యాధి లక్షణములు :** నోటియందు చేదురుచి, జిగురువంటి పదార్ధము వచ్చుట, మంట, ఇది పొగాకు, చల్లగాలి, చన్నీటివలన తగ్గుట. పంటినొప్పి, జలుబుతో కూడిన గొంతునొప్పి బొంగురు-

**చికిత్స :** నేట్రమ్ మూర్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ప్రతిధాతువునందూ చీముజేరుట, మలబద్ధకముతో కూడిన పుండ్లు, నోటి మూలలయందుపుండ్లు, పగుళ్ళు, రాత్రులు పంటినొప్పి వచ్చుట, ఇగుళ్ళలో చీముజేరుట, దంతాలు కదులుట, పంటికురుపు, పుప్పి పన్ను, నోటిలో పుండ్లు, దంతాలు ఆలస్యముగా వచ్చుట, టాన్సిల్స్‌కి చీముతో కూడినవాపు, నొప్పి, తైరాయిడ్ గ్రంథి పెరుగుట.

**చికిత్స :** సైలిషియా-30 లేక 200 లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో నేట్రమ్ మూర్-30 లేక 200, కాల్కేరియా ఫ్లోర్-30 లేక 200 లో వాడాలి. చీముపట్టు స్వభావం కలవారికి కాల్కేరియా సల్ఫ్-30 లేక 200 లో వాడాలి.

## జీర్ణావయవ మండల వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** జీర్ణముకాని ఆహారము వాంతిఅగుట, ఎక్కిళ్ళు, కడుపులో వాయువుచేరుట, కాలేయము నొప్పి.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో "ఎఫ్.పి.-6×, ఎమ్.పి.-6×" లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఏదైనా ఆహారము తీసుకున్నా కడుపునొప్పి ఎక్కువ అగుట; త్రేపులు వలన ఉపశాంతి; ఉపవాసము వలన నొప్పి వెన్నుకు ప్రాకుట; పాలమీద కోరిక;చన్నీళ్ళు, ఐస్‌వలన వాంతులు కలుగుట; దీనిబాదలు అన్నీ భోజనం తరువాత అధికమగుట; మాంసమునందు కోరిక శుష్కించుట.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6× లేక12×లో ప్రతీరోజూ 3సార్లు వాడాలి. దీనితో "ఎమ్.పి.-6×లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** ఉత్తేజకర పదార్థాలు కోరుచుండుట, కడుపులో మంట; పుండ్లు; వీటిని కోరుచుండుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్–6× లేక 12× లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి.

75

**వ్యాధి లక్షణాలు :** పాలు, మాంసము మీద అయిష్టత; చల్లని నీళ్ళు కోరుచుండుట; బ్రాందీ, కల్లు, సారాపై కోరిక; జీర్ణ కోశము వాపు, గుండెవద్ద నొప్పి, త్రేపులు, తిన్న పదార్థముల రుచితో త్రేపుట, తిన్నవి నోట్లోకివచ్చుట, జీర్ణముకాని ఆహార పదార్థాలు వాంతిఅగుట, రక్తపువాంతి, ఆకలి వుండకపోవుట లేక అమిత ఆకలి, కడుపుతాకిన నొప్పి, అజీర్తి.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్–6× లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. తీవ్రమైన వాంతులయందు గంట గంటకీ వాడాలి. నొప్పులందు "ఎమ్.పి. –6×, అజీర్తి యందు కె.ఎమ్.–6×" తో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆకలితక్కువ, అజీర్ణము, క్రొవ్వు పదార్తాలు తిన్నపుడు సరిపడకపోవుట లేక అరుగుదల ఉండకపోవుట, తెల్లని తెమడలాంటి వాంతులు, జీర్ణకోశమునందు నొప్పి, కామెర్లు.

**చికిత్స :** కాలీమూర్–6× లేక 12× లో ప్రతి రోజూ 3 లేక 4 సార్లు వాడాలి. దీనితో నేట్రమ్‌ఫాస్–6× లేక 12× లో వాడుట మంచిది.

**వ్యాధి లక్షణాలు :** ఆహారము తీసుకున్న వెంటనే మరల ఆకలి అగుట, కడుపులో శూన్యముగాఉండుట, వాయువుతో కూడిన త్రేపులు; భయము వలన, దడుసుకొనుట వలన మానసిక ఉద్రేకము (కోపము, విసుగు)తో కలుగు కడుపు నొప్పి; అతిదాహము; పులుపు, చేదు మరియు రక్తముతోకూడిన వాంతులు, మెదడువ్యాధితో ముదురుఆకుపచ్చ లేక నీలివర్ణముగల వాంతులు; ప్లీన్ వ్యాధులు, నిస్త్రాణ, మలవిసర్జన చేయవలెననివాంఛ ఉంటుంది కానీ ఫలిత ముండదు.

**చికిత్స :** కాలిఫస్–6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాలిమూర్–6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** జీర్ణ కోశములో శూల నొప్పి, మంట, కామెర్లు.

**చికిత్స :** కాలిసల్ఫ్–9× లేక 12× లో ప్రతి రోజూ 3 సార్లువాడవలెను. దీనితో మెగ్నీషియా ఫాస్–6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఎక్కిళ్ళు, తీపిపై కోరిక, ఒకలింపుతో మొండిరకపు ఎక్కిళ్ళు, ముందుకు వంగితే తగ్గే నొప్పి–తెరలు తెరలుగా ఉండుట, వేడి నీరు



వలన ఉపశాంతి; వాయువుతో నిండినకడుపునొప్పి; మర్దన, ఒత్తుకొనుట వలన తగ్గు కడుపు నొప్పి; త్రేపులు వచ్చునుకానీ ఉపశాంతి ఉండకపోవుట; కడుపులో గుడ్డ గుడలు, ఆపానవాయువు బంధించుటవలన పిల్లలలో కడుపునొప్పి, మల విసర్జనముందునొప్పి, ఎప్పుడూ అపానావాయువు వదులుచుండుట, బట్టలు వదులు చేసుకొనుచుండుట.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్–6× లేక 12× లో ప్రతిరోజూ 3 లేక 4 సార్లు వాడాలి. నొప్పి ఎక్కువగా ఉండిన ప్రతి 15నిమిషాలకూ 1 డోస్ చొప్పున తగ్గే వరకూ వాడవచ్చును. దీనిని 30, 200 పొటన్సీలో కూడి వాడవచ్చును. తెరలు తెరలుగా వచ్చే నొప్పికైతే దీనిని వాడవచ్చును. పిల్లలు ఏడ్చుచున్న ముందుగా దీనిని వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** ఎక్కిళ్ళు నీటివంటి వాంతులు, త్రేపుతున్నపుడు మంట, ఉప్పు పదార్థములు ఎక్కువగా కోరుట, దాహము ఎక్కువగా ఉండి–ఎక్కు నీరుత్రాగుట, విపరీతమైన ఆకలి, భోజనానంతరమూ మంట, నిద్రమత్తు.



**చికిత్స :** నేట్రమ్‌మూర్–6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్–6× లేక 12×లో వాడాలి. కడుపులో మంటకు గంట గంటకీ 1 డోస్ చొప్పున వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** పులిత్రేపులు, గ్యాస్ట్రిక్ అల్సర్, ఎసిడిటి ఏర్పడుట, పుల్లని లేక కాఫీ డికాషన్‌లాంటి వాంతి, అజీర్ణము; ఆహారము తిన్న 2, 3 గంటలలోవచ్చు జీర్ణకోశ వ్యాధులు, కడుపులోమంట; గ్యాస్ ట్రబుల్ (కడుపులో వాయువు జేరుట), నులిపురుగులు లేక ఎటువంటి పురుగులైనా వుండి గర్భ కోశములో శూల.

**చికిత్స :** నేట్రమ్‌ఫాస్–6× లేక 12×లో ప్రతిరోజూ రోజుకి (పూర్తిగా తగ్గేవరకూ) 3సార్లు వాడాలి. కడుపులో మంటకి నేట్రమ్‌మూర్–6× లేక 12×,నొప్పికి మెగ్నీషియాఫాస్–6× లేక 12×లో తప్పక వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఎడతెగని వికారము, పైత్యరసము, వాంతి, చేదు రుచితో వాంతి, ఈ పైత్యమువలన తలతిరుగుట, పిండిపదార్థములు అరుగక పోవుట, జీర్ణకోశము నుండీ పుల్లనిపదార్థము నోటిలోనికివచ్చుట, పసికర్లు (కండ్లు, శరీముపచ్చగా మారును. మూత్రము కూడా పచ్చగా వచ్చును) గాలి తిత్తియందు రాళ్ళు ఏర్పడుట.

**చికిత్స :** నేట్రమ్‌సల్ఫ్–6× లేక 12× లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో నేట్రమ్‌ఫాస్–6× లేక 12× లో మరియు కాలిమూర్–6× లేక 12లో

వాడాలి. కడుపునొప్పిలో ఐతే మెగ్నీషియాఫాస్-6× లేక 12లో ప్రతిగంటకీ 1 డోస్‌చొప్పున తగ్గేవరకూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** పసిపిల్లలు పాలుత్రాగినవెంటనే వాంతి చేసు కొనుట, ఉత్తేజకరపదార్థములకు తట్టుకొనలేకపోవుట, జీర్ణకోశములో పుండ్లు.

**చికిత్స :** సైలీషియా-30 లేక 200 లో ప్రతి రోజూ 3సార్లు వాడాలి. దీనితో కాల్కేరియాఫాస్-6×లో వాడాలి. పుండ్లయందు కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 లో వాడాలి.

## మలాశయ, మూత్రాశయ మండల వ్యాధులు

**వ్యాధి లక్షణాలు :** ఆసనమువద్ద పగుళ్ళు; రక్తముకారే మూలశంక పిలకలు, దురద, అంతర్గత మెలలు; మలబద్ధకముతో నడుము, వెన్నుపూస చివరిభాగమునొప్పి; రక్తస్రావము, ఆసనములో తీపు, మూత్రము రంగుగా ఉండి తరచుగా, అధికముగా విసర్జించబడుట.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× లో ప్రతి రోజూ రోజుకి 3 సార్లు చొప్పున కొన్ని నెలలు వాడాలి. దీనితో ఫెర్రమ్ ఫాస్-6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** దుర్వాసనతోకూడిన అపానవాయువులతో విరేచ నాలు; వాంతులు; విరేచనాలు శబ్దముతోకూడిన విరేచనాలు, క్షయలో విరేచ నాలు, పిల్లలకుదంతాలు వచ్చునపుడువచ్చే విరేచనాలు, పిత్తకోశమందు రాళ్ళు, బొడ్డువద్ద నొప్పి, ఛాతి లక్షణాలనుబట్టి మారే కీళ్ళనొప్పులు, వాతావరణ మార్పువలన విరేచనాలు, పక్కలో మూత్రముపోయుట; మూత్రము ఆపుకొనలేక పోవుట, సుగర్‌వ్యాధి; ఫాస్ఫేట్స్, అల్బ్యుమిన్ పదార్థాలు మూత్రముద్వారా పోవుట; మూత్రాశయమునొప్పి, మూత్రపిండాలవ్యాధులు.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6× లేక12×లో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొప్పున కొన్ని నెలలువాడాలి. తగ్గితేఆపాలి. దీనితో కాలిఫస్-6× లేక 12×, కాల్కేరాయాఫ్లోర్-6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** రక్తము, చీముతోకూడిన విరేచనాలు; ఆసనములో వ్రణము, ఆసనము తేమగా ఉండుట, ఆసనము దిగజారుట, ఫిస్టులా మొదటి భాగములో చీముపట్టుట, మూత్రకోశపువాపు, మూత్రము నుండి పస్ (చీము కణము) పోవుట.



**చికిత్స :** కాల్కేరియా సల్ఫ్-3 లేక 200 పొటన్సీలో ప్రతి రోజూ 3 సార్లు వాడవలెను. దీనితో సైలిషియా-30 లేక 200 పవర్‌లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** బంక, రక్తముపడుట; విరేచమునకుతొందర; దగ్గినా, నవ్వినా మూత్రము బొట్లు బొట్లుగాపడుట; మూత్రకోశమువాపు; వేడిగా ఎర్రగావచ్చు మూత్రము; మూత్రమునకు తొందరగాఉండి ఆపుకోలేకపోవుట, మూత్రబంధన; రక్తమూత్రము, మూత్రపిండములవాపు.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-30 పవర్ లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కామెర్లలో తెల్లని విరేచనములు, కాలేయము సరిగా పనిచేయకపోవుట, నులితాడువంటి బారుపురుగులు ప్రేగులలోజేరుట, ఆసనము దురద, తరుచూవాయువు వచ్చుట మలబద్ధకము; క్రొవ్వు, పిండి పదార్థములు సరిపడకపోవుట లేక అరుగుదల ఉండకపోవుట; అజీర్తి విరేచనము, గ్రహణి, మూలశంకలు; మూత్రము నల్లగావచ్చుట; మూత్రములో యూరిక్ యాసిడ్ ఉండుట; బీజములోవాపు, సెగ(గనోరియ),సుఖవ్యాధుల వలన గజ్జలలో బిల్లలు కట్టుట, సవాయిపుండ్లు, గౌట్, ఋతువుఆలస్యము లేక అణగారుట లేక చాలా త్వరితముగానూ ఎక్కువగానూఅగుట; నల్లనిరక్తము, తెల్లనికుసుమ, గర్భ కోశమువాపు మరియు అన్నివాపులకూ.



**చికిత్స :** కాలిమూర్-12× లేక 30 పవర్‌లో ప్రతిరోజూ 3 సార్లు తగ్గేవరకూ వాడాలి. వాపులకూ కాల్కేరియాఫ్లోర్-6× లేక30; ఫెర్రమ్‌ఫాస్-6× లేక 30లు కూడా వాడవలెను. అజీర్తియందు నేట్రమ్‌ఫాస్-6× లేక 30 కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆకస్మిక భయము వలన లేదా ఏ కారణమువలనైనా మనసును క్రుంగదీయు విషయాలలో కలుగు విరేచనములు, వీటివలన అధిక నిస్త్రాణ; విరేచనము కుళ్ళినవాసన ఉండుట; అపానవాయువు-దుర్వాసన ముతో, శబ్దముతోను ఉండుట; మలాశయ లేక మూత్రాశయ పక్షవాతము వలన తెలియకుండా మూత్రము విసర్జన; అతిమూత్రము, మూత్రకోశమునందు నొప్పి, మూత్రనాళమునందు నొప్పి.

**చికిత్స :** కాలీఫాస్-6× లేక 12× లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ప్రేగులనుండీ విసర్జించబడు వాయువు గంధపు వాసనవచ్చుట; జిగురు, రక్తము, చీములతో విరేచనము తద్వారా శూల; ఆస నము నందుతీపు కడుపు వాయువుతోనిండి యుండుట ఆసనము దురద- కలరా, మూత్రకోశమువాపు, మూత్రము తెలియకుండా అగుట.

**చికిత్స :** కాలీసల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజూతగ్గే వరకూ రోజుకి 3 సార్లు చొప్పున వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12లో వాడాలి.



**వ్యాధి లక్షణాలు :** గ్రహణి, నీటివలే విరేచనాలు; విరేచనము వలన శరీరకండరములు, నరములు లాక్కుపోయినట్లు నొప్పులు, మొలలు, తెరలు తెరలుగా పొడుచునట్టి నొప్పులు, భరించలేనినొప్పులూ, చిన్నపిల్లలు విరేచన మైనపుడల్లా ఏడ్చుచుండుట, కడుపులో గుడగుడశబ్దము, మలబద్ధకము, మూత్ర బంధన, తఱచు మూత్రానుమానము, తెలియకుండా మూత్రవిసర్జన, ఫాస్ఫేట్ పోవుట, మూత్రములో ఇసుకవంటి పదార్థాలుజేఋట, మూత్రము తీయుటకు "కేటర్" ఉపయోగించిన తరువాత కలుగుబాధలు.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ 4 సార్లు వాడాలి. దీనితో కాలిఫాస్-6× లేక 12×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ప్రేగులందు తేమలేక పొడిఆరిపోవుయి కలుగు మలబద్ధకము; కాలేయమందు, ప్లీహమందు నొప్పితో కలుగువిరేచము లేక మలబద్ధకము; మలముగట్టిగా పొడిగా ఉండుటచే ఆసనముచిట్లుట, దానివలన భాధ; అసనము చుట్టూ మొలలు, వానినుండి రక్తస్రావము; మలబద్ధకముతో తారుమారుఅగు విరేచనములు (కొంతకాలము విరేచనములు, కొంతకాలము మల బద్ధకము)

**చికిత్స :** నేట్రమ్మూర్-6× లేక 12×లో ప్రతిరోజు3సార్లు వాడవలెను. దీనితో కాల్కేరియాఫాస్-6×లో వాడవలెను.

**వ్యాధి లక్షణములు :** తెలియకుండా అమితముగా మూత్రోత్పత్తి జరిగి, జీర్ణకోశమునందు మంటతో శుష్కించిపోవుట; స్కర్వి వ్యాధిలో రక్త మూత్రము, మూత్రవిసర్జనయందు మంట, బాధ; ఇతరుల ఎదుట మూత్రము విసర్జింపలేక పోవుట; దగ్గినా నవ్వినా తెలియకుండానే మూత్రము పడిపోవుట; మూత్రము వేడి నీటి వలే వచ్చుట.

**చికిత్స :** నేట్రమ్మూర్-6× లేక 12× లో ప్రతిరొజు 3 సార్లు వాడవలెను. దీనితో సైలీషియా-6× లేక 12× లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** కాలేయమందు బల్లఉండుట, కాలేయము గట్టి పడుట, పల్లనివాసనతో ఆకుపచ్చగా కలబంద జిగురువలే భాదతోకూడిన విరేచనములు; ముక్కి ముక్కి మలవిసర్జనచేయుట, విరేచనము ఆపుకొనలేక పోవుట; ప్రేగులయందు ఏలికపామువంటి క్రిములు-వీటివలన ఆసనము



దురద; పసికర్లలో విరేచనము తెల్లగాఉండుట, మలబద్ధకము, కడుపులో వాయువు చేరుట, కాలేయవ్యాధితోఉండు మధుమేహము, షుగర్వ్యాధి, మూత్ర విసర్జన సమయములో ముక్కుట, మూత్ర కోశమునకు శక్తితగ్గి తెలియకుండానే మూత్ర విసర్జనముఅగుట, మలవిసర్జన అరంతరమునిస్త్రాణ.

**చికిత్స :** నేట్రమ్ఫాస్-6× లేక 12× లో ప్రతిరోజూ రోజుకి 3సార్లు చొప్పున తగ్గేవరకూ వాడవలెను. దీనితో నేట్రమ్సల్ఫ్-6× లేక 12×, కాలి మూర్-6× లేక 12×లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** ఉదరములో వాయువు చేరుటవలన శూల, దీని వలన కుడిగజ్జలలో పోటుఉండుట, నల్లని లేక పైత్యసంబంధమైన విరేచన ములు; వంశపారపర్యంగా అయ్యే విరేచనములు, తేమ వాతావరణము వలన కలుగు విరేచనములు; ఆసనమువద్ద తొడలపైన పులిపిర్లు, మధుమేహము, అతిమూత్రము, మూత్రపిండములవాపు, మూత్రము పచ్చగా లేక ఆకు పచ్చగా ఉండుట, మూత్రాశయములో రాళ్ళు, మూత్రవిసర్జనలో మంట (సెగవ్యాధి).

**చికిత్స :** నేట్రమ్సల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లేక 12×లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** గజ్జలయుందు గ్రంథులయందువాచుట, ఉదరము పెద్దదిగా ఉండుట, వెన్నుపాము వ్యాధులతోకూడిన మలబద్ధకము, మలము ఆసనమునుండీ బయటకువచ్చి మరలా లోపలకుపోవుట, ముక్కుటకు కూడా శక్తి చాలకపోవుట, మలము వ్రేలితో బయటికి తీయవలసివచ్చుట; ప్రేగులు కాలేయము, మూలాశయములో వ్రణములు; టీకాలువలన విరేచనములు అగుట, శవముకాలినట్లుగా విరేచనము వాసనవచ్చుట, మూలశంకకు చీము పట్టి బాధగాఉండుట, ఫిస్టులా (భగందరమూ లేక మర్మస్థానమందలి వ్రణ ములు), మూత్రాశయమునకు చీముపట్టుట; చీమురక్తముతో కలిసిన మూత్రము, ప్రోస్టేట్‌గ్రంథివాపు, మూత్రము ఆఖరున ఎర్రనిఇసుకవంటి పదా ర్థము ఏర్పడుట, దుర్వాసనకొట్టు స్రావములు.

**చికిత్స :** సైలీషియా-30 లేక 200 పవర్‌లో ప్రతిరోజూ 3 సార్లు వాడవలెను. దీనితో నేట్రమ్మూర్-30 లేక 200 వాడవలెను. (సైలీషియా-6× లోను అంతకంటే తక్కువ ప్రొటన్సీలోవాడినా చీముపట్టును. కావున తక్కువ పొటన్సీలో వాడునపుడు వైద్యుని సలహాలు తీసుకొనుట మంచిది).

## పురుషజనేంద్రియమండలవ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** వృషణములు శుష్కించుట, శుక్లము (వీర్యము) మరియూ ప్రొస్టేట్ స్రావము కలిసి కొద్దికొద్దిగా పోవుచుండుట; వృషణములు గట్టిపడి వాపుతో, బాధతోఉండుట, వాపులన్నీ గట్టిగా రాయివలేఉండుట.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× లో ప్రతిరోజూ3సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** పురుషాంగము ఉద్రేకించుటవలన బాధగా వుండుట; గనోరియా దానికి సంబందించినకీళ్ళుసవాయా, బీజములుఉబ్బుట, అధిక రతివాంఛకలిగిఉండుట.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6× లేక 12× లో ప్రతిరోజూ మూడు సార్లు వాడాలి. వృద్ధులకు 6× అంతకంటే తక్కువ పొటన్సీలో తరుచూవాడరాదు.

**వ్యాధి లక్షణాలు :** శుక్లనష్టము, పురుషాంగము స్తంభించినపుడు అంగము అడుగుభాగములోని నరము పచ్చిపుండువలే ఉండుట.

**చికిత్స :** కాలేరియాఫాస్-6× లేక 12×లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** బీజకోశముఉబ్బి ఎర్రగా ఉండుట, వేడిగా ఉండుట; గజ్జలయందువాపు, ఎర్రనివాపుతో పురుషాంగమునుండీ రక్తస్రావము.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12లో ప్రతిరోజూ3సార్లు వాడుచుండ వలెను.

**వ్యాధి లక్షణాలు :** సెగ (గనోరియా) వ్యాధిఅణుచుట వలన బీజము వాపు, సుఖవ్యాధులు వాటివలన లింఫ్‌గ్లాండ్స్‌వాచుట సవాయిపుండు.

**చికిత్స :** కాలిమూర్-6× లేక 12లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నపుంసకత్వము, ఉదయము అంగస్తంభన వలన బాధ, రతివాంఛ ఎక్కువఅగుట, అంగస్తంభన లేకుండానే శుక్లము విడుదల అగుట; సంభోగానంతరమూ నిస్త్రాణ, నీరసము, పురుష జనేంద్రియ చివరి భాగమువాపు, సవాయిపుండు.

**చికిత్స :** కాలిఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడవలెను. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో వాడాలి. వీటిని వీటిని ఇంకా ఎక్కువ పొటన్సీలు వాడవలసి రావచ్చును (30-200).





**వ్యాధి లక్షణాలు :** గనోరియా (సెగవ్యాధి), జిగురువంటి పచ్చని లేక ఆకుపచ్చని స్రావము, పురుషాంగము చివరి భాగము(గ్లాన్స్ పెన్నీస్)వాచుట; గ్లీట్, గనోరియా అణగారిన తరువాత కలుగువృషణాలవాపు, సిఫిలిస్ (సవాయి).

**చికిత్స :** కాలీసల్ఫ్-6× లేక 12 లో ప్రతిరోజూ 3 పూటలా వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** నరముల బలహీనత వలన కలిగి నపుంసకత్వము, బీర్జములులాగినట్లు నరములనొప్పి.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో ప్రతి రోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాలీఫాస్-6× లేక 12×లో వాడాలి. (ఆ ఔషదము శుక్లమునకు చిక్కపరుచును. అభివృధిచేయును).

**వ్యాధి లక్షణాలు :** వృషణాలతిత్తి( బీర్జకోశము) దురద, జననేంద్రియ ములపై గలవెంట్రుకలు రాలిపోవుట; శుక్లవాహికనాళము మరియు వృషణ ములుఉబ్బుట లేక నొప్పి; సెగ, సిఫిలిస్, స్థలనానంతరము అతి రతివాంఛ, బుడ్డ (బీర్జములకు నీరుపట్టుట), నపుంసకత్వము.

**చికిత్స :** నేట్రమ్‌మూర్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు తగ్గే వరకూ వాడాలి. దీనితో నేట్రమ్‌సల్ఫ్-6× లేక 12× లో వాడాలి. సిఫిలిస్‌కి సైలీషియా-200 పవర్‌లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కలలు లేకుండానే శుక్లము విసర్జించబడుట, శుక్లము పలుచబడుటచే శక్తిలేకుండా ఉండుట, రతివాంఛ నశించుట, వీటితో జీర్ణ కోశలక్షణములు.

**చికిత్స :** నేట్రమ్‌ఫాస్-6× లేక 12× లో ప్రతి రోజూ 3 సార్లు గాని 4 సార్లుగానీ వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు :** పురుషాంగమునకు నీరుపట్టుట, ఉబ్బుట, బుడ్డ; ప్రోస్టేట్ గ్లాండ్‌వాచుట; బీర్జములపై, అంగముపై పులిపిర్లు లాంటి పొక్కులు ఉబ్బెతుగా పురుగుట, గనోరియా.

**చికిత్స :** నేట్రమ్‌సల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజూ 3సార్లు వాడవలెను. దీనితో కాలీమూర్ -6× లేక 12× లో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** దీర్ఘకాలపు సవాయిపుండ్లు, మాననటువంటి మొండిపుండ్లు, గనోరియావ్యాధి, చీముకారుట, ఎల్లప్పుడు రతిపై కోరిక, రాత్రులు స్థలనముఅగుట, నపుంసకత్వము రతి అనంతరము నీరసము, తేలికగా అలయుట, అంగము దురద, శుక్లనష్టము, ఒరుపు కలిగించు స్రావములు.

**చికిత్స :** సైలిషియా-200 పవర్ లో ప్రతిరోజూ వాడాలి. దీనితో "ఎన్.ఎమ్.-200" వాడాలి. పుండ్లకు సి.ఎస్.-200వాడాలి.



## స్త్రీ జనేంద్రియ మండల వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** గర్భాశయముస్థానము తప్పుట లేక దిగజారుట; గర్భకోశము క్రిందికులాగినట్లు బాధలు, జననేంద్రియముమీద సిరలు ఉబ్బుట, గర్భాశయమునుండీ విస్తారమైన రక్తస్రావము, ఋతుస్రావము అధికముగా అగుట, గర్భాశయమునందు కంతిని కరిగించుటకు; గర్భవతికి సుఖప్రసవము జరుగుటకు; ప్రసవానంతరము-యోనికండరాలు సంకోచముచెంది, యధా స్థితికిజేరడానికి, గట్టిగాఉండు స్తనములవాపుకు, స్తనములలో ముడులులాంటి గట్టికంతులు, సవాయి.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× లో ప్రతిరోజు 3 లేక 4 సార్లు వాడాలి. సుఖప్రసవమునకు దీనితో కాల్కేరియాఫాస్6× లో 4 నెలల వరకూ వాడి తరువాత; మెగ్నీషియాఫాస్-6× కాలీఫాస్ -6×లు కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కీళ్ళవాత సంబంధమైన బాధలతో గర్భాశయ వ్యాధులు, గర్భకోశముస్థానముతప్పుట; కన్యలకు కలుగు రతివాంఛ, దానివలన కలుగుహస్తప్రయోగము, దీని చెడులక్షణాలు మరియు బహిస్టుకుముందు అతి రతివాంఛ, అండాశయములువాపు, గర్భాశయవ్యాధులతో నడుమునొప్పి; కుసుము; కన్యలలో కుసుమవ్యాధి, ఋతుక్రమము సక్రమముగా ఉండకపోవుట పాలిచ్చుతల్లులకు ఋతుస్రావము, బహిస్టులోబాధలు, యోనిశీర్షములో (క్లిటోరిస్) మంట, తల్లిపాలురుచి చెడి-పిల్లలు త్రాగలేకపోవుట, పాలలో దోషముండుట, పాలిచ్చుతల్లులకు నీరసముగా ఉండుట, గర్భవతిస్తనములబాధ, స్తనము బరువుగాలేక పెద్దవి అయినట్లు ఉండుట.

**చికిత్స:** కాల్కేరియాఫాస్-6× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. గర్భిణీ స్త్రీలకు 6 నెలలు తరువాత వాడకూడదు,(6 నెలలు తరువాత వాడినా శిశువు యొక్క అస్థిపంజరము బాగా పెరిగి ప్రసవము కష్టమగును) దీనితో కాల్కేరియా ఫ్లోర్-6×లో వాడాలి. గర్భిణీస్త్రీకి ఎమ్.పి. 6× K.P.6లు కూడా వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** బహిస్టు అనంతరము క్లిటోరిస్ (యోనిశీర్షము) దురద, ఋతువు ఆలస్యముగావచ్చి స్రావము ఎక్కువకాలము అగుట; గర్భాశయములో పుండ్లు, చీములాంటి కుసుము, స్తనములవాపు, చీముజేరుట.

**చికిత్స:** కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 లో ప్రతిరోజు 3 సార్లువాడాలి. దీనితో సైలీషియా 200 వాడాలి.



**వ్యాధి లక్షణాలు:** వాంతులతో కూడిన ఋతుశూల; యోనిలో పొడిగా, వేడిగా ఉండుట, అధికముగా ఎర్రని రుతుస్రావము; నడుము, పొత్తికడుపునొప్పి; తరచూమూత్రవిసర్జన చేయవలెనని కోరికతో కలుగు ఋతుశూల, యోనివాపు; సంభోగించునపుడు, పరీక్షించునపుడూ యోనినొప్పి; యోనికి సహనశక్తి ఉండక పోవుట, స్తనములవాపు, ప్రథమ దశలోని వేవిళ్ళు, పాలజ్వరము రాకుండా కాపాడుకొనటకు, ప్రసవానంతరమూ రక్తస్రావము.

**చికిత్స:** ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12×లె వాడాలి. అవసరముబట్టీ 30 పొటన్సీ వరకూ వాడవచ్చును. ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. రక్తస్రావాలకుఐతే దీనితో కాల్కేరియాఫ్లొర్-6× లేక 30 పొటన్సీలో వాడాలి. నొప్పులకైతే మెగ్నీషియాఫాస్6×లో వాడవలసి వుంటుంది.

**వ్యాధి లక్షణాలు:** బహిస్టుఆలస్యముగావచ్చుట లేక అణగారుట లేక త్వరగావచ్చుట లేక స్రావము అధికముగాఅగుట, నల్లగా పేరుకుపోయిన స్రావము, చిక్కగా జిగురువంటిస్రావము, తారువంటి స్రావము, కుసుమ తెల్లగా పాలవలే ఉండి, ఎటువంటి బాధలు ఉండకపోవుట, గర్భకోశము పెద్దది అగుట, స్తనములవాపు, ప్రసవానంతర జ్వరము, వేవిళ్ళు.



**చికిత్స:** కాలిమూర్-6× లేక 12× లో ప్రతి 3 రోజులకు 1 డోస్ చొప్పున వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు:** రతివాంఛ ఎక్కువగా ఉండుట, రతిక్రీడానంతము నీరసముగా ఉండుట, దుర్వాసనతో కూడిన- ఋతుస్రావము-ఋతుక్రమము-సక్రమముగా ఉండకపోవుట; బహిస్టులో తలనొప్పి, నిద్రమత్తు అలసట, అండాశయములోనొప్పిగా ఉండుట, బహిస్టుఅనంతరము సంభోగవాంఛ అధికముగాఉండుట. కన్నీరుకార్చు స్వభాముండుట, హిస్టీరియా, స్తనములవాపు, ప్రసవ నొప్పులు; ప్రసవానంతర సంధిజ్వరము; ప్రసవము కష్టమగుట, కల్ల (దొంగ) నొప్పులు.

**చికిత్స:** కాలీఫాస్-6× లేక 12× లో, ప్రతి రోజు3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనితో పాటుగా మొగ్నీషియాఫాస్-6× లేక 12× లో వాడవలెను.(సుఖప్రాసవానికి నెల తప్పిన దగ్గరనుండి- ప్రసవమయ్యేంత వరకూ ఈ ఔషదాలను వాడవలసి ఉంటుంది. వైద్య పర్యవేక్షణ అవసరము)

**వ్యాధి లక్షణాలు :** గనోరియా; సిఫిలిస్; జిగురుగా- ఆకుపచ్చగా స్రావము; కుసుమ, గర్భకోశము నుండీ రక్తస్రావము.

**చికిత్స :** కాలీసల్ఫ్-6× లేక 12× లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఋతుశూల నొప్పితగ్గుచూ, హెచ్చుచూనుండుట; యోనికండరములు ముడుచుకుపోయినట్లుబాధ; అండాశయములబాధ, పీచు లాంటి రక్తస్రావముతో కలుగు ఋతుశూల; గర్భాశయము ముడుచుకుపోవుట, ప్రసవనొప్పులు, కల్ల (దొంగ) ప్రసవనొప్పులు- ఈనొప్పులవలన కాళ్ళులాక్కు పోవుట, ప్రసవమునందు లేక అనంతరము కలుగుపోర్లు.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక12×లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. (ఇది ఋతుశూలలకు ప్రధానమైన ఔషదం) దీనితో కాలిఫస్-6 లేక 12× లో వాడాలి. నొప్పితీవ్రముగాఉంటే15నిమిషాలకు ఒకడోస్ చొప్పున వాడవచ్చును. (సుఖప్రసవమునకు ఈ ఔషధాన్ని నెలతప్పిన దగ్గర నుండీ ప్రసవించేవరకు వాడవలెను.)

**వ్యాధి లక్షణాలు :** యోని పొడిగాఉండి, రతిలో బాధగా ఉండుట, రతిలోమంట, రతి అనంతరము మంటతో కూడిన కుసుమ, బహిస్టుతో వచ్చు తలనొప్పి; ఋతుస్రావము విస్తారముగాఅగుట, యోనిదురద, యోనిపైగల వెంట్రుకలు రాలిపోవుట, గర్భకోశము దిగజారుట, వేవిళ్ళు, ప్రసవానంతరము తలవెంట్రుకలురాలుట, స్తనములు క్షీణించుట, గర్భాశయవ్యాధులు పరుండుటచే ఉపశనము కలుగుట.

**చికిత్స :** నేట్రమ్మూర్-6× లేక 12× లో ప్రతిరోజు3 సార్లు వాడాలి. దీనితో సైలీషియా-30వాడాలి. ప్రసవానంతరము కాల్కేరియాఫ్లోర్-6× తోనూ, బలమునకు కాల్కేరియాఫాస్-6×తోను వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** పుల్లనిద్రవముతో కూడిన వాంతులు, వేవిళ్ళు, బహిస్టు అనంతరము అధికమయ్యే తలనొప్పి; కీళ్ళవాత నొప్పులతో గర్భకోశము స్థానము తప్పుట, కుసుమ; గర్భవతి కాకపోవుట.

**చికిత్స :** నేట్రమ్ఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లక 12× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** దురద, గనోరియా ద్రవముతో కూడిన పొక్కులు ఉబ్బియుండుట; బహిస్టునకు ముందు ముక్కు నుండి రక్తస్రావము, కుసుమ స్రావము- బరువు కలిగించి అదిస్రవించినంత మేరకు ఆభాగములు తిని వేయుట; చేదు రుచితోవుండు వాంతులు, వేవిళ్ళు, గర్భిణీలో శరీరమునకు నీరుపట్టుట; చర్మవ్యాధి.



**చికిత్స :** నేట్రమ్సల్ఫ్-30 లేక 200లో ప్రతిరోజు 3 సార్లువాడాలి. వాంతుల యందు నేట్రమ్ఫాస్-6×, కాలీమూర్-6×తో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చనుకుదురు, స్తనములకు చీముపట్టుట, స్తనము లలో పుండ్లు, స్తనాగ్రములు (చనుమొనలు)పగిలి, తేలికగాపుండ్లుపడుట, దీని వలననొప్పి, జ్వరము కలుగుట, ఋతుక్రమము సక్రమముగా ఉండక తక్కువ స్రావముఅగుట; కుసుమ చీమువలే ఉండుట; అండవాహిక నాళములు పూడి పోవుట లేక చీముపట్టుట; జననేంద్రియముపైపుండ్లు; చన్నీటిలో నిలబడిన రక్తస్రావముఅగుట, గొడ్రాలితనము.

**చికిత్స :** సైలిషియా-30 లేక 200 పొటన్సీలో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 కూడా వాడాలి.

## శ్వాసావయవ మండల వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** "క్రూప్" వ్యాధి, గొంతుకలో గులగులగా వున్న భావనతో కలుగు దగ్గు, కొండనాలుక పెద్దది అగుటచే కలుగు దగ్గు, గొంతు బొంగురు.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** స్వరము సరిచేసుకొనుటకు తరచు ఖాండ్రించవలసి వచ్చుట, ఎడతెగనిదగ్గు, క్షయ, కోరింతదగ్గు, పిల్లలు పాలుతాగినపుడు ఊపిరి ఆడనట్లుగా ఉండుట, ఏడ్చినపుడు ముఖము నీలిరంగులోకిమారుట, పటుత్వము లేని పిల్లలు; పెద్దలు ఛాతి పట్టుకొనుటువంటి దగ్గు.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6× లేక 12×లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. (క్షయవ్యాధిలో దీనిని టానిక్గా ప్రతిరోజు రెండుసార్లు వాడాలి). వృద్ధులకు దీనిని తక్కువ పవర్లో ఎక్కువసార్లు వాడరాదు.

**వ్యాధి లక్షణాలు :** ఊపిరితిత్తులు మరియు బ్రాంకైటిస్లో చీము చేరుట, ఉబ్బసమునందు చీములాంటికళ్ళె క్షయ, న్యూమోనియా, మెండిరకపు గొంతు బొంగుర, రొంప, చిక్కగా తెల్లని కళ్ళె వచ్చుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30 లేక 200లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలిమూర్-30 లేక 200 పవర్ లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** శ్వాసనాళము వాపు వలన కలిగిన దగ్గు, జ్వరములు, స్వరపేటిక వాపు, న్యూమోనియా (ఊపిరితిత్తుల వాపు); ప్లూరసి (ఊపిరితిత్తుల చుట్టూఉన్న పొరవాపు), రక్తముతో కూడిన కళ్ళె, క్షయ దగ్గరలో ఛాతి పట్టినట్టుగా

ఉండుట, అదురుపాటు వలన కలిగిన రక్తస్రావము; దగ్గునపుడు మూత్రము తెలియకుండాఅగుట, వమనముతో కూడినదగ్గు, (కోరింతదగ్గు) గొంతు బొంగుర, గొంతునొప్పి; వేడివలన గొంతు బొంగుర నొప్పి.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-30 పవర్‌లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. జ్వరములో చెమటపట్టు వరకూ వాడాలి. జ్వరము నందు, తీవ్రవ్యాధులయందు గంటకి 3మాత్రలు చొప్పునవాడాలి. దీనితో కాలీమూర్ 30 పవర్‌లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చల్లదనమువల్ల స్వరముక్షీణించుట లేక స్వరము పోవుట, ఉబ్బసము, తెల్లటి కళ్ళెతో కూడిన దగ్గు, బ్రాంకైటిస్ (శ్వాసనాళో సశాఖవాపు), బిగ్గరగా ఉండు దగ్గు, న్యూమోనియా, ప్లూరసి, జిగురుగా ఉండు కళ్ళె, గురక, గుఱ్ఱు గుఱ్ఱు మనే శబ్దము, తెల్లని పడిసెము దగ్గు.

**చికిత్స :** కాలీమూర్-6× లేక 12× లో ప్రతిరోజు రోజుకి 4 లేక 5 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12 లో వాడాలి. జలుబు నీటివలే ఉండిన నేట్రమ్‌సల్ఫ్-6× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆహారము తిన్నపుడు కలుగు ఆయాసము, దగ్గు; స్వరపేటికకు పక్షవాతముకలిగి స్వరముపోవుట; దుర్వాసనగల కళ్ళె, దగ్గు; నరముల బలహీనత వలన కలిగిన రొప్పు, అతి నీరసము, రతి అనంతరమూ అలసట.

**చికిత్స :** కాలీఫాస్-6× లేక 12× లో ప్రతోరోజు రోజుకి 3 లేక 4 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కళ్ళె ఓరకముగా ఉండక రంగులు మారుతూ జిగురుగా ఉండుట, విస్తారముగానుఉండు ఆయాసము, దగ్గు, పడిసెము; గొంతులో బుడగలాంటి గుఱగుఱ శబ్దము; ఇది వేడివాతావరణములో ఎక్కువగుట; కళ్ళె త్వరగా తెగిపడకపోవుట; ఛాతీపడిసెము, కోరింత దగ్గు.

**చికిత్స :** కాలీసల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** కడుపులో వాయువుజేరుట వలన కలుగు ఆయాసము, స్వరము కీచుగాఉండుట; ఛాతీనొక్కినట్లు, బిగిసినట్టు ఉండుట; తెరలు తెరలుగా కలుగు దగ్గు, కోరింతదగ్గు, దగ్గువలన పరుండుట కష్టమగుట.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు రోజుకి 4 లేక 5 సార్లు తగ్గే వరకూ వాడాలి. దీనితో నేట్రమ్‌ఫాస్-6× లేక 12× లో వాడవలెను.



**వ్యాధి లక్షణాలు :** పలుచని శ్లేష్మము, దగ్గుతోకూడిన తలనొప్పి, దగ్గుతో మూత్రము చుక్కలుచుక్కలుగా పడుట, దగ్గినపుడు పొత్తికడుపు, బీర్జాలు, శుక్ర వాహక నాళము నొప్పి; దగ్గులో కన్నీరుకారుట, గుండెదడ, వేసవిలో కలుగు జలుబు, ఊపిరితిత్తులకు నీరుపట్టుట, గొంతు బొంగుర.

**చికిత్స :** నేట్రమ్‌మూర్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× మరియు సైలీషియా-30 పటెన్సీలో వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** తేమ వాతారణము మరియు వర్షాకాలము నందు కలుగు ఉబ్బసము,దగ్గు, జలుబులు; కళ్ళెతో కూడిన దగ్గు, ముక్కునుండి నీటి వంటిస్రావము, తుమ్ములు; ఛాతిపట్టుకొని దగ్గుట.

**చికిత్స :** నేట్రమ్‌సల్ఫ్-6× లేక 12×లో ప్రతిరోజు రోజుకి 3 లేక 4 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. దీనితో కాలిమూర్ 6× లేక 12× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** "ప్లూరా"కు చీముపట్టుట, చీముతోకూడిన కళ్ళె క్షయ రాత్రులు విస్తారముగా చమటపట్టుట, రాత్రులు చల్లనిపానీయమువలన దగ్గు, ఆయాసముఉద్రేకించుట; చిన్నచిన్న గింజలులాంటి కళ్ళె చెడువాసనతో వుండుట, నీరసము, అలసట.

**చికిత్స :** సైలీషియా-30 పవర్‌లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. దీనితో నేట్రమ్‌మూర్-6×లో వాడాలి. క్షయలో 30 పొటన్సీల కంటే తక్కువ పొటన్సీ లలో వాడరాదు.

## హృదయ మండలము, కాళ్ళు, చేతుల వ్యాధులు-మందులు

**వ్యాధి లక్షణాలు :** గుండె పెరుగుట, గుండెదడ; రబ్బర్‌వలే సాగి ముడుచుకొను స్థితి-స్థాపక కండరాలయొక్క సంకోచ-వ్యాకోచాలకు తగిన శక్తిని గుండె ఇవ్వలేకపోవుట; రక్తనాళములు, ధమనులు, సిరలూ ఉబ్బుట, గోరుచుట్టు, కణుపుజేష్ట; చేతులు, కాళ్ళు కీళ్ళయందు శబ్దములు, కీళ్ళవాపు, ఎముకల యందు కంతులు, ఎముకల పెరుగుట, కీళ్ళయందు ద్రవముతగ్గుట లేక స్నిగ్ధద్రవము కూడుట; మణికట్టునొప్పి, ఎముకలయందు నొప్పి, రాయి లాంటి కంతులు.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× లో ప్రతిరోజు వాడాలి. దీనితో కాల్కేరియాఫాస్-6× లో ఎదుగుదల గల పిల్లలయందు వాడవలెను.

**వ్యాధి లక్షణాలు :** గాలి పీల్చునపుడు గుండలోనొప్పి, గుండెదడ రక్త ప్రసరణ మందముగానుండి శరీరమంతా తిమ్మిర్లు; గుండెనొప్పి చురుకుతో ఉండుట; భుజము రెక్కల గూళ్లయందు నొప్పి; చేతిని పైకి ఎత్తలేకపోవుట; మణికట్టు, వ్రేళ్ళు, బొటనవ్రేలు, మోచేయి నొప్పులు; కండరములు ముడుచుకు పోయినట్లుగా బాధ; కీళ్ళవాతపు నొప్పులు; వసంతకాలము తగ్గిపోయి వర్షా కాలము అధికమయ్యే బాధలు; తొడలనొప్పి; మోకాలినొప్పి నడుచుటచే అధిక మగుట; చీలమండ యందునొప్పి మరియూ చీలమండలము స్థానము తప్పు చుండుట; తుంటికీళ్ళనొప్పి , రికేట్స్‌వ్యాధి, పిల్లల యందు నడక నేర్చుకొనుట ఆలస్యమగుట.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6×లో ప్రతిరోజు 3 సార్లు వాడవాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-6×, మెగ్నీషియాఫాస్-6×, కాలీఫాస్-6×లలో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** హృదయము చుట్టూ ఉన్న పొరవాచి చీము జేరుట; రాచపుండ్లు, చేతివ్రేళ్ళ బిళ్ల బిగుసుకుపోవుట, తుంటినొప్పి; కీళ్ళలో చీము జేరుట, వాపు; ఆరికాళ్ళయందుదురద, మంట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-30 పవర్ లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** రక్తనాళము, కేశనాళికలు (సన్నని రక్తనాడులు) రక్తప్రసరణాధిక్యత గలిగిన స్థితిలో గుండె కొట్టుకొనుట ఎక్కువగుట; గుండెవాపు, దడ; ఎఱ్ఱనివాపు, వెచ్చదనముతో నుండు కీళ్ళ వాపులు; కాళ్ళు చేతులు ఉబ్బుట, నొప్పులు; శరీరము ఎప్పుడూ కాకతో ఉండి, నిద్రపట్టక పోవుట.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12 లో ప్రతిరోజు3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** గుండెదడ; రక్తము కుదపలు-కుదపలుగా ఏర్పడి రక్త ప్రసరణ సరిలేక పోవుటచే వ్యాధులు వచ్చుట; గుండెదడ, వాపులు గౌట్; కీళ్ళ వద్ద అనవసరపు పదార్థాముజేరి కీళ్ళవాపు , నొప్పులు, ఇవి కదలికచే ఎక్కువగుట; రాత్రులయందు కాళ్ళుచేతులు నొప్పుల వలన పడకమీద పరుండ లేకపోవుట, నడుమునుండీ పాదము వరకూ లాగుచున్న నొప్పులు; కాళ్ళు పాదములు ఉబ్బుట, ఈ ఉబ్బు దీర్ఘకాలముఉండుట; వాపువలన నొప్పి ఉండక పోవుట, దురద.

**చికిత్స :** కాలీమూర్-6× లేక 12× లో వాడవలెను. దీనిని 30, 200 పొటన్సీలలో కూడా వడవలసి రావచ్చును. ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12 లో తప్పక వాడవలెను.



**వ్యాధి లక్షణాలు :** గుండె, నాడీ మండలాలనీరసము వలన శోషిల్లు నంత నిస్త్రాణ; తలత్రిప్పు, భయము, అలసటవలన శోషిల్లుట; మానసిక ఆం దోళన, దు:ఖము వలన గుండెపని లోపించుట; స్వల్ప శ్రమవలనగానీ, మాసిక ఆలోచనవలనగాలీ, మెట్లు ఎక్కుట వలనగానీ దడగా వుండుట; చేతులు వ్రేళ్ళు నిస్సత్తువగా ఉండుట; రక్త క్షీణత వలన గుండెదడ, కాళ్ళలో సత్తువ లేకపోవుట; నాడీమండల బలహీనత వలన నిద్రపట్టకపోవుట; నడుచునపుడు తూలుట, కాళ్ళుతడబడి తప్పడగులుపడుట, తిమ్మిర్లు; కాళ్ళు, చేతులు, పాదములు దురద; కూర్చొని లేచుటవలన కాళ్ళ నొప్పులు; కదులటచే నొప్పులు తగ్గుట; ఉదయము కూర్చొని లేచినపుడు విశ్రాంతివలన నొప్పులు ఉద్రేకించుట, కండరాల నొప్పులు; శరీర భాగమునందు ఎచ్చటనైనా పక్షవాతము వచ్చుట.

**చికిత్స :** కాలీఫాస్-6× లేక12× లో ప్రతిరోజు రోజుకి 3 లేక 4 సార్లు వాడాలి. నరాలవ్యాధులలో ఐతే-మెగ్నీషియాఫాస్-6× లేక 12× లోను; కండరముల రక్తక్షీణతవ్యాధలలో అయితే ఫెర్రమ్ ఫాస్-6×లో వాడాలి. పక్షవాతమునందు ఈఔషధాలను కొన్నినెలలు వాడవలసి రావచ్చును.

**వ్యాధి లక్షణాలు :** నాడీమండల ధనారింపుతో పొత్తికడుపునందునొప్పి, నియమిత సమయాలలో కలుగుకీళ్ళు లేక నరాలనొప్పి, ఇది సాయంకాలము వేడి వాతావరణములో ఎక్కువై, చల్లని వాతావరణములో తగ్గుట; మారుచుండు నొప్పులు, స్థానముమారునపుడు ఉండు కీళ్ళవాతనొప్పులు, పొలుసులూడు చర్మవ్యాధి (కాళ్ళు, చేతులపై ఉండును). కీళ్ళవాపు (దీనిలోని ముఖ్యలక్షణము స్థానములు మారుట)

**చికిత్స :** కాలీసల్ఫ్ 6×లేక 12×లో ప్రతిరోజు 3సార్లు తగ్గేవరకు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** గుండెల్లోనొప్పి, బిగిసినట్టుగానొప్పి; గుండె భారముగాఉండుట; గుండెకొట్టుకొను అదురు- బట్టలు వేసుకున్నను కనిపించు చుండుట, గుండెదడ, ఇది ఎడమవైపు పరుండినపుడు ఉపశమించుట; కాళ్ళు, చేతులు వణకు; కండరములు, నరములు కుంచించుకుపోయినట్లు కలుగు నొప్పులు; కీళ్ళయందు నొప్పి; సయాటీకానొప్పి, పాదములంద సున్నితముగా ఉండునొప్పి; అన్నిరకముల నొప్పులు మెరుపు తీగవలే వచ్చి పోవుచుండుట; తెరలు తెరలుగా కలుగునొప్పులు, నొప్పిస్థానము మారుచుండుట, నొప్పి ప్రాకు చున్నట్లు స్థానము మారుట.

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో మారుతున్న నొప్పులకైతే కాలీసల్ఫ్-6× లోను; నరముల

నొప్పులకైతే కాలీఫాస్-6× లోను; ఎముకల నొప్పులకైతే కాల్కేరియాఫ్లోర్-6× లోను; జీర్ణకోశ నొప్పులకైతే- నేట్రమ్‌ఫాస్-6×, కాలీమూర్-6× లు కలిపి వాడిన చాలా త్వరగా గుణము కనిపించును.

(**గమనిక :** కాలీసల్ఫ్ నందు స్థానముమారిన నొప్పి- మొదటిస్థానములో కూడా ఉంటుంది. కాని మెగ్నీషియాఫాస్‌నందు స్థానము మారగానే మెదట స్థానములో నొప్పి ఉండదు)

**వ్యాధి లక్షణాలు :** గాలి గట్టిగా పీల్చుటవలన గుండెల్లో నొప్పి, నాడీ మధ్య మధ్య అందక పోవుట; రక్తక్షీణతలోను, నీరుపట్టుటలోను కలుగ గుండెదడ; గండెపెరుగుట, శరీరమంతటా తిమ్మిర్లు; కాళ్ళునొప్పి, నీరసము; అలసట; కీళ్ళయందు పగిలనట్లు శబ్దాలు; చీలమండల నీరసము; నీటిబొబ్బలవంటి వ్యాధి; అరచేతులయందు సురుగుడు కాయలు; తుంటినొప్పి, సయాటికానొప్పి, తొడల నొప్పులు, కీళ్ళపొరలువాచుట, కాలివ్రేళ్ళ మధ్య పగుళ్ళు;

**చికిత్స :** నేట్రమ్‌మూర్-6× లేక 12×లో ప్రతిరోజు 3సార్లు తగ్గే వరకూ వాడాలి. దీనితో సైలిషియా-30 పవర్‌లోనూ; మెగ్నీషియాఫాస్-6× లోనూ వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** రక్తము గెంతుచూ పరిగిడుచున్నట్లు ఉండుట; కాళ్ళు-చేతుల యందలి బొటనవ్రేళ్ళునొప్పి, గుండె ప్రాంతములో వణకు; కాళ్ళు-చేతులు చల్లగా ఉండి, బిగిసి ఉండుట; నడుచుటచే ఈబిగి సడలినట్టుగా ఉండుట, నడక నిలకడగా ఉండకపోవుట; మోకాళ్ళు, చీలమండలు, తుంటి, తొడలవద్ద నొప్పి; వ్రాయుచున్నపుడు చేతివ్రేళ్ళ కండరములు సంకోచించి బాధకలుగుట; చేతివ్రేళ్ళు, కీళ్ళువాచి నొప్పి; కీళ్ళనొప్పులు, గుండె అకస్మికముగా అగి పోవుట.

**చికిత్స :** నేట్రమ్‌ఫాస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లేక మెగ్నీషియాఫాస్-6× లువాడాలి.

**వ్యాధి లక్షణాలు :** గుండెయందు ఆందోళన ఉన్నట్లుగా ఉండుట, ఇది అరుబయట గాలిలోతిరిగిన ఉపశాంతి; మెనింజైటీస్ వ్యాధి; కాళ్ళు చేతు లకు నీరపట్టుట; పాదములుఉబ్బుట; గోరుచుట్టు; గోరుచుట్టు వాచియుండుట; కాళ్ళుచేతులు దురద; సయాటీకా నొప్పి; కూర్చుని లేచునపుడు ప్రక్కకు దొర్లి నపుడు నొప్పిఎక్కువగా నుండుట; తుంటినుండీ మోకాలు వరకూనొప్పి; పాద ములవాపు నొప్పి, ఈ నొప్పి ఒక్కొక్కసారి మోకాలివరకూ ప్రాకుట, పాదాల మంట, కీళ్ళవాపు, నొప్పి.





**చికిత్స :** నేట్రమ్‌సల్ఫ్-30 లేక 200 పొటన్సీలో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-30 పవర్‌లో వాడాలి. ఉబ్బులందు కాలీ మూర్-30 పవర్‌లోను; నీరు పట్టినపుడు నేట్రమ్‌మూర్-30 పొటన్సీలలోను మార్చి-మార్చి వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** గుండె పొరలలో చీముచేరుట, గుండె ఎక్కువగా శ్రమించినప్పుడు లేక ఎక్కువ ప్రశాంతముగా వున్నప్పుడు దడ;తుంటి, కీళ్ళ వ్యాధి; కణుపు జెష్ట, గోరుచుట్టు చీముపట్టి బాధగాఉండుట; క్రొత్తగోళ్ళు పెరగక పోవుట; కాలిగోళ్ళు దళసరిగాఉండి పగిలిపోవుట; పాదములకు చెమట, స్రావములన్ని దుర్వాసనగా ఉండుట; చంకలోనిదుర్వాసన, చెమట; గోళ్ళు చెడిపోవుట, పెళుసుగావుండుట; తెల్లనిమచ్చలు; పాదములు; చీలమండ, కాళ్ళు సున్నితముగాఉండి బాధగాఉండుట; భుజపు కీళ్ళు, కండరములనొప్పి, ఎక్కువ దూరము నడుచుటవలన కలుగు కాళ్ళనొప్పులు వణకు; వ్రాయునపుడు చేతుల యందు నొప్పి; కాళు చేతులపై చీము కురుపులు.

**చికిత్స :** సైలీషియా-30 లేక 200 పొటన్సీలో ప్రతిరోజు 3 సార్లు వాడవలెను. దీనితో నేట్రమ్‌మూర్-30 లేక 200 పవర్‌లో వాడవలెను. నాడీ మండల వ్యాధులందైతే మెగ్నీషియాఫాస్-6× లేక కాలీఫాస్-6× లో వాడాలి. సెప్టిక్‌జ్వరములందైతే ఫెర్రమ్‌ఫాస్-30 పవర్ లో వాడాలి.

**గమనిక :** సైలీషియా-6× లోపు వాడితే చీము పుట్టించును కావున 6× ఆపై పొటన్సీలు వాడుటయే మంచిది.

## చర్మవ్యాధులు, జ్వర లక్షణములు-మందులు

(**గమనిక :-** చర్మముగురించి చెప్పే వ్యాధులు, జ్వరము గురించి చేప్పే వ్యాధులు సామాన్యముగా శరీర మంతటికీ చెందనవిగానే పరిగణించాలి. కావున ఈ క్రిందతెలిపే లక్షణములు శరీరములోని ఏ భాగములో కనిపించినా ఆయా వ్యాధి లక్షణాలకు తెలియజేసిన ఔషధాలను ఉపయోగించాలి)

**వ్యాధి లక్షణాలు :** దాహముతో నాలుక పిడచ కట్టుకుపోయి గోధుమ వర్ణముగానుండీ కలిగే జ్వరము; గాయముచేగాని లేక ఏ ఇతర కారణముల వలనగానీ చర్మము ఆకారము మార్పు చెంది గట్టిగా ఉండుట; చర్మము పగుళ్ళు, పొక్కులు కట్టు చర్మవ్యాధి లేక కురుపులు; కణుపు జ్యేష్ట, గోరుచుట్టు వ్యాధిలో గట్టిగా వాచి, చీము పట్టి బాధ కలిగించుట; దళసరి చర్మము.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-6× లేక 30 పవర్ లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో సైలీషియా-30 లేక 200 పొటెన్సీలో వాడాలి. జ్వరములో ఐతే... ఫెర్రమ్‌ఫాస్-30 పొటన్సీలో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ముఖముపై చెమటప్రాకుతున్నట్లు వణకు, క్షయజ్వరము, ముసలివారిలో చర్మము దురద, పుండ్లు, మచ్చలు కాలినమచ్చల మీద పుండ్లు ఏర్పడుట, ముడుతలుపడు చర్మము, స్నానాంతరము దురద, గజ్జి, క్షయ వ్యాధిలో కలుగు చర్మవ్యాధి, చిన్నచిన్న పొక్కులు, "క్లిటోరిస్" దురద, రాగి వర్ణముగా నుండు మచ్చలు కురుపులు.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. ఫెర్రమ్‌ఫాస్-6× తో సైలీషియా -200 తో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** చలి జ్వరము, విడువని జ్వరము, పాదముల నుండీ చలి ప్రారంభించుట, టైఫస్ జ్వరము, క్షయజ్వరము, చీము పట్టి ఏర్పడు సెప్టిక్ జ్వరము, త్వరగా మాను పట్టని పుండ్లు, నరుకుళ్ళు, కముకు దెబ్బలు, గాయములు, కాల్పులు; వేడి ద్రవము పడుటచే కలుగు పుండ్లు, బొబ్బలు; చీము పట్టుట చర్మవ్యాధులు, తలపై కలుగు గజ్జి, కురుపులు, మశూచి, కాళ్ళు చేతులపై పుండ్లు దురద పట్టి గోకిన ప్రతిచోట రక్తము స్రవించుట, వెంట్రుకల కుదుళ్ళలో పొక్కులు.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో సైలీషియా-30 పొటన్సీలో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** సమస్త జ్వరములు; జలుబు, వాపుల వలన జ్వరము వచ్చుట; చలి వణుకు, నిక్కాక (అతి ఉష్ణము), సన్ని పాతము ( టైఫాయిడ్) మొదలగు ఎట్టి వ్యాధులైనా జ్వరముతో ప్రారంభించుట; వాంతులతో కూడిన జీర్ణకొశ జ్వరము; చీము పట్టబోయే ముందు కలుగువాపులు, పుండ్లు; అధిక వ్యాయామము వలన గడ్డలు, వ్రణములు, కణుపు జెష్ట, గోరుచుట్టు (ప్రథమ దశ), ఆటలమ్మ, పొంగు, మశూచి, రక్తవాంతి.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్-30 లేక 200 పవర్ లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలిమూర్-30 లేక 200 పవర్ (జ్వరములందు) లో వాడాలి. సెప్టిక్ జ్వరములలో సైలీషియా-30 లేక 200 పవర్ లోను; వడదెబ్బ, రక్తస్రావములలో నేట్రమ్‌మూర్-30 పవర్‌లోను; గోరుచుట్టు, కణుపుజెష్టయందు కాల్కేరియాఫోర్స్-30 పవర్ లోను వాడాలి. (జ్వరోద్రేకములో గంట గంటకీ 3 మాత్రలు చొప్పున వాడాలి.)



**వ్యాధి లక్షణాలు :** ప్రసవానంతర జ్వరము, జీర్ణకోశ అజీర్తి; వాపులతో, కీళ్ళవాతనొప్పులతో కూడిన జ్వరము; మలబద్ధకముతో టైఫాయిడ్, టైఫస్, చలిజ్వరము; జలుబు, దగ్గులతో కూడిన జ్వరము; నిప్పు సెగవద్దకూర్చుండ వలసిన చలిజ్వరము; (కప్పుకొనుట వలన ఉపశమనము) ; చీము, రక్తముతో కూడిన వాపులు (ఉబ్బులు); తెల్లనిరసికతో కూడినకురుపులు; టీకాలు రసి కారుట; గజ్జి, పిండివంటి పొలుసులూడు చర్మవ్యాధులు; తలపై, ముఖముపై వచ్చు చర్మవ్యాధులు, గజ్జితో చర్మము చేపపొట్టువలె ఊడుట; కాల్పులు, ఋతు దోషములచే కలుగు చర్మవ్యాధులు; పొంగు, ఆటలమ్మ, మశూచి; పులిపిర్లు, గోళ్ళవ్యాధులు.

**చికిత్స :** కాలీమూర్-6× లేక 12× లో వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× లో వాడాలి(వ్యాధి ఉద్రేకములో గంట గంటకూ వాడాలి).

**వ్యాధి లక్షణాలు :** ధాతువులు క్రుళ్ళునట్టి దుర్వాసనగల స్రావము (చీము-చెమట)లతో కూడిన చర్మవ్యాధులు మరియు జ్వరములు; మెదడుకు సంబంధించిన జ్వరములు, వ్యాధులు; మగత సంధి లక్షణములు (మగతతో పిచ్చిమాటలు మాట్లాడుట,కలవరించుట); ప్రేగులకు సంబంధించిన (టై ఫస్) జ్వరము; నిస్త్రాణ; చర్మమునకు సహనశక్తి ఉండకపోవుట, దురద, దుర్వాసనతో కూడిన కురుపులు.

**చికిత్స :** కాలీఫస్-6× లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో సైలీషియా-30, కాల్కేరియాసల్ఫ్-30 లు వాడాలి జ్వరతీవ్రతలో ఫెర్రమ్ ఫాస్-30లో వాడాలి. (వ్యాధి తీవ్రతలో 3 గంటలకు ఒకడోస్ చొప్పునవాడాలి).

**వ్యాధి లక్షణాలు :** సాయంత్రం నుండీ అర్ధరాత్రి వరకు వచ్చు జ్వరములు; విషజ్వరములు; చీముతో కూడిన జ్వరము; దీనిస్రావములు పసుపు, ఆకుపచ్చ కలిసినట్లుగా ఉండుట; పొలుసులూడు చర్మవ్యాధులు, దురద, దద్దుర్లు తామర.

**చికిత్స :** కాలీసల్ఫ్-6× లేక 12 లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి. పొంగు ఆటలమ్మ, మశూచి సరిగా బయటకురాని ఎడల ఈ ఔషదము పూర్తిగా బయటకురప్పించి, నివారించును. జ్వరములలో ఫెర్రమ్‌ఫాస్-6×, కాలీమూర్-6× లలో వాడాలి.

**వ్యాధి లక్షణాలు:** విస్తారమైన చెమటతో, శరీరమంతా నొప్పులతో కూడిన జ్వరములు; చలిజ్వరము, వణకుతోకూడిన చలివీపునందు పైకిక్రిందకు పరుగిడునట్లుగా ఉండుట; ఇది రాత్రి 7 గంటలకు వచ్చుట లేక రాత్రి 9

గంటలకు వచ్చుట; మంగలి కత్తిచే కలుగు వ్యాధులు; తేనెటీగలు కుట్టుచున్నట్లు ఉండు చర్మవ్యాధులు.

**చికిత్స:** మెగ్నీషియాఫాస్-6× లేక 12× లో ప్రతి 3 గంటలకూ ఒక డోస్ చొప్పున వాడాలి. దీనితో నేట్రమ్‌సల్ఫ్-6× లో వాడాలి. ఆనెల యందు కాల్కేరియాఫ్లోర్-6×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు:** చలిజ్వరముతో విపరీతమైనదాహము, నిద్రమత్తుగా ఉండు జ్వరములు, నీటివంటి వాంతులు; కన్నులనుండీ ముక్కునుండీ నీటి వంటి స్రావము; మగత; ఉదయము నుండీ మధ్యాహ్నమువరకూ ఉండే జ్వరము (10 గంటలవరకూ ఉండును); తలనొప్పి, నడుమనొప్పి, జ్వరముతోపెదవులపై బొబ్బలులేచుట; అమితనీరసము; నీటివంటిబొబ్బలతో, మంటతోకూడిన రక రకాల చర్మవ్యాధులు; తామర, రాపిడిచే చర్మముఎర్రపడుట. అరచేతులయందు కలుగు పులిపిర్లు; సిఫిలిస్, సైకోసిస్ తత్వవ్యాధులు; చంద్రు, క్రిమి కీటకములు కరుచుటవలన కలిగినవ్యాధులు; దురద, ఉప్పును ఎక్కువగాతినుటచే చెడు ఫలితములు;దద్దుర్లు; గడ్డము కనుబొమ్మలు, చెవివెనుక, కేశముల అంచుల యందు,మెడవెనుక,కీళ్ళమడతలతో కలుగు కురుపులు, చర్మవ్యాధులు; కాల్పులు, గోళ్ళుపగులుట, వడదెబ్బ, వేసవిలో కలుగుతాపము,జ్వరము.

**చికిత్స:** నేట్రమ్‌మూర్-6×లేక 12× లో ప్రతిరోజు 3సార్లు వాడాలి (క్వినైన్ ఎక్కువగా వాడినపుడు కలిగే దుర్లక్షణాలకు విరుగుడుగా పనిచేసి చలి జ్వరమును తగ్గించును). దీనితో సైలీషియా 30పవర్‌లో వాడాలి. జ్వరములందు ప్రథమముగా... ఫెర్రమ్‌ఫాస్-6× లో వాడి, తరువాత నేట్రమ్‌మూర్‌తో వాడాలి. అన్నిరకముల చర్మవ్యాధులలోను దీనిని వాడవచ్చును.

**వ్యాధి లక్షణాలు:** మలేరియాజ్వరము; పుల్లని వాంతులు పుల్లనివాసన గలస్రావముతో కూడిన వ్యాధులు; జ్వరము; కాళ్ళుపగిలి పగలు చల్లగాఉండి, రాత్రులు మంటగా ఉండుట; ఒరియుట (రాపిడి) తేనెరంగుగా ఉండురసిక, చర్మము పచ్చగాఅగుట (పసికర్లు, కామెర్లు); తలపై చర్మవ్యాధి, కురుపులు; శరీరమంతటాదురద;ఒక్కొక్కసారి శరీరముపై ఏ పొక్కులూ కురుపులూ లేకుం డానే దురద; జలుబుజ్వరము; శీతాకాలము వర్షాకాలములందు కలుగు జ్వర ములు.

**చికిత్స:** నేట్రమ్‌ఫాస్-6× లేక 12×లో ప్రతి రోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లో వాడాలి. జ్వరములో ఫెర్రమ్‌ఫాస్-6× లో గంట గంటకీ 3 మాత్రలు చొప్పున వాడాలి.





**వ్యాధి లక్షణాలు:** అన్నిరకములమలేరియా జ్వరములు; విడిచి విడిచి వచ్చుజ్వరములు; పైత్యపువాంతి; పసుపుగా, గోధుమరంగుగా, నల్లగా వాంతు లగుట; కామెర్లు (పసికర్లు, ఉబ్బుకామెర్లు); శిరస్సు వేడిగాఉండుట; విరేచన ములు, కాలేయవ్యాధులతో నుండు జ్వరములు, శరీరముఅంతటానీరు, శరీరము అంతటాపులిపిర్లు; బొబ్బలుచితికి పచ్చని పొక్కుకట్టుట; దుస్తులు విడిచిన వెంటనే దురద, నీలిచారలుగల చర్మవ్యాధి.

**చికిత్స:** నేట్రమ్‌సల్ఫ-6×లేక 12×లోవాడాలి. దీనితో కాలీమూర్-6× నేట్రమ్‌ఫాస్-6×లు ప్రతిరోజు3సార్లు వాడాలి. నీరు పట్టు వ్యాధులలో నేట్రమ్ మూర్-6×లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు:** చీముపట్టి దానివలన కలుగుజ్వరములు (సెప్టిక్ జ్వరము); క్షయజ్వరము, రాత్రులందు చెమట, ఆకలిలేకపోవుట; తల పాదముల యందు చెమట; రాచకురుపులు, వ్రణములు, గోరుచుట్టు, కణపు జ్యేష్ట, సెగ్గడ్డలు, గజ్జి; పుండ్లుయందు కండపెరిగి పుండు మానకపోవుట; కుళ్ళునటువంటి పుండ్లు, లోతుపుండ్లు, రంధ్రముగలపుండ్లు గాయములు; చర్మముమీదిపుండ్లు మానకపోవుట; చీముత్వరగాపట్టుట (చీకడుశరీరము), టీకాలదోషములు, కుష్ఠ వ్యాధి, శ్వేతకుష్ఠు(బొల్లి). రాగివర్ణపుమచ్చలు; ముళ్ళుగాజుముక్కలు, తుపాకి గుండ్లు మొదలగు అన్యపదార్థములు శరీరములో దిగబడినచోవాటిని శస్త్ర చికిత్సలేకుండానే బయటకు రప్పించుటకు.

**చికిత్స:** సైలిషియా-30 లేక 200 పవర్‌లో ప్రతిరోజు3సార్లు వాడాలి. దీనితో కాల్కేరియా సల్ఫ్-30 లేక 200 పవర్‌లో వాడాలి. జ్వరములయందు ఫెర్రమ్‌ఫాస్-30 పవర్‌లోను, జీర్ణకోశలక్షణములయందు కాలీమూర్-30 పవర్ లోను వాడాలి. అన్య పదార్థములు శరీరములో ప్రవేశించిన... వాటిని బయటకు తెచ్చుటకు సైలీషియా-6×లో ప్రతి3గంటలకూ ఒకడోస్ చొప్పున కొన్ని రోజులు వాడితే ఆ భాగము చీముపట్టి దానినుండీ అన్యపదార్థాలు బయటకు వచ్చును. తరువాత పుండు మానుటకు సైలీషియా-200 పవర్‌లో వాడవలెను. చిక్కిన శరీరము శక్తియుతముగా అగుటకు నేట్రమ్‌మూర్ 6×లో వాడవలెను.

## నిద్ర, కలలు-మందులు

**వ్యాధి లక్షణాలు :** నిద్రలో గుండెభారముగా ఉండి, పిడకలలు వచ్చుట; వాటి వలన సక్రమముగా నిద్రపట్టక పోవుట.

**చికిత్స :** కాలీసల్ఫ్-30 పవర్‌లో ప్రతిరోజు 2 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** తల వెనుక భాగములోని బాధలతో నిద్రలేమి, శక్తి లేక పోవుటచే కలుగు నిద్రలేమి; మెదడు అలియుట వలన కలుగు నిద్రలేమి; అవగాహన లేని కలలు వచ్చుట

**చికిత్స :** మెగ్నీషియాఫాస్-30 పవర్‌లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** అమిత నిద్ర, నిద్రలేవగానే అలసినట్లు ఉండుట; నిద్రలో ఉలికిపాటు; దొంగలు పడినట్లు కలలు, సంతోషము లేక దుఃఖము వలన నిద్రపట్టక పోవుట.

**చికిత్స :** నేట్రమ్‌మూర్-30 పవర్‌లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** సెక్స్ సంబంధమైన కలలు, ప్రేగులలోని క్రిముల వలన నిద్రపట్టకనపోవుట; కూర్చుండి నిద్రించుట.

**చికిత్స :** ఉదరము వాయుపూరితము అగుటచే నిద్రలేమి; నిద్రమత్తు; చదువునపుడు, వ్రాయునపుడు-నిద్ర-మగత; పైత్యము వలన ఆందోళన కలిగించు కలలు.

**చికిత్స :** నేట్రమ్‌మూర్ 30 పవర్‌లో ప్రతిరోజు 3సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నేట్రమ్‌సల్ఫ్-30 పవర్‌లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** నిద్రలో మాట్లాడుట, గుండెదడ వలన నిద్ర పట్టక పోవుట; కీడుతలపులతో అవే కలలు వచ్చుట.

**చికిత్స :** సైలీషియా-30 పవర్ లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** ఆపదలు రాబోవునట్లుగాగాని, నూతన దృశ్యములతో గానీ కలలు వచ్చుట.

**చికిత్స :** కాల్కేరియాఫ్లోర్-30 పవర్‌లో ప్రతిరోజు రాత్రి పరుండనపుడు మాత్రమే 3 మాత్రలు వాడాలి.





**వ్యాధి లక్షణాలు :** ఆవులింతలు, నిద్రమత్తు; విచారముతో, ఆలోచనలతో అసంతృప్తి గలనిద్ర; నిద్రలోఏడ్చుట, శరీరము బద్దకముగాఉండుట, ఉదయము నిద్రనుండి లేవకపోవుట.

**చికిత్స :** కాల్కేరియాఫాస్-6×లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. తగ్గని పక్షమున 30 పవర్ లో వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** పగలు నిద్రమత్తు, రాత్రులు నిద్రపట్టకపోవుట భయము వలన కలలు, ఆలోచనలతో నిద్రాభంగము కలుగుట.

**చికిత్స :** కాల్కేరియాసల్ఫ్-30 పవర్‌లోప్రతిరోజు 3 సార్లు సారికి 3 మాత్రు చొప్పున వాడాలి.

**వ్యాధి లక్షణాలు :** తక్కువ లేక ఎక్కువ రక్తపోటు వలన నిద్రలేమి, ఆందోళలదో కూడిన కలలు.

**చికిత్స :** ఫెర్రమ్‌ఫాస్- 30 పొటెన్సీలో ప్రతిరోజూ రోజుకి రెండుసార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడాలి. (ఇది తక్కువ పొటెన్సీ (2×లేక 3×)లో వాడిన నిద్రపట్టదు.

**వ్యాధిలక్షణాలు :** కలతనిద్ర, స్వల్ప శబ్దమునకు కూడా నిద్రనుండి ఉలిక్కి పడి లేచుట.

**చికిత్స :** కాలీమూర్ 6×లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్ 30 పవర్‌లో వాడాలి.

వ్యాధి లక్షణాలు : మానసిక బాధలచేత, ఉద్రేకములచేతనిద్ర లేమి; నిద్రలోనడచుట లేక పనులుచేయుట; ఆవులింతలు, దొంగలు, దయ్యము మొదలగు ఆందోళన కలిగించుకలలు; నిద్రలో కేకలు వేయుచూలేచుట, నిద్రలో ఉలిక్కిపడుట; ప్రేమసంబంధమైన కలలు; నాడీమండల బలహీనత వలన కలుగు నిద్రలేమి.

చికిత్స : కాలీఫాస్ 6×లో ప్రతిరోజు వాడాలి. తరువాత 30 పవర్‌లో వాడాలి. దీనిని రోజుకి రెండుసార్లు సారికి3మాత్రలు చొప్పున వాడిన చాలును.

## ద్వాదశ లవణాలు - వైద్య నిపుణత

ఈ ద్వాదశ లవణ వైద్య విధానములో అతి ముఖ్యముగా గమనించ వలసిన నాలుగు అంశాలు.

1. రోగి అనుభవించు వివిధ అసహజ లక్షణాలు (బాధల)ద్వారా వ్యాధిని నిర్ణయించాలి.

2. రోగి అనుభవించు బాధ ఏస్థానము (రోగగ్రస్తమైన భాగము, అవయవములు, ధాతువులు)నకు చెందినదో గ్రహించాలి.

3. ఆ బాధాకరమైన లక్షణములు స్వభావము(లక్షణములు ఎప్పుడు ఉద్రేకించును? ఎప్పుడు ఏవిధముగా ఉపశమనము చెందును?) లను గ్రహించి, వాటికి సరిపోయిన ఔషధమును తెలుసుకోవాలి.

4. వ్యాధి లక్షణాలతో రోగియొక్క శక్తి ఏమోతాదులో క్రుంగినదో గ్రహించి, ఆ మేరకు ఔషధాన్ని శక్తియుతముచేసి (అంటే పొటెన్సీ) దానిని వ్యాధిగ్రస్తుని శరీరములోనికి ప్రవేశపెట్టాలి.

పై 4 విధములైన ప్రధాన స్థితులను : ఈ పుస్తకములో నా అనుభవమును క్రోడీకరించి తెలిపితిని. మీఅనుభవములో ఇంకా పెద్దపెద్ద పొటెన్సీలను వాడి చూడవచ్చును. కాని హెచ్చుపొటెన్సీలు రెండుప్రక్కల పదునుగల కత్తివంటివి అని డా.కెంట్ హెచ్చరించియున్నారు. రోగ లక్షణములు తెలుసుకున్న తరువాత ఔషధమునుఎన్నుకొనుటలో వ్యాధి నివారణచేయుటలో రోగి ఉద్రేక, ఉపశమన ములుKey వలె వైద్యునికి ఎంతగానో ఉపయోగపడగలవు. అని డా॥ బోనింగ్ హాజెన్ తెలిపిరి. అందులో కాలము (ఋతువు)కు ప్రధానస్థానము ఇచ్చిరి. కాబట్టి మందులు ఎన్నుకొనుటలో తేలికగా వుండుటకు ఉద్రేక ఉపశమనము పట్టికలోతెలియజేయడముజరిగినది. ఏ వ్యాధులైనా ఈ ఉద్రేక-ఉపశమనములు సారూప్యముగా ఉన్నట్లైతేనిర్భయముగా ఆ మందులు వాడవచ్చును. ఈ పుస్తక మంతా ఒకటికి రెండుసార్లు శ్రద్ధగా చదివి స్థానము, లక్షణములు, ఉద్రేక-ఉపశ మనములు సరిపోల్చుకొని ఔషధాలను ఉపయోగించిన మంచి ఫలితాలు పొంద గలరు. అంతేగాక ఏ విధమైన తీవ్రవ్యాధియైనా ఉద్రేకగమనముతగ్గి, అనుభవ వైద్యుని దగ్గరకు వెళ్ళువరకు రోగిని కాపాడగలము. ఈపుస్తక ముఖ్యోద్దేశము కూడా అదియే! ప్రధానముగా సామాన్య వ్యాధులను అతి తేలికగా ఈ ద్వాదశ లవణ వైద్య సిద్ధాంతాలద్వారా నివారణ చేసుకొనవచ్చును.

**గమనిక : ప్రక్క పేజీలోని ఉద్రేక, ఉపశమన పట్టికను కడు జాగ్రత్తగా అధ్యయనము గావించిన ఈ వైద్య విధానములోని సౌలభ్యము అర్థము కాగలదు.**





## ద్వాదశ లవణౌషధాల ఉద్రేక, ఉపశమన పట్టిక

| మందులు | ఉద్రేకము | ఉపశమనము | కాలములు- ఋతువులు ఉద్రేక - ఉపశమనాలు |
|---|---|---|---|
| కాల్కేరియాఫ్లోర్ | తేమ వాతావరణము విశ్రాంతి | శీతలోపచారము, మర్దన వేడిమి | శీతాకాలము-ఉద్రేకము, వర్షాకాలము-ఉపశమనము |
| కాల్కేరియాఫాస్ | చల్లదనము, కదలిక,వాతావరణ మార్పులు, తడియుట, చల్లదన ము, అసలు సహించలేరు | పరుండుట, విశ్రాంతి | వాతావరణ మార్పులు సంభ వించునపుడు ఉద్రేకము |
| కాల్కేరియాసల్ఫ్ | నీటిలో నానుట, నీటిలో తడి యుట, నడచుట, వేడిపదార్థ ములు,వెచ్చనివాతావరణము | --------- | --------- |
| ఫెర్రమ్‌ఫాస్ | కదలుట, మానసిక ఆందోళన, వెచ్చదనము | చల్లదనము, మెల్లగా కదలుట | వేసవికాలము మార్చ్, ఏప్రిల్,వే మధ్యాహ్నము 1గం.కు ఉద్రేకము, డిసెం బర్, జనవరి, ఫిబ్ర వరి నెలలలో ఉపశ మనము |
| కాలీమూర్ | పిండివంటలు, క్రొవ్వు పదార్థ ములు, కదలిక, కప్పుకొని పరుం డుట | --------- | డిసెంబర్,జనవరి, ఫిబ్రవరి, ఉద్రేకము; జూన్, జూలై, ఆగస్ట్ ఉపశమనము. |

| మందులు | ఉద్రేకము | ఉపశమనము | కాలములు- ఋతువులు ఉద్రేక - ఉపశమనాలు |
|---|---|---|---|
| కాలీఫాస్ | చల్లగాలి,మానసిక-శారీరిక పరిశ్రమ, శబ్ధము, కూర్చునిలేచుట,అలయుట | విశ్రాంతి, పోషకపదార్థములు, వేడిమి, మెల్లగా కదలుట, భుజించుట, కాలక్షేపము | తెల్లవారుజాము 2 గం.మొదలు 5 గంటల వరకు ఉద్రేకము |
| కాలీసల్ఫ్ | సాయంకాలము, వేడిగది | చల్లగాలి, ఆరుబయట గాలి | సాయంకాలమునుండి నడిరేయి వరకు ఉద్రేకము |
| మెగ్నీషియాఫాస్ | కుడివైపు, చల్లదనము,చల్లనిగాలి వీచెడి గాలి,చన్నీళ్ళస్నానము, స్పర్శ | వెచ్చదనము,రాపిడి,మర్దన, ముందుకు వంగుట,ఆరుబయటగాలి, వేడిపానీయము | ఉ.9గం.నుండి రాత్రి 7గం.లకు సాయంకాలముఉద్రేకము;సెప్టెంబరు,అక్టోబర్,నవంబర్ |
| నేట్రమ్ మూర్ | ఉదయము కాలనియమముగా సముద్ర ప్రాంతము, చల్లని వాతా వరణము, చదువుట | గట్టిగా ఉండు పడకపై పరుండుట | ఉ.నుండి మిట్టమధ్యాహ్నము వరకు 10గం.లకు; ఏప్రిల్,మే,జూన్,జూలై |
| నేట్రమ్ ఫాస్ | ఉరుకుమలతో కూడినగాలి వాన, బహిస్టు,మధ్యాహ్నము, సాయంత్రము | ----------- | జూన్, జూలై, ఆగస్ట్ |
| నేట్రమ్ సల్ఫ్ | తేమ ప్రదేశము,తేమ వాతావర ణము,నీరు (క్రొత్తనీరు,తలస్నానము)నీటియందుపెరుగు మొక్కలు చేపలు మొ॥వి ఎడమవైపు | పొడి వాతావరణము ఆరుబయట కదలుట | సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ |
| సైలీషియా లేక సిలికా | రాత్రి, అమావాస్య, పౌర్ణమి, ఆరు బయట చల్లగాలి. గాలివానలు, ఉదయము | వేడిమి, వెచ్చనిగది, వేసవి కాలము, తలకుగుడ్డ చుట్టుకొనుట, వేడి ఉపచారము | శీతాకాలము-ఉద్రేకము, వేసవి కాలము, ఉపశమనము |



88

## సామాన్య వ్యాధులు-ప్రథమ చికిత్స

**ఆటలమ్మ :** జ్వరము తగ్గువరకు ఫెర్రమ్‌ఫాస్-30,కాలీమూర్30లు గంటకు 3 మాత్రలు చొప్పున వాడాలి.జ్వరము తగ్గిన తరువాత ప్రతిరోజూ రోజుకి 3 పూటలా పూర్తిగా బాధలు తగ్గేవరకు వాడాలి.

**పొంగు :** పై విధముగానే వాడాలి.కాని వ్యాధి సరిగా బయటకు రాని పక్షమున కాలీసల్ఫ్-30 పవర్‌లో ప్రతిరోజూ రోజుకి 3 పూటలా వ్యాధి బయటపడు వరకు వాడాలి.

**ఈడ్పులు :** (Spasmos) పొర్లు (Convulsions), ఫిట్స్, చిన్న బిడ్డనొప్పి (బాలపాప చిన్నె) మొదలగు వాటికి రోగినివిశ్రాంతిగా ఉంచి, గాలి-వెలుతురు ఉడునట్లు చేసి, ముఖముపై చల్లని నీరు చల్లుతూ విసన కఱ్ఱతో విసరుతుండాలి. మెగ్నీషియాఫాస్-30 కాలీఫాస్-30లు ప్రతి 5 నిమిషములకు 1డోస్ చొప్పున తెరలు తగ్గువరకు వాడవలెను.

**ఋతుశూల :** మెగ్నీషియాఫాస్ 30లు, కాలీఫాస్-30, ప్రతి 5 ని.లకు 1డోస్ చొప్పున వేడినీటితో వాడిన ఋతుశూల తగ్గును.వీటికి తగ్గకపోతే ఫెర్రమ్ ఫాస్-30, కాల్కేరియాఫాస్-30లు వాడవలెను.

**ఎక్కిళ్ళు :** మెగ్నీషియాఫాస్-30, నేట్రమ్‌మూర్-30లు ప్రతి 15 నిమిషములకు ఒకడోస్ చొప్పున ఎక్కిళ్లు తగ్గేవరకు వాడవలెను.

**ఎముకలు విరుగుట, చిట్లుట మొదలగు వాటికి :** విరిగిన ఎముకను సరిచేసి కట్టు కట్టవలెను. తదుపరి త్వరగా అతుకుటకు వాపు, నొప్పి లేకుండా ఉండుటకు, జ్వరమునకు కాల్కేరియాఫాస్ 6×లో, కాల్కేరియాఫ్లోర్ 6×లో ప్రతిరోజు రోజుకి 3సార్లు చొప్పున కొన్నిరోజులు వాడాలి. వాపువుంటే... ఫెర్రమ్‌ఫాస్ 6×లో కాలీమూర్ 6×లో ప్రతిరోజు 3సార్లు వాడవలెను. చీముపట్టిన సైలీషియా 200, కాల్కేరియాసల్ఫ్-200 వాడవలెను.

**కలరా లేక వాంతులు,విరేచనములు :** ముందుగా రోగిని పరి శుభ్రముగా ఉంచి; వేడినీటిలో చిటికెడు పటికబెల్లము, కొద్దిగా ఉప్పుకలిపి; ఆ నీటిని ప్రతి 5 ని.లకు ఒకసారి త్రాగిస్తూ ఈ క్రింది మందులు వాడాలి.

**చికిత్స:** ఫెర్రమ్‌ఫాస్ 6×, కాలీమూర్ 6×, కాలీఫాస్6× లలో (పౌడర్ లేకటాబ్లెట్స్ లేక పిల్స్) ఒక గ్లాసునీటిలోకలిపి ప్రతి 5 ని.లకు ఒకసారి సారికి ఒక ఔన్స్ చొప్పున ఆ నీటిని త్రాగించాలి.

**కాల్పులు :** ఏ విధమైన కాల్పులకైనా ముందుగా కాలినభాగమందు నేట్రమ్‌మూర్ 6×, కాలీమూర్ 6× పౌడర్‌నుకొబ్బరినూనెలో కలిపి రాయాలి. తదుపరి వాటిని రోజుకి 3సార్లు చొప్పున ప్రతీరోజూ వాడాలి. గాయము చీము పడితే కాల్కేరియాసల్ఫ్ 200, సైలీసియా 200 పవర్‌లో ప్రతిరోజు రోజుకి 3సార్లు చొప్పున వాడాలి.

**క్రిమి,కీటకములు,కుట్టుట,కరచుట:** తేలు, మండ్రగబ్బ, నల్లులు, దోమలు మొదలగునవి కుట్టినపుడునేట్రమ్‌మూర్ 6× పై పూతగా రాస్తూ 30 పరవర్‌లో ప్రతి 10 నిమిషలముల కొకసారి బాధతగ్గేవరకు కడుపులోని తీసికోవాలి.

**గాయములు, నరుకులు, దెబ్బలు మొదలగు వాటికి :** ఫెర్రమ్ ఫాస్ 6×కాలీమూర్ 6= పౌడర్స్‌పై పూతకు వాడి; కడుపులోకి ఫెర్రమ్‌ఫాస్ 6×, కాలీమూర్ 6×లలో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొప్పున వాడాలి. జ్వర తీవ్రత కలిగిన గంట గంటకు 1డోస్ చొప్పున వాడాలి. గాయము చీము పట్టిన సైలీషియా 200 పవర్‌లో ప్రతి రోజు రోజుకి 3సార్లు చొప్పున వాడాలి. దీని తరువాత నేట్రమ్‌సల్ఫ్ 6×, కాల్కేరియాసల్ఫ్ 6×లలోప్రతిరోజూ రోజుకి 3డోస్‌లు గాయము తగ్గేవరకు వాడాలి.

**జలుబు-జ్వరములకు:** ఫెర్రమ్‌ఫాస్ 6×, నేట్రమ్‌సల్ఫ్ 6×లలో ప్రతి 3 గంటలకు ఒకడోస్‌చొప్పునవాడాలి. దగ్గుకూడాఉంటే కాలీమూర్6×లో వాడాలి.

**టాన్సిల్స్ వాపుకి :** ఫెర్రమ్‌ఫాస్ 6×, కాలీమూర్ 6×, కాల్కేరియాఫ్లోర్ 6×లలో రోజుకి 3సార్లు చొప్పున ప్రతిరోజూ వాపు తగ్గేవరకు వాడాలి.

**తలనొప్పి:** ఫెర్రమ్‌ఫాస్ 6×, కాలీఫా 6×, మెగ్నీషియాఫాస్ 6× పౌడర్స్ తీసుకుని అన్నీ సమానముగా కలిపి ఈ మిశ్రమాన్ని 3 గ్రైన్‌లు 1డోస్‌గా గంటగంటకి 1 డోస్ చొప్పున నొప్పితగ్గేవరకు తీసికోవాలి.

**పక్షవాతము :** కాలీఫాస్ 30, మెగ్నీషియాఫాస్ 30, నేట్రమ్‌మూర్ 30పొటెన్సీలలో ఒకదాని తరువాత ఒకటి మార్చిమార్చి ప్రతి3గంటలకు ఒక డోస్ చొప్పున వాడాలి.

**రక్తస్రావములు:** ఫెర్రమ్ ఫాస్ 6×, కాల్కేరియాఫ్లోర్ 6× నేట్రమ్‌మూర్ 6×లు పౌడర్స్‌లేక టాబ్లెట్స్ రూపములో ప్రతి 15 నిములకు ఒకడోస్ చొప్పున రక్తస్రావము తగ్గేవరకు తీసికోవాలి.





**వడదెబ్బ:** వేసవిలో ఎండ తీక్షణత వలన కలిగే నీరసము, అతిదాహము, శరీరముపొడి ఆఱిపోవుటనే వడదెబ్బ అంటారు. రోగికిముందు శీతలోప చార ములు చేయవలెను. చల్లనిగాలి వచ్చునట్లుచేసి, చల్లనినీరు త్రాగిస్తూ చల్లని నీటిలో గుడ్డముంచి శరీరమంతా ఆగుడ్డతో తడుస్తూ ఈక్రింది మందులు వాడవలెను.

**చికిత్స:** నేట్రమ్‌మూర్ 30 పవర్‌లో ప్రతి గంటకి 3 మాత్రలుచొప్పున వాడాలి. వేసవిలో ముందుగానే ప్రతిరోజూ రోజుకి3 మాత్రలు చొప్పున పిల్లలు; 5 మాత్రలచొప్పున పెద్దలువాడుతూ వుంటే ఎండదెబ్బ తగలదు.

**గర్భవతులు, సుఖ ప్రసవమునకు, ప్రసవానంతరము తీసుకోవలసిన ఔషధములు:** నెల తప్పిన దగ్గరనుండి గర్భస్రావముకాకుండా ఇంకా ఏ ఇతర బాధలు లేకుండా వుండుటకుఈక్రింది మందుల వాడవలెను.

**చికిత్స:** ఫెర్రమ్‌ఫాస్ 6×లో ప్రతిరోజు రోజుకి 3సార్లు చొప్పున వాడాలి. నేట్రమ్‌మూర్ 6×లో ప్రతిరోజూ 3సార్లు వాడాలి. కాల్కేరియాఫ్లోర్ 6×లో ప్రతిరోజు 3సార్లువాడాలి. పైమందులు 6 నెలలవరకువాడి తదుపరి ఆపవలెను. ప్రసవించు వరకు ఈక్రింది మందులు వాడవలెను. బైకో సం.-26 టాబ్లెట్స్ ప్రతిరోజు రోజుకి 3సార్లు చొప్పున వాడాలి. నేట్రమ్‌మూర్ 6×లో ప్రతిరోజు 3సార్లు చొప్పున వాడాలి.ప్రసవనొప్పులు ప్రారంభించగానే వాటిని ఆపవలెను. నొప్పులు తగ్గువరకు లేక ప్రసవించు వరకు మెగ్నీషియాఫాస్ 6×, కాలీఫాస్ 6×, కాల్కేరియాఫ్లోర్ 6×లలో ప్రతి 15 నిమిషములకు ఒక మోతాదు చొప్పున వాడవలెను.

**ప్రసవించిన తరువాత :** అవయవములన్నీ యథావిధిగా సంకోచము చెందుటకు, పాలజ్వరము మొదలగునవి రాకుండా వుండుటకుఫెర్రమ్‌ఫాస్ 6×,కాల్కేరియాఫ్లోర్ 6×లలో ప్రతి గంటకు 1డోస్ చొప్పున వాడవలెను. (దీని వలన రక్తస్రావములున్నా తగ్గి పోవును). ప్రసవించిన తరువాత 2 నెలలు ఫైవ్‌ఫాస్-6× లలో వాడాలి. (ప్రసవ కాలమందు మఱియు ప్రతినెల అనుభవముగల వైద్యుని పర్యవేక్షణలో చికిత్సలు జరుపుట ఉత్తమము).

**కరెంట్‌షాక్ శరీరము నలుగుట : కరెంట్‌షాక్ వలన కలిగిన అదురును, శరీరము నలుగుట మొదలగు వాటికి చికిత్స :**

మెగ్నీషియాఫాస్-6×, కాలీఫాస్ 6×, నేట్రమ్‌సల్ఫ్-6×లలో ప్రతిరోజు రోజుకి 3సార్లు చొప్పున బాధ తగ్గేవరకు వాడాలి.

**నడుమునొప్పి మెడనొప్పులు :** కాల్కేరియాఫ్లోర్-30, మెగ్నీషియాఫాస్-30 పవర్‌లో నొప్పులు తగ్గేవరకు రోజుకి 3 డోస్‌ల చొప్పునప్రతిరోజూ వాడాలి.

## అనుబంధ శీర్షిక

పరిచయము : ఈ అనుబంధము అను శీర్షికలో మీకు ఉపయోగపడు విశేషములున్నవి! తరతరాలనుండి మానవులను వెంటాడే వ్యాధుల మూల మెరిగి ఔషధము నుండి అణుశక్తిని గ్రహించి, ప్రయోగించి వ్యాధులరూపుమాపిన మహాయశస్వి డా. హానిమన్. ఆయన మొదట సిమిలియా సిమిలిబస్ క్యూరాంటర్ అనే సిద్ధాంతమును ఆధారము చేసుకొని "హోమియోపతి"అను వైద్యమునకు పునాది వేసెను. కాని ఆమందులు వ్యాధులకు పూర్తిగా నివారించక వేరొక రూపములో తలెత్తుటయో లేక అదే వ్యాధి మరల మరల తిరగపెట్టుటయో జరుగుచుండెను. ఈ పరిస్థితులలో డా.హానిమన్ అనేక పరిశోదనలనుఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి చేశారు. వారి 12 సంవత్సరముల తీవ్రపరిశోధనల ఫలితముగా ఆయన వ్యాధికారకములను తెలుసుకొన్నారు. అవి. 1సోరా, 2.సైకోసిస్, సిఫిలిస్ వీటికి "మియాజమ్స్" అనిపేరుపెట్టెను. సారూప్యమైన మందులు వాడినను ఎంత హెచ్చు పొటెన్సీలో వాడినను వ్యాధిపూర్తిగా నివారణ జరుగకుండా ఉండుటయో లేక నివారణకు ఆటంకము కలుగుటయో జరుగుచుండెను. అప్పుడు ఆయన "యాంటిమియాజమ్" ఔషధములు కను గొనవలసి వచ్చెను. వాటిని వాడినతరువాత వ్యాధి నివారణాటంకములు తొలగి వ్యాధి నివారణ జరుగుచుండెను. అప్పటినుండి ఆయన కొన్ని సూచనలు ఇచ్చెను. సారూప్యమైన ఔషధమును లక్షణములను బట్టి ఇచ్చినను మధ్యమధ్యలో ఈయాంటి మియాజమ్మందులు వాడవలెనని తెలిపెను. వాటిని "ఇంట్రాక్యూరెంట్ డ్రగ్స్" అనికూడా పిలిచెదరు. ఈ జీవ రసాయన సిద్ధాంతములో ఇచ్చిన 12 మందులు వాడునపుడు పైన తెలిపిన ఇంట్రాక్యూరెంట్ మందులు (లోతుగా పనిచేయు మందులు) కూడా వాడవలెను. వీటిని పోలినమందులను ఈ అనుబంధములో తెలియజేయడమైనది. వీటిని అర్థము చేసుకొని వ్యాధి నివారణ కుపయోగించిన వ్యాధులు త్వరితగతిని నివారిస్తాయి. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే మీరు హోమియో మెటీరియా మెడికాచదివి ఇంకా విజ్ఞానము పొంద వచ్చును. కొందరు వైద్యులు జీవరసాయన శాస్త్రమును హోమియోపతిలో భాగముగా ఒప్పుకొనరు. కానీ "ఫాదర్ ఆఫ్ హోమియోపతి" అని పిలువబడే డా. హెరింగ్ దీనిని అంగీకరించి హోమియోపతి సిద్ధాంతము ద్వారా రుజువు చేశారు. అట్లు రుజువు చేయుటలో సహకరించిన ముఖ్యులనుకూడా మీకు తెలుపుచున్నాను. కాబట్టి పుస్తకములో ఉదహరించిన మందులతో పాటు ఈ అనుసంధాన మందులు కూడావాడిన త్వరగా, శాశ్వతముగా వ్యాధి నివారించి ఫలితాలు కనిపించును. హోమియోపతి విధానాన్ని కనిపెట్టిన డా.శామ్యూల్ హానిమన్ జర్మనీ దేశమందు క్రీ.శ. 1755, ఏప్రిల్ 10వ తేదీన జన్మించెను.





ఆ గ్రామము పేరు ॥మీసన్". 1779లో "ఎర్లాంజన్" విశ్వవిద్యాలయములో డాక్టరేట్ పట్టాను పొందెను. 1796 సంవత్సరము ప్రప్రథమముగా హోమియోపతి పదము ఉపయోగించెను. ఈయన తన 88వఏట 1843వ సంవత్సరములో, జూలైనెల 2వ తేదీ ఆదివారము స్వర్గస్తుడయ్యెను. జీవరసాయనశాస్త్రము "హోమియోపతి"కంటే ముందే జర్మనీ దేశములో ప్రాచుర్యము పొందివున్నది. అంటే ఈరెండు వైద్య విధానాలు జర్మనీలోనేపుట్టి, పెరిగి తరువాత ప్రపంచమంతటా వ్యాపించినాయి. ఈ అనుబంధ శీర్షిక సహకారముతో వ్యాధులు త్వరగా నివారించుకోగల అవకాశాలు మెండుగా ఉన్నాయి. అందుకే ఈశీర్షికను ఇక్కడ పొందుపరచడమైనది.

### ద్వాదశ లవణౌషధములు - సంక్షిప్త నామాలు

| ఉచ్చారణ | సంక్షిప్తనామము | పూర్తినామము |
|---|---|---|
| 1.కాల్కేరియాఫ్లోరికా | C. F | Calcarea Flourica |
| 2.కాల్కేరియా ఫాస్పారికా | C. P. | Calcarea Phosphorica |
| 3.కాల్కేరియాసల్ఫ్యూరికా | C. S | Calcarea Sulphurica |
| 4. ఫెర్రమ్ ఫాస్ఫారికమ్ | F. P | Ferrum Phosphoricum |
| 5.కాలీమ్యూరియాటికమ్ | K. M | Kali Muriaticum |
| 6. కాలీఫాస్ఫారికమ్ | K. P | Kali Phosphoricum |
| 7.కాలీసల్ఫ్యూరికమ్ | K.S | Kali Sulphuricum |
| 8.మెగ్నీషియాస్ఫారికా | M.P. | Magnesia Phosphorica |
| 9. నేట్రమ్ మ్యూరియాటికమ్ | N.M | Natrum Muriaticum |
| 10.నేట్రమ్ఫాస్ఫారికమ్ | N.P | Natrum Phosphoricum |
| 11.నేట్రమ్సల్ఫ్యూరికమ్ | N. S | Natrum Sulphuricum |
| 12.సైలీషియా లేక సిలికా | Sil. | Silicea or Silica |

### 1. కాల్కేరియాఫ్లోరికా

వాడుకపేర్లు : 1.కాల్కేఫ్లోర్, 2.కాల్కేరియాఫ్లోర్, 3.సి.ఎఫ్, దీనిని "ఫ్లోరైడ్ అఫ్లైమ్ అనిపిలుస్తారు.ఇదిస్ఫటికము.ముఖ్యముగా ఎముకలయందు, పండ్లయందు, స్థితి-స్థాపక ధాతువులయందు; బాహ్యచర్మము నందు, సంధాయక ధాతువులయందును ఈ పదార్థము ఉంటుంది.

ఈ పదార్థము గుఱించి ఎలెస్చే రచింపబడిన ఎన్ సైక్లోపేడియా, "గైడింగ్ సింప్టమ్స్" అను గ్రంథములందు పూర్తిగా తెలిపారు. కాల్కేరియాఫ్లోర్ న్యూస్లర్చే తయారుచేయబడినను హోమియోపతివిధానము ప్రకారము డా.జె.బి.బెల్ రుజువు చేసెను

## కాల్కేరియా ఫ్లోర్ - వైద్య ప్రయోజనాలు

1. గట్టిగా రాయిలాగా ఉన్న కణితులు, వాపులు మొదలగు వాటికి దీనిని వాడుతూ మధ్యమధ్య కోనియమ్-30 లేక 200 పవర్‌లో వాడిన త్వరగా కఱగును. (కాల్కేరియా అయోడ్-30 పవర్‌లో కూడా వాడవచ్చును.

2. ఎముకలు, స్వరపేటిక, మానసిక వ్యాధులతో C.F తో పాటు కాల్కేరియాకార్బ్ 200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడవలెను.

3. నడుము నొప్పిలో C.F తోపాటు రుస్టాక్స్-200 పవర్‌లో కొన్నిడోస్‌లు వాడవలెను.

4. ధాతువుల వ్యాధులలో C.F తోపాటు మెర్క్‌సోల్-200 పవర్‌లో వాడవలెను.

5. చీముపట్టి గట్టిగా ఉన్న వాపులలో C.F తో హెపార్ సల్ఫ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడవలెను.

6. కీళ్ళవాతము నందు C.F తో బ్రైయోనియా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

7. రక్తస్రావములలో ఋతుస్రావము ఐన C.F తో సెబినా 200 పవర్‌లోనూ, ఏ ఇతర అవయవముల నుండైనా రక్తస్రావము జరుగు సమయాలలో ఫాస్పరస్-200 పవర్‌లో 3డోస్‌లు వాడాలి.

పై వ్యాధులకు కాల్కేరియాఫ్లోర్ వాడుచున్నప్పుడు ఆయా వ్యాధులకు సంబంధించిన పై మందులు అప్పుడప్పుడు వాడుతూ తూజా 1M లో ఒకడోస్ వాడాలి. అప్పుడు వ్యాధులు త్వరిత గతిని నివారించగలవు.

## 2. కాల్కేరియా ఫాస్ఫారికా

వాడుకపేర్లు : 1.కాల్కేఫాస్, 2.కాల్కేరియాఫాస్, 3.C.P

కాల్కేరియాఫాస్‌ను వైద్య పరిభాషలో "ఫాస్ఫేట్ ఆఫ్‌లైమ్" అని పిలుస్తారు. మన శరీరములో రక్తమునందలి ప్లాస్మామరియు రక్త కణాలలోనూ; ఎముకలు, సంధాయక ధాతువులయందు ఈ పదార్ధము నిక్షిప్తమై యుంటుంది.

ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్‌ను హోమియోపతిశాస్త్రరీత్యా రుజువు చేసినది C హెరింగ్. వీరు 1871 సంవత్సరములో అమెరికా జర్నల్ అను పత్రికలో ఈ ఔషధాన్ని గూర్చి అనేక వ్యాసములు ప్రచురించారు. డా.ఎలెన్ ఈ ఔషధాన్ని గుఱించి తనుస్వయముగా రూపొందించిన ఎన్‌సైక్లోపీడియా లో సమగ్రముగా వివరించారు.





## కాల్కేరియాఫాస్ - వైద్య ప్రయోజనాలు

1. శారీరక ఎదుగుదల సక్రమముగా లేనపుడు కాల్కేరియా ఫాస్‌ను 'టానిక్'లాగా ఉపయోగించిన అద్భుత ఫలితాలుకనిపిస్తాయి.

2. శరీరము నుండి అల్బ్యుమిన్ పదార్థాలు బయటకి పోతున్నప్పుడు కాల్కేరియాఫాస్‌ను ఉపయోగిస్తే అమోఘముగా పనిచేస్తుంది.

3. కాల్కేరియాఫాస్ ఎముకలకు అమితశక్తిని కలిగించును.

4. C.P ని రక్తక్షీణతలో ప్రయోగించిన క్రొత్త రక్త కణాలను పుట్టించును.

5. C.P ని ఉపయోగిస్తే కన్యలందు కలుగు రక్తక్షీణతను తొలగించి, ప్రథమ రసజ్వల త్వరగా అగునట్లు చేయును.

6. ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్ రక్తమునందు లోపించిన ఎడల రక్తానికిగల గడ్డకట్టే (పేరుకొనే) గుణము నశిస్తుంది. ఈ సందర్భములో C.P దివ్యౌషధముగా పనిచేస్తుంది.

7. ఎముకలు విరిగినపుడు C.P ని ఉపయోగిస్తే ఎముకలు త్వరితగతిని అతుక్కుంటాయి.

8. రికెట్స్ వ్యాధిరాకుండా ముందు జాగ్రత్త చర్యగా C.P ని ఉపయోగించ వచ్చును.

9. గర్భధారణ తరువాత C.P ని ఉపయోగిస్తూ వుంటే శిశువు అస్థిపంజరము సక్రమముగా పెరుగుటకు చక్కగా పనిచేయును.

10. ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్ పని పండ్లమీద అధికముగా వుంటుంది.

11. పిల్లలకు పండ్లు వచ్చునపుడు ఈ ఔషధాన్నిచ్చిన మంచి పుష్టికరమైన దంతాలు రావడములో సహకరిస్తుంది.

12. వ్యాధులలో ఆయా మందులతో పాటుగా C.P ని కూడా ఇచ్చినట్లైతే వ్యాధి నిరోధక కారకాలైన తెల్లకణాలను అధికముగా ఉత్పత్తిచేసి, తద్వారా వ్యాధినిరోధకశక్తిని పెంపొందించడములో సహకరిస్తుంది. అంతేగాక ఈఔషధాన్ని వ్యాధి తగ్గిన తరువాత కూడా ఉపయోగిస్తుంటే శారీరకముగా త్వరగా కోలుకుంటారు.

13. C.P తిన్న పదార్థాలను సక్రమముగా ఒంట పట్టించును.

14. సంతాన వతులైన స్త్రీలకు, స్తన్య మిచ్చుకున్న బాలింతలకు దీనిని ప్రయోగించిన వీరికి అధిక శక్తి లభించును.

15. యోనిదురద : క్షయరోగము, కపాలవ్యాధి, బ్రహ్మరంధ్రము, పూడుకుపోవడము లేక మెత్తగానుండటము అను వాటికి C.P అద్భుతముగా పనిచేయును.

16. C.P ని ఉపయోగిస్తూ కాల్కేరియాకార్బ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడితే చక్కటి ఫలితాలు కలుగుతాయి.

17. పంటి కురుపులయందు ఈ C.P వాడుతూ ఫ్లోరిక్ యాసిడ్ 200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడిన కురుపులు త్వరిత గతిని నివారిస్తాయి.

18. తలనొప్పులయందు C.P ఉపయోగిస్తూ బెల్లడోనా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడితే నొప్పులు త్వరగా తగ్గిపోతాయి.

19. మూర్ఛమఱియుఫిట్స్ వ్యాధులలో C.P తోపాటుగా సిమిసిఫ్యుగా-200,సిక్యుటావిరోసా-200 పవర్‌లో ఒకటి మార్చి మరొకటిగా కొన్ని డోస్‌లువాడాలి.

20. అతిమూత్ర వ్యాధులందు, క్రిమి సంబంధిత వ్యాధులందు ఈ C.P తోపాటు సినా-200 పవర్‌లోకొన్ని డోస్‌లు వేస్తే సత్ఫలితాలు కలుగుతాయి.

21. శారీరక నీరసములో C.P తోపాటు చైనా-30 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

22. కీళ్ళు ఎముకల వ్యాధులలో C.P తో రూటా-200 పవర్‌లో కొన్ని డోస్‌లువాడాలి.

23. మూత్రమునుండి ఫాస్ఫేట్స్, అల్బ్యూమిన్ పదార్థాలు పోతున్నపుడు C.P తో పాటుగా యాసిడ్‌పిక్రిక్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

24. కడుపునొప్పి లాంటి జీర్ణక్రియలకు సంబంధించిన వ్యాధులతో C.P తో పాటుగా ఎనాకార్డియమ్-200, చెలిడోనియమ్-30 పవర్‌లలో కొన్ని మోతాదులు వాడాలి.

25. ప్రమాదవశాత్తు ఎముకలు విరిగినపుడు త్వరగా అతుకు పడుటకు ఈC.P తో పాటుగా సింఫైటమ్-200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడాలి.

26. క్షయ వ్యాధిలో C.P తోపాటుగా ట్యుబెర్క్యులినమ్ 1మి.లీలో అప్పుడప్పుడు ఒక్కడోస్ వ్యాధి నివారించువరకు వాడుతూ వుండాలి (మధ్యమధ్య సల్ఫర్ కూడా 200 పవర్‌లో ఒక మోతాదు వేయుట మంచిది)

## 3. కాల్కేరియా సల్ఫ్యూరికా

వాడుక పేర్లు : 1.కాల్కే సల్ఫ్, 2. కాల్కేరియాసల్ఫ్, 3.C.S

కాల్కేరియాసల్ఫ్‌ను శాస్త్ర పరిభాషలో "జిప్సమ్" లేక "ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్" అని పిలుస్తారు. ఇది స్ఫటికము అనే పదార్థము. ఈ పదార్థము నీటియందు నిక్షిప్తమై వుంటుంది. స్ఫటికము నీటిలోఅధికముగా ఉన్నప్పుడు సబ్బు నురగ కూడా పెద్దగా రాదు. ఈ నీటిని మఱిగించినప్పటికీ సబ్బు నురగరాదు.





డా॥ స్క్యూస్లర్- తనుకనుగొనిన 12 మందుల పట్టికనుండి జీవితపు చివరి దశలో ఈ ఔషధాన్ని తొలగించారు. ఐతే తదుపరి కొంతమంది శాస్త్రవేత్తల పరిశోధనలలో దీని గుణములు రుజువు అగుట వలన దీనిని తిరిగి ద్వాదశలవణాలతో చేర్చడము జరిగినది.

డా॥ క్లారెన్స్‌క్లోవెంట్ అను శాస్త్రవేత్త స్ఫటికాన్ని హోమియోపతి శాస్త్ర రీత్యా రుజువు చేసెను. వీరు 1873 సంవత్సరములో ఏక్షన్స్ ఆఫ్ అమెరికా ఇనిస్టిట్యూట్ ఆఫ్ హోమియోపతి అను తన స్వీయ గ్రంథములో స్ఫటికాన్ని గుఱించి వివరించారు. డా॥ ఎలెన్‌చే రచించబడిన ఎన్‌సైక్లోపీడియా లోని గైడింగ్ సింప్టమ్స్ నందు దీనిని గూర్చి పూర్తి వివరము లివ్వబడినది.

### కాల్కేరియాసల్ఫ్ - వైద్య లక్షణాలు

1. శరీరములోని ఏ అవయవానికైనా ఏ ప్రాంతములోనైనా చీము పట్టినపుడు C.S ని ప్రయోగిస్తేచీము పట్టిన గడ్డలను తగ్గించి, సహజస్థితికి తెచ్చుటకు ఎంతగానో ఉపయోగించును.

2. కణుపు జెష్ట, గోరుచుట్టు లాంటివి చీముతో కూడివున్నప్పుడు C.S ను వినియోగిస్తూ హెపార్ సల్ఫ్‌ను-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడిన సత్ఫలితాలు కనిపిస్తాయి.

3. సెప్టిక్ జ్వరములందు, విషజ్వరములందు C.S ఉపయోగిస్తూ పైరోజన్ -200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడిన తర్వాత గతిని జ్వరనివారణ జరుగును.

4. పుండ్లకు C.S వాడుతూ సోరినమ్ 1 మి. పవర్‌లో ఒక డోస్ వాడిన పుండ్లు త్వరగా తగ్గును.

5. చీము పట్టిన పుండ్లు (సెగ్గడ్డలు మొదలగునవి) బాధగా ఉన్నప్పుడు C.S ప్రయోగిస్తూ బెల్లడోనా-30 పవర్‌లో కొన్నిడోస్‌లువాడితే బాధలు నివారించును.

## 4. ఫెర్రమ్ ఫాస్ఫారికమ్

వాడుకపేర్లు : 1. ఫెర్రమ్‌ఫాస్, 2. F.P

శాస్త్రరీత్యా ఫెర్రమ్‌ఫాస్‌ను "ఫాస్ఫేట్ ఆఫ్ ఐరన్" అని అంటారు. రక్తకణాలు ఆ ఎఱ్ఱరంగులో వుండుటకు మూలకారణమైన హిమోగ్లోబిన్ నందు ఫాస్ఫేట్ ఆఫ్ ఐరన్' వుంటుంది. శరీర మంతటా గల ధాతువులు మఱియు ప్రాణవాయువుల పనికి ఇది ఎంతగానో సహకరిస్తుంది.

ఫెర్రమ్ ఫాస్‌ను- హోమియోపతి శాస్త్రరీత్యా రుజువు చేసినది. 1876 సంవత్సరములో డా. J.C మార్గన్ అను శాస్త్రవేత్త. ఈ పదార్ధము గురించి డా. ఎలెన్ స్వీయవిరచితమైన ఎన్ సైక్లోపీడియాలో పూర్తి వివరాలు గలవు.



## ఫెర్రమ్‌ఫాస్-వైద్య విధానాలు

1. రక్తపోటు, రక్తస్రావాలు అదుపులో లేనపుడు F.P ని వినియోగించిన అద్భుత ఫలితాలు కనిపించును.

2. రక్తక్షీణతలో F.P ని "టానిక్"లాగా ఉపయోగించిన అనతికాలములోనే ఈవ్యాధి తగ్గిపోవును.

3. వాపుల ప్రారంభదశలో F.P ని అమోఘముగా పనిచేయును.

4. జ్వర దశలు మారుతున్నపుడు ఈ ఔషధ ప్రయోగము వలన అవి అదుపులో నుండగలవు (వాపు జ్వరములలో చీముజేరిన ఫెర్రమ్‌ఫాస్ పనిచేయదు)

5. వాపులతో కూడిన జ్వరములలో F.P ని వినియోగిస్తూ ఎకోనైట్ లేక బెల్లడోనా-30 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడితే మంచి ఫలితాలు కనిపిస్తాయి.

6. జలుబు, జ్వరములలో F.P తో పాటుగా రుమెక్స్‌ను 30 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

7. తల నొప్పులలో F.P తో పాటుగా జెల్సిమియమ్‌ను30 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

8. రక్తక్షీణతలో F.P వాడుతూ చైనా-30 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

9. దెబ్బలు, నరుకుళ్ళు లాంటి గాయాలకు F.P ఉపయోగిస్తూ అర్నికాను 200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడాలి.

10. వేసవి జ్వరాలకు F.P తో పాటుగా బ్రైయోనియా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

11. ఊపిరితిత్తుల వ్యాధులకు F.P తో యాంటిమ్‌టార్ట్-200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడాలి.

12. రక్తస్రావములు జరుగుచున్నపుడు F.P తో పాటుగా ఫాస్ఫరస్-200 పొటెన్సీలో కొన్ని మోతాదులు ఇవ్వాలి.

13. ఏ వ్యాధులకైనా F.P వాడునపుడు దీనితోపాటుగా మధ్యమధ్య సల్ఫర్ -200 పవర్‌లో 2.3 మోతాదులు వాడితే సత్ఫలితాలు కనిపించును.

గమనిక : ఫెర్రమ్‌ఫాస్‌ను తక్కువ పొటెన్సీలలో ఉపయోగించిన నిద్ర పట్ట నివ్వదు.



## 5. కాలి మ్యూరియాటికమ్

1. వాడుక పేర్లు : 1. కాలిమూర్, 2. K.M

కాలీమూర్‌ను కొందరు "క్లోరికమ్" అని భ్రమపడుతూ వుంటారు. కానీ శాస్త్రరీత్యా దీనిని క్లోరైడ్ ఆఫ్ పొటాషియమ్ అని రుజువు చేయడము జరిగినది. ఇది కూడా స్ఫటికమే.

రక్త-మాంసములలో "నత్రజని పదార్ధము" వుంటుంది. ఈ పదార్ధము వలన రక్తము గడ్డకట్టు శక్తిని కలగి వుంటుంది.

కాలీమూర్ డా.ఎలెన్‌చే రుజువు చేయబడెను. ఈ శాస్త్రవేత్త స్వీయ విరచితమైన గైడింగ్ సింప్టమ్స్ అను గ్రంథమునందు క్లోరైడ్‌ఆఫ్ పొటాషియమ్‌ను గురించి సవిస్తారముగా ఉన్నది.

## కాలీమూర్ - వైద్య విశేషాలు

1. కాలీమూర్ మెదడునందలి కణాల ఉత్పత్తికి ఎంతగానో తోడ్పడును.

2. పొరలు ఊరు, పొట్టురేగు,చర్మవ్యాధులనుతగ్గించుటలో K.M సహకరించును.

3. టీకాల దోషములను తగ్గించుటలో K.M అద్వితీయముగా పని చేయును.

4. గ్రంథుల వాపు తగ్గించుటలో కాలీమూర్ అద్భుతముగా పనిచేయును.

5. చిక్కగా తెల్లగా ఉండే స్రావాల (కళ్ళె, విరేచనము, పుండ్లరసి మొ॥వి) ను నివారించుటలో K.M చక్కగా పనిచేయును.

6. కాలేయాన్ని సక్రమముగా పనిచేయించుటలో K.M ఎంతగానో సహక రించును.

7. చెవిలో చీము లేక రసికారుట, చెవుడు లాంటివి నిరోధించుటలో K.M తోడ్పడును.

8. వ్యాధులకు K.M. ఉపయోగించినపుడు దీనికి తోడుగా పల్సటిల్లాను 30 పవర్‌లో కొన్ని మోతాదులు వేస్తే ఆయా వ్యాధులు త్వరితగతిని నివారించును.

9. వాపులకు K.M. తో పాటుగా తూజా-200 పొటన్సీలో కొన్ని మోతాదులు వాడితే వాపులను శీఘ్రగతిలో నివారించును.

10. చెవి వ్యాధులయందు K.M. తో పాటుగా మెర్క్ డల్సిస్ 200 పవర్ లో కొన్ని మోతాదులు వేసినా సత్ఫలితాలు కనిపించును.

11. జీర్ణాశయ వ్యాధులు మరియు నాలుక పూతలకు K.M తో పాటుగా మెర్క్ సోల్ 200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడితే వేగవంతముగా ఆయా భాధలు తగ్గిపోవును.

12. జ్వరము మరియు విరేచినాలలో K.M.ను ఉపయోగిస్తూ మధ్య మధ్య సల్ఫర్ -30 పవర్ లో కొన్ని మోతాదులు వాడిన చక్కని ఫలితాలు చూడగలము.

### 6. కాలీ ఫాస్ఫారికమ్

1. వాడుక పేర్లు : 1.కాలీఫాస్ 2. K.P

కాలీఫాస్‌ను శాస్త్రియముగా "ఫాస్ఫేట్ ఆఫ్ పొటాస్" అని యందురు. ఈ పదార్థాము నరములు, కండరాలు, రక్తకణాలు, మెదడు అను వాటియందు అధికముగా వుంటుంది. (ప్రాణవాయువు (ఆక్సిజెన్) మరియు శరీర పోషక ద్రవములయందు కూడా ఈ పదార్థములు నిక్షిప్తమై వుంటుంది. ఇంకా వేసో (రక్తనాళములు), మోటారు నరాలు, బోధనా నాడులు, సహవేదనా నాడులు (sympathetic Nerves) అను వాటియందు కూడా ఈ పదార్థాలు ఎక్కువగానూ ఉంటుందని చెప్పవచ్చును.

చికాగో పట్టణమునందు "ఫ్రూవర్స్ యూనియన్" అను సంస్థ డా॥H.C. ఎలెన్ ఆద్వర్యములో ఈ పదార్థ గుణాలను రుజువు చేసెను. ఆ తరువాత "అయోవా" విశ్వవిద్యాలయములోని "ప్రొ॥ రాయల్" అను శాస్త్ర వేత్తచే నిరూపించబడినది. 1907 సం॥ములో "ట్రాన్స్‌యాక్షన్స్" అను పత్రికలో ఫాస్ఫేట్ అఫ్ పొటాష్‌ను గురించి అనేక వ్యాసాలు పరంపరగా వెలువడినాయి.

### కాలీఫాస్ వైద్య లక్షణాలు

1. సెప్టిక్ (రక్తమునందు సూక్ష్మక్రిములు జేరుట) జ్వరములలో K.P నిరోధక ఔషధముగా అద్భుతముగా పనిచేయును.

2. జీవశక్తి క్రుంగిపోయినపుడు K.P ప్రయోగించిన జీవశక్తిని క్రమబద్ధీకరిచును. (ఏ వ్యాధుల యందైనా జీవశక్తి క్రుంగిపోయి, శరీరము చల్లబడినపుడు ఔషధాన్ని ప్రయోగించిన శరీరఉష్ణోగ్రతను పెంపోందించి, ప్రాణాలను కాపాడును.)

3. గాయాలు, దెబ్బలు మొదలగు వాటివలన శరీరములోని ఏ భాగమైనా క్రుళ్ళినపుడు (గాంగ్రిన్) K.P ని ప్రయోగించిన నివారించును.

4. K.P ని టానిక్‌లాగ ఉపయెగిస్తూవుంటే మెదడు మీద దీని ప్రభావముండి మానసిక బలహీనతలు, ఆందోళనలు, భయము, మానసికముగా





క్రుంగిపోవుట అనువాటిని తగ్గించుటయేగాక జ్ఞాపకశక్తిని, మేధస్సును పెంపొందిచును.

5. పైవిధముగా కాఫాస్‌ను తీసుకొంటూ వుంటే నీరసము, నరాల బలహీనతలనూ తగ్గించును.

6. పక్షవాతానికి సంబంధించిన మందులతో పాటుగా K.P ని కూడా వాడితే మేలు కలుగును.

7. కండరాల నొప్పులకు K.P దివ్యౌషధముగా పని చేసి, నొప్పులను రూపుమాపును.

8. అన్ని చర్మవ్యాధులకు ముందు జాగ్రత్త చర్యగా K.P ని వాడిన చర్మవ్యాధులను నిరోధించును.

9. దుర్వాసనతో కూడిన స్రావములకు K.P చక్కటి ఫలితాలనిచ్చును.

10. శారీరక పోషణ సరిగాలేని వారికి కలుగు అన్ని వ్యాధులకు ఆయా మందులతో పాటుగా K.P ని కూడా ఇచ్చిన వ్యాధులు త్వరితగతిని నివారిచుటలో సహకరించును.

11. నాడీమండల వ్యాధులకు K.P తో పాటుగా రూస్టాక్స్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడిన సత్ఫలితాలు కలుగును.

12. కీళ్లనొప్పులకు K.P వినియోగిస్తూ పల్సటిల్లా-200 పొటన్సీలో కొన్ని డోస్‌లు వాడిన మంచిది.

13. మానసిక వ్యాధులయందు K.P తో ఇగ్నీషియా-200, కాఫీ-200, హయోశ్యామస్-200, కెమోమిల్లా-200 ఒకదాని తరువాత ఒకటి మార్చి మార్చి వాడవచ్చును.

14. ఫిట్స్ నందు K.P తో పాటుగా సిమిసిఫ్యూగా-200, సిక్యుటా విరోసా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

15. పక్షవాతములో K.P ని ప్రయోగిస్తూ దీనితో పాటుగా కాస్టికమ్-200 పవర్ లో కొన్ని డోస్‌లు వాడాలి.

16. డిఫ్తీరియా మొదలగునవి కండరాల వ్యాధులయందు k.P తో పాటుగా లెకెసిస్-200 పవర్‌లో కొన్ని మోతాదులు వేయ్యాలి.

17. నీరసానికి K.P తో పాటు చైనా-30 పవర్‌లో కొన్ని మోతాదులిచ్చిన మంచిది.

18. కాలీఫాస్‌ను ఏ వ్యాధిలకైనా వినియోగించేటపుడు మధ్య మధ్య సోరినమ్-200 పవర్ లో 1 మోతాదు; సల్ఫర్-200 పవర్‌లో 3 మోతాదులు వాడాలి.

## 7.కాలీసల్ఫ్యూరికమ్

వాడుక పేర్లు : 1.కాలీసల్ఫ్ 2.k.S.

కాలీసల్ఫ్‌ను శాస్త్ర పరిభాషలలో "సల్ఫేట్ ఆఫ్ పొటాష్" అని అంటారు. ఈ పదార్థము చర్మము పై పోరలను, వాటి పనులను, అవి సక్రమముగా ఉండునటుల నియంత్రిస్తుంది. (స్రావము లన్ని జిగారుగా లేక పలుచగా లేక పచ్చగా ఉండి, తరుచుగా స్రావములు రంగులు మారుట, అంతేగాక చర్మపు పై పొర ఊడుట దీని పనియే.) కాలీసల్ఫ్ ప్రాణవాయువును ఒక చోటనుండీ మరో చోటికి కొని పోవును.

ఈ పదార్థాన్ని గురుఇంచి డా॥ ఎలెన్, డా॥హెరింగ్‌లస్వీయరచనలైన "ఎన్ సైక్లోపీడియా" మరియూ "గైడింగ్ సిష్టమ్స్" అను గ్రంథమలలో అనేక వివరాలు కలవు.

### కాలీసల్ఫ్ వైద్య ప్రయోజనాలు

1. అమిత భారము, అమిత అలసట, తల తిరుగుట, చలి, గుండెదడ, భయ విచారములు, తలనొప్పి, కాళ్ళు-చేతుల నొప్పులు లాంటివి వచ్చి పోవుచుండునుపుడు (ఈ లక్షణాలన్నీ ఆరుబైట గాలిలో తగ్గి, వెచ్చని గదులలో ఉద్రేకించును) చికిత్సగా కాలీసల్ఫ్ అద్భుతముగా పనిచేయును.

2. అటలమ్మ, పొంగులాంటి చర్మవ్యాధులు అణగారినపుడు వీటిని బయటకు రప్పించుటకు k.S ను ప్రయోగించిన వాటిని పూర్తిగా బయటకు రప్పించి నివారించును.

3. చుండు మరియు చర్మవ్యాధులలో k.s తో పాటుగా కాలీమూర్‌ను కూడా కలిపి పై పూత మందుగా వాడవచ్చును.

4. తల తోక లేకుండా వచ్చు స్థిరత్వములేని వ్యాధులయందు k.s తో పాటుగా పల్సటిల్లా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు ఉపయోగించ వచ్చును.

5. ఊపిరితిత్తులు, జీర్ణకోశ వ్యాధులు, గొంతు వ్యాధులయందు కూడా k.s తో పాటుగా పై విధముగానే పల్సటిల్లాను 200 పవర్‌లో వాడవచ్చును.

6. చర్మము ఎర్రబడినపుడూ, మంటతో ఉన్నపుడు k.s ను వినియోగిస్తూ ఆర్సెనికమ్ ఆల్బ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.

7. నాడీమండల వ్యాధులకు k.S తో పాటుగా రూస్టాక్స్-200 పవర్‌లో కొన్ని మోతాదులు వేసిన మంచిది..

8. చర్మముపై దురదలకు k.S తో పాటుగా డొలికాస్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడాలి.





9. k.S ను వాడు అన్ని వ్యాధులలోన ౦ మధ్య మధ్య తూజా-200 పవర్‌లో 3 డోస్‌లూ, సల్ఫర్-200 పవర్ లో 3 మోతాదులు వేసిన చాలా ప్రయోజనకరముగా ఫలితాలు వుంటాయి.

## 8. మెగ్నీషియా ఫాస్ఫారికా

వాడుక పేర్లు : 1.మెగ్నీషియాఫాస్, 2. M.P.

మెగ్నీషియాఫాస్‌ను "ఫాస్ఫేట్ ఆఫ్ మెగ్నీషియా" అని శాస్త్ర పరిభాషలో పలుస్తారు. ఇది స్ఫటికము.

మన శరీరములోని కండరాలు, నరాలు, ఎముకలు, మెదడు (మరియు మెదడులోలి బూడిదరంగు పదార్థమునందు), వెన్నుపాము శుక్రమునందు-ఫాస్ఫేట్ ఆఫ్ మెగ్నీషియా అధికముగా ఉంటుంది. ఇంకా దంతాలు మరిము రక్త కణాలలో కూడా కలదు. ఈ పదార్థము మన శరీరములో లోపించుట వలన కండరాలు కుచించుకుపోవుట, నరాలు చిక్కపట్టుట అనునవి సంభవించును. ఇంకా పక్షవాతము, పక్షవాతములో నొప్పులు, తెరలు (ఫిట్స్) వచ్చుట, హిస్టీరియా మూర్ఛలు నాడిమండల వ్యాధులలో ఫాస్ఫేట్ ఆఫ్ మెగ్నీషియా లోపించటమే ప్రధాన కారణముగా శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

మెగ్నీషియాఫాస్‌ను ఉత్తమ తరగతి ఔషదాలలో "బహుళ ప్రయోజనాకారి మందు" గా శాస్త్రవేత్తలు రుజపువు చేసిరి.

ఈ పదార్థాన్ని డా॥ W.U.P. మిరియూ I.H.A. సంస్థలోని సభ్యులు రుజువు చేసారు. ఇంకా ఈ ఔషధాన్ని గూర్చి డా॥ H.C. ఎలెన్ 1889 సంవత్సరంములో "మెడికల్ అడ్వాన్స్" అనేపత్రికలో అనేక వ్యాసాలను ప్రచురించారు. డా॥ "హేరింగ్" కూడా తన "గైడింగ్‌సింస్టమ్స్" అను గ్రంథములో M.P. ని గురించి సమగ్రముగా చర్చించడము జరిగినది. 1906 సంవత్సరములో "ఇవోవా" విశ్వవిద్యాలయమందు హోమియోపతీ వైద్య శాఖలోని విద్యార్థులు ఈ పదార్థ గుణాలను రుజువు చేసారు.

### మెగ్నీషియాఫాస్ వైద్య ప్రయోజనాలు

1. ఋతుశూల, మంటతో కూడిన నొప్పులు మినహాయించి మిగతా అన్ని నిప్పులకు M.P. అద్భుతముగా పనిచేయును.

2. నరాల బలహీనతా వలన ఆశక్తులై ఉండు వారికి M.P. ని అమోఘ ఔషదముగా చెప్పవచ్చును.

3. సూదులతో పొడిచినట్లుగా శరీరములో అక్కడక్కడ సంభవించే నొప్పులు, తిమ్మిర్లకు M.P. ని గొప్ప నివార ఔషధముగా భావించవచ్చును.

4. మెరుపువలే వచ్చి పోయే నొప్పులు, ప్రసవ నొప్పులకు M.P. మంచి మందు.

5. ఆకస్మికముగా వచ్చి పోయే వ్యాధులకు M.P. అద్భుత ఔషదమని చెప్పాలి.

6. ధనుర్వాతము (టెటానస్) రాకుండా ముందు జాగ్రత్త చర్యగా M.P. ని వాడవచ్చును.

7. శారీరక వణుకునుకు M.P. చక్కటి ఔషధము.

8. పక్షవాతమునందు M.P. తో పాటుగా కాస్టికమ్‌ను 200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడినా అమిత ప్రయోజనము కలుగును.

9. శూల నొప్పులయందు M.P. వాడుతూ కోలోసంథిస్-200 పొటన్సీలో కొన్ని డోస్‌లు వాడినా మంచిది.

10. కడుపులో వాయువులు నిండినపుడు M.P. కి తోడుగా డైస్కోరియాను-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వేసిన త్వరిత గతిని భాధ నివారించును.

11. నేత్రవ్యాధులు మరియు మెదడు వ్యాదులయందు M.P. కి తోడుగా బెల్లడోనాను 200 పవర్‌లో కొద్ది మోతాదులు వాడిన మంచి ఫలితాలు కలుగును.

12. ఫిట్స్ మరియు జ్వరలక్షణములలో మెగ్నీషియాషాస్‌ను వాడుతూ దీనితో బెల్లడోనా-200 పవర్‌లో కొన్ని మోతాదులు వేసిన అద్భుత నివారణ జరుగును.

13. మానసిక వ్యాధులలో M.P. ని వాడుతూ దీనికి తోడుగా ఇగ్నీషియాను 200 పవర్‌లో కొన్ని డోస్‌లు వేసిన వ్యాధులు త్వరగా తగ్గడానికి సహకరించును.

14. నొప్పులు ఒక చోటనుండి మరొక చోటుకు మారు సందర్భాలలో M.P. కి తోడుగా పల్సటిల్లా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వాడితే నొప్పులు నివారించుటలో సహకరించును.

15. కండరాలు కుంచించుకు (క్రాంప్స్) పోవునపుడు M.P. తో పాటుగా కేక్టస్ కొన్ని మోతాదులు వాడిన క్రాంప్స్ త్వరగా నివారించును.





16. ఋతుశూలకు M.P. తో పాటుగా లైబర్నమ్-Q ని కొన్ని మోతాదులు వాడిన శూల త్వరగా నివారించును.

17. గర్భాశయ వ్యాధులలో M.P. కి తోడుగా నిమిసిఫ్యూగా 200 పొటెన్సీలో కొన్ని మోతాదులు వేసిన వ్యాధులు త్వరిత గతిని నివారించుటలో తోడ్పడును.

18. వేడిమితో ఉపశమించు బాధలకు M.P. వాడుతూ దీనికి తోడుగా ఆర్సనికమ్ ఆల్బ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వేసిన బహుళ ప్రయోజనము చేకూరును.

## 9. నేట్రమ్ మ్యూరియాటికమ్

వాడుక పేర్లు : 1.నేట్రమ్‌మూర్, 2. N.M.

నేట్రమ్‌మూర్‌ను వైద్య పరిభాషలో "సోడియమ్ క్లోరైడ్" అని అంటారు. వాడుక భాషలో టేబిల్‌సాల్ట్ (ఉప్పు) అని అంటూ ఉంటారు. నేట్రమ్‌మూర్ మన శరీరములోని ఏభాగమందు తగిన నిష్పత్తిలోలేకపోయినా ఆ భాగమందలి ధాతువులు నశించును. ఈ పదార్థము మన శరీర మందలి రక్తములోని ప్లాస్మాలో ఉంటుంది. N.M రక్తములో లోపించిన రక్తము నీరువలె పలుచగా మారిపోవును. ఇంకా శరీరము ఉబ్బిపోయి, నీరుపట్టి యుండుటయే కాక శోషవచ్చునంత నీరసము, కన్నీరు కార్చుస్వభావము వంటి లక్షణాలు సంభవిస్తాయి. అంతేకాక ఈ పరిస్థితులలో దీని స్రావాలన్నీ ఉప్పు రుచి కలిగి వుంటాయి. మనశరీరము మొత్తములో సుమారు 11 ఔన్స్‌ల (28 తులాలు) సోడియమ్‌క్లోరైడ్ ఉంటుంది. ఈ పదార్థము లాలాజలము (ఉమ్మి), మెదడు, ప్రేగులు మరియు చలన ధాతువులు యందు కూడా తగినమోతాదులో వుంటుంది.

ఇంకా మానసిక వ్యాధులు, విరేచన బద్ధకము లేక నీటివంటి విరేచనాల వంటివి శరీరములో ఈ పదార్థము లోపించుట వలన అధికముగా వస్తూ వుంటాయి. మన శరీరములో ఈ పదార్థము ఉండవలసిన నిష్పత్తికంటే తక్కువగా వున్నప్పుడు కడుపులో మంట, త్రేపులు కూడా వచ్చును.

మన శరీరములో సోడియమ్ క్లోరైడ్‌వుండవలసిన మోతాదుకంటే అధికముగా ఉన్నప్పుడు చర్మముపై నీటి బొబ్బల వ్యాధిగా బయట పడగలదు.

సోడియమ్ క్లోరైడ్‌ను హోమియోపతి వైద్యరీత్యా ప్రప్రథమముగా డా. హానిమన్ రుజువు చేసిరి. వీరు ఈ పదార్థముగురించి "క్రానిక్‌డిసీస్" అను గ్రంథములో సవిస్తరముగా తెలియజేశారు. తరువాత "ఆష్ట్రియన్ సొసైటి ఆఫ్

ప్రూవర్స్" అను సంస్థయొక్క సభ్యులచేతగూడా రుజువు చేయబడినది. డా॥ హెరింగ్ స్వీయవిరచితమైన గైడింగ్ సింప్టమ్స్ అను గ్రంథములో కూడా ఈపదార్థము గురించిన సమగ్ర వివరణ గలదు. డా॥ ఎలెన్‌చే రూపొందించ బడిన "హ్యాండ్ బుక్ ఆఫ్ మెటీరియా మెడికా" అను గ్రంథములో ఐతే సోడియమ్ క్లోరైడ్‌ను గుఱించిన వివరాలు బహువివరముగా తెలియజేయబడి ఉన్నవి.

## నేట్రమ్‌మూర్ - వైద్య ప్రయోజనాలు

1. రొంప, గొంతునొప్పి, శరీరము, పాలిపోయివుండుట, మలబద్ధకము, లేక విరేచనాలు; విపరీతమైన ఆకలి, దాహము, శరీరముఊబగా వుండుట; శారీరక ఉష్ణోగ్రత లోపించుట, చుండ్రు, తామర మొదలగు చర్మవ్యాధులకు నేట్రమ్‌మూర్ అద్భుత నివారక ఔషధముగా పనిచేయును.

2. కాలేయము, స్ప్లీన్‌ల వ్యాధులకు N.M చక్కగా పనిచేయును.

3. శారీరక పోషణ సరిగాలేక శరీరము క్షీణించుట, రక్తక్షీణత, నీటివంటి వాంతులు, నిస్త్రాణ లాంటి లక్షణాలకు ఒకగ్లాస్ నీటిలో N.M 6× పౌడర్‌రూపములో 4 స్పూన్‌లు వేసి, బాగా కలిపి వెంట వెంటనే త్రాగించిన ఆ లక్షణాలన్నీ సమసిపోవును.

4. తరుణ వ్యాధులలోనూ; గుండె జబ్బులలోనూ N.M ను పై విధముగానే ఉపయోగించవలెను.

5. నీటివంటి పలుచని విరేచనాలు ఔతున్నపుడు N.M 6×ను పౌడర్ రూపములో 6 చెంచాలు ఒకగ్లాస్ నీటిలోవేసి, బాగా కలిపి త్రాగించిన విరేచనాలు తగ్గిపోవును.

6. బలానికి, ఆరోగ్యానికి N.M 6×పౌడర్‌ను ఒకచెంచాగ్లాస్ నీటిలో కలిపి ప్రతిరోజూ త్రాగుతూ ఉండాలి.

7. తల వెంట్రుకలురాలిపోవుట, గర్భిణీస్త్రీలు మరియు వేవిళ్ళ సమయములో కూడా N.M ను పైవిధముగానే ఉపయోగించవలెను.

8. క్రిమి-కీటకాలు కరచినపుడు పైపూతకు,కడుపులోకి కూడా N.M ను తీసికొంటే తక్షణ నివారణ లభించును. ఈ పరిస్థితులలో ఎఖినేషియా-Q మరియు లెడమ్‌పాల్-200 పవర్‌లోనూ కలిపి కొన్ని డోస్‌లు వాడిన మంచిది. వీటితోపాటుగా లైకోపోడియమ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు కలిపి వాడిన మరీమంచిది.





9. మానసిక వ్యాధులలో N.M తో పాటుగా యాసిడ్‌ఫాస్ 200 మరియు ఇగ్నీషియా-200 పొటెన్సీలలో కొన్ని డోస్‌లు వాడితే ఆవ్యాధులు త్వరితగతిని నివారించుటలో సహకరించును.

10. స్త్రీల గర్భాశయ వ్యాధులలో N.M ని వాడుతూసెపియా-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వేసినమంచిది.

11. శారీరకముగా నీరు పట్టినట్టి ఉబ్బు వ్యాధులలో N.M కి తోడుగా యాపిస్-200 పొటెన్సీలోకొన్ని మోతాదులు వాడిన ఉబ్బులు తగ్గడానికి తోడ్పడును.

12. విరేచన బద్ధకములోN.M వాడుతూ ఎల్యూమినా-200 పవర్‌లో కొన్ని మోతాదులు వాడవచ్చును.

13. రక్త స్రావాలలో N.M ని ఇస్తూ ఫాస్ఫరస్-200 పొటెన్సీలో-1,2 మోతాదులు వాడితేమంచిది.

14. నీటి బొబ్బలు, మంటలు లాంటి వ్యాధులలో N.M కి తోడుగా ఆర్సెనికమ్ ఆల్బ్-200 పవర్‌లో కొన్ని డోస్‌లు వేసిన మంచి ఫలితాలు కలుగును.

15. కంతులకుN.M తో పాటుగా ఆంబ్రగ్రీసియా-200 పవర్‌లోకొన్ని డోస్‌లు వాడవలెను.

16. రక్తక్షీణతకు N.M వాడుతూ ఫెర్రమ్‌మెట-6×ను పౌడర్ రూపములో కొన్ని మోతాదులు వాడవలెను. దీనిని వాడునపుడు మధ్యమధ్య బెసిలినమ్-200 పవర్‌లో 3 డోస్‌లు; సల్ఫర్-200 పవర్‌లో 3డోస్‌లు వాడిన మంచిది.

17. తామర మొదలగు చర్మవ్యాధులలో N.M తో పాటుగా యాసిడ్ క్రైసో 6× కొన్ని మోతాదులు వాడాలి.

## 10. నేట్రమ్ ఫాస్ఫారికమ్

వాడుక పేర్లు : 1. నేట్రమ్‌ఫాస్, 2 N.P

నేట్రమ్‌ఫాస్‌ను శాస్త్రీయముగా "ఫాస్ఫేట్ ఆఫ్ సోడా" అని అంటారు. ఈ పదార్థము రక్తము, కండరాలు, నరాలు,మెదడునందలి కణాలయందు కలదు. మానవ శరీరములోని కాలేయము ఒక రసాయన ప్రయోగశాల వంటిదని చెప్పవచ్చును. అటువంటి కాలేయము స్తబ్ధతగా ఉన్న శరీరమంతా

